# ప్రాగ్జ్యోతి

(తెనుగు కబ్బము)



మూలము:

*LIGHT OF ASIA*

*by*

*SIR EDWIN ARNOLD*

అనువాదకుఁడు

కొండా రామచంద్రారెడ్డి ఎం.ఎ.; ఎల్ ఎల్. బి.

అధివక్త, నెల్లూరు.

ప్రథమ ముద్రణము - అక్టోబర్ 1959

మందాకినీ ముద్రాణాలయము
ట్రంకురోడ్డు - నెల్లూరు.



వెల: 3-0-0

దొరకుచోట్లు:

K. Ramachandra Reddy, M. A.; LL. B.
Advocate
Ramamurthynagar, Nellore.

AND

మందాకినీ కార్యాలయము
ట్రంకురోడ్డు - నెల్లూరు.

# ఆర్నాల్డును గుఱించి

"**Light of Asia** అను గ్రంథమును తొలిసారి నేను చదివినపుడు, నన్నది, భగవద్గీతకంటె మిక్కిలి యాకర్షించినది" అని గాంధీమహాత్ముఁడు తన అభిప్రాయము వ్యక్తపరచెనన్న, యీ గ్రంథ ప్రాశస్త్యమును గుఱించి వేఱుగ చెప్పనక్కఱలేదు.

ప్రపంచ ప్రసిద్ధి నొందిన మహోన్నత సాహితీ ప్రపంచమున నుత్కృష్టస్థాన మలంకరించిన యీ గ్రంథరాజము, మొదట 1879 లో ప్రచురింపఁబడిన కొలఁది సంవత్సరములలోనే, ఇంగ్లండులో అఱువదికిపై ప్రత్యేక ముద్రణలకును, అమెరికాలో నెనుబదికిమించిన ముద్రణలకును లోనై లక్షలాది ప్రతులు అమ్ముడువోయెను.

శతాధిక ముద్రణలకులోనైనను, దినదిన ప్రవర్ధమానమగు పాఠక మహాశయుల పఠనోత్కంఠకతకారణమున నీనాఁటికిని అనేక దేశములందనేక ముద్రణలద్వారా ఆంగ్లభాష వాడుకలోగల దేశములందంతట విస్తరిల్లు చున్నది.

ఇట్టి అమరగ్రంథ రాజమును, విరచించి అజరామర కీర్తినార్జించిన ఆర్నాల్డు మహాశయుఁడు, ఆక్స్ఫర్డ్ విశ్వవిద్యాలయములో యూనివర్సిటి కాలేజిలో 'న్యూడిగేటు' బహుమానము నార్జించుటతో తన కవి జీవితము నారంభించెను.

**1856** లో చరిత్ర ప్రసిద్ధినిగన్న పూనా నగరమునకుఁ దక్కను కాలేజి పిన్సిపాల్ గా ప్రథమమునవచ్చెను. అచ్చట పండితుల సాహాయ్యా

ముతో భారతీయ భాషలను, ముఖ్యముగ సంస్కృతము నభ్యసించి, యపారమైన సంస్కృత వాఙ్మయమునగల భారత రామాయణములు, హితోపదేశమాది మేటి రత్నముల చదివి, అందు కనుపించు హైందవ సంస్కృతికి ముగ్ధుఁడయి, వీరి వాఙ్మయమును, సంస్కృతిని ప్రాశ్చాత్య ప్రపంచమున కెఱుక పరచవలయునని దీక్షవహించెను. తఱువాత కొంత కాలము బొంబాయి, విశ్వ విద్యాలయములో Fellow గా నియమితుఁడయి సంస్కృత వాఙ్మయములోని మేటి మణుల నాంగ్లమున కనువదించుట ప్రారంభించెను.

అయినను డెయిలీ టెలిగ్రాఫ్, పత్రికా సంపాదఁకుడుగా యింగ్లండుకు మరలి వెళ్ళిన పిమ్మటనే, **'Light of Asia'** కావ్యమును ప్రచురించెను. వీరు రచించిన యితర గ్రంథములు:

The book of good Counsels (Hitopadesa - 1861)
The Indian Song of songs [Gita - Govinda - 1875]
The Indian Idylls [I883]
Song Celestial [Bagavad Gita - 1815]
Pearls of the Faith etc.

'Light of the World' అను క్రీస్తు చరితమును; History of the Administration of British India under Marquis of Dolhousie [1862 - 64]

జీవిత అంత్య దశలో ఆర్నాల్డు మహాశయుఁడు జపానులో కొంత కాలము నివసించెను. ఆతని మూడవ భార్య జపాను వనిత. 'Seas and Lands,' [1891] ['Japonica' [1892] అను గ్రంథములలో జపానీయుల జీవితమును మనోజ్ఞముగ చిత్రించెను.

**1888** లో K. C. I. E. బిరుదము నొంది. **1904** మార్చి **24**తేదిన పరమపదము నొందెను.



# వి ష య సూ చి క







# అనువాదకుని మనవి



ఆర్నాల్డు మహాశయునిచే నాంగ్లమున విరచింపఁబడి విశ్వవిఖ్యాతిఁ గాంచిన "ఆసియా వెలుఁగ" ను నాంగ్ల కావ్యము నా యభిమాన గ్రంథములలో నొకటి; బుద్ధుని యిద్ధ చరితంబును, బోధ సుధయు, మదీయాదర్శములలో మేటి; యతి ప్రాసంబులను నిఱుకాటంబులఁ బడక, గణమాత్ర బద్ధంబయి, గలగలఁ బ్రవహించు సరళ కవనంబను సెలయేటి, నితర భాషలలో వలెఁ, దెనుఁగుదోఁటలో వెలయింపఁ జేయుట నా చిన్ననాఁటి యాశయములలో నొక్కటి.

పావన గంగా యమునా సరస్వతీ త్రివేణులు సంగమంబై పాపహరంబును బుణ్య ప్రదంబును నగు ప్రయోగ క్షేత్రంబును విలసిల్లఁ జేసిన చందమున, నా యభిమానాదర్శాశయములను బూదీఁవలు నవలుసాగి యీ తెనుఁగుసేత ముప్పిరిఁ గొని పూచిన పూలను మాతృపాదాంకితముఁ గావించి పితౄణము నొక కొంత పాచుకొనఁ గంటిని.

ముచ్చటఁ గొలుపు మూడు బొమ్మలెదుట వేదికపైఁ గనఁబడ, వాని నొందఁగోరి ప్రాకులాడు, బాలుని వలె నాశయసిద్ధి నొందఁగోరి చాపలంబునఁ గవిని, బండితుఁడను గాకుండియు నీ యాంధ్రానువాదం బొనర్ప సాహసించితిని. ఇందుఁగల దోసంబులు నావనియు, గుణంబులు ఆర్నాల్డు కవివరుని వనియుఁ బ్రాజ్ఞులు పరిగణించి యీ చిఱుచేఁతను గృపతో మన్నింతురుగాక.

ఆర్నాల్డు మహాశయుఁ డొకచోఁ దన యుపోద్ఘాతంబున నుల్లేఖించి నట్లు గౌతమ బుద్ధుని మహోన్నత వర్తనంబును, నమ్మహనీయుని సిద్ధాంత సారంబును నీ తెనుఁగుసేఁత పాఠక లోకంబునకు సుగమం బగునట్లు కొంతకుఁ గొంత తోపింపఁ జేసిన, నా కృషి సఫలత నొందె నని భావింతును.

సహాధివక్తయు, సంస్కృతాంధ్రముల సరసకవియు "సాహిత్య రత్న"ము, శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగా రీరచన నాద్యంతముఁ దిలకించి యచ్చటచ్చటం గనుపించిన శబ్దదోషముల సవరించి ప్రోత్సహించిరి. అచ్చొత్తునపుడు, పాఠముల సరిదిద్దుచు, భాషా విశారదుఁడు మందాకినీ సంపాదకులు మరుపూరు కోదండరామరెడ్డిగారు చక్కని సూచన లొసగిరి. వీరి తోడ్పాటున కెంతయుఁ గృతజ్ఞుఁడను.

బుధజన విధేయుఁడు,

కొండా రామచంద్రా రెడ్డి.

# మాతృదేవి



శ్రీమతి. కొండా మీనమ్మగారు

---

తల్లికి మించిన దైవంబు గలదె!

తల్లి ఋణముఁ దీర్ప తరమె!! నా తలమె!!!

సమర్పణ

# మాతృదేవి

*******

నవ మాసములు మోసి కని, పాలు గుడిపి
పెంచి పెద్దగఁ జేసి బుద్ధిని గఱపి
చదువులఁ జెప్పించి నీతిని దెలిపి
ఇంటివానిని జేసి జంటఁ జేకూర్చి
ఇంత వానిగఁ జేసె నను శ్రమకోర్చి
ఏ ప్రేమమయ మూర్తి! ఏ త్యాగ వర్తి!!

పంటలల్లూరిలో నూకలపాటి
వారి వంశంబున వన్నెను గన్న
రాఘవరెడ్డికిఁ దనయగాఁ బుట్టి,
అల సింగపేటలో పేరును గాంచి
వఱలు కొండావారి వంశంబు నందు
విశ్వవిఖ్యాతుఁడై వెలుగొందినట్టి
పట్టాభిరామాఖ్య రెడ్డిగారికిని
కూరిమి కోడలై కొండాడఁ బడుచు,
శ్రీ వీరరాఘవ రెడ్డికిం గూర్చ

[illegible]ఁ దనరారె నెవతె
మగువల మేల్బంతి! గౌనముల దొంతి.!!

మెట్టినింటను బిల్వ మీనమ్మ యనుచు
పుట్టినింటను బిల్వ లక్ష్మమ్మ యంచు
తల్లియంచును బిల్వ నెల్ల వారలును
పుట్టినింటికి మఱి మెట్టినింటికిని
వన్నియ వాసియు సిరియు సంపదయు
చేకూర్చె ఘనమగుఁ దన వర్తనమున
ఏ మహనీయ! ఏ సుగుణాలవాల!!

ముగ్గురు మగవారి మూగు రాడువారి
కడుపు చల్లఁగఁ గని చక్కఁగా బెంచి
తగిన వారల తోడ వియ్యంబు లంది
ఇరు పార్శ్వములఁ గల వారి వంశముల
తన సంతతి వలన వర్ధిల్లఁ జేసి
మనుమల మఱి మునిమనుములఁ జూచె
ఏ పూతచరిత! పుణ్యంపు వారాశి!!

కష్ట సుఖంబుల సమపాలు గొంచు
తోడునీడయ్యుఁ బోలెఁ దనపతిఁ గొలిచె
ఏ సాధ్వి! తరుణుల తల మానికంబు.!!

పెద్దలు చేసిన దాన ధర్మములు

జీర్ణించి శిథిలంబులై పోవఁ గాంచి
సహియింపఁ జాలక శ్రద్ధ వహించి
వాని యుద్ధరణంబుఁ గడువడిఁ జేసి,
క్రొత్త సత్రంబుల బావుల నెన్నో
బాటసారులు దిగ వాటమై నట్టి
విడుదుల వసతులఁ దగ నేర్పరించి,
నీడచెట్టుల నాటి విశ్రమింపంగ
గుప్త దానము లెన్నో గొప్పఁగా జేసె;
తన పతి పేరిట తన గ్రామమందు
వీరరాఘవ నామ విఖ్యాతమైన
గ్రంథాలయం బొండు స్థాపన జేసె
ఏ దానశీల! యే సాహిత్య లోల;!!

ఐశ్వర్యమునఁ దాను దులతూగుచున్న
తనకడ్డు చెప్పెడివాడు లేకున్న
ఉబ్బును గర్వంబు మది నెఱిఁగకయె
డాంబికంబులకును దగని పనులకు
సొమ్ము కాసింతేని వ్యర్థ పఱుపక
తన సొమ్ము కాలమ్ము వెను దీయకుండ
సద్వినియోగముఁ గావించె నెవతె
ఏ వివేక విశాల! వితరణ శీల!!

ఎదుటఁ బడిన వ్యక్తి యెటువంటి వాఁడో
నిమిషాన గ్రహియించు బుద్ధి సూక్ష్మతయు
తగువారిఁ బిలిపించి తన పనులెల్ల
తగురీతి సాధించు కార్య దక్షతయు
గల్గి, యా యూరిలో నే యొక్కఁడేని
చేయఁజాలని గొప్ప పనుల నెన్నిటినో
తాను నిర్వర్తించె ఘనకీర్తి తోడ;
చతురత ధైర్యము తెలివి తేటలును
మగవారి సొత్తు మాత్రంబె కాదంచు
ప్రకటించె దివ్యమా తన వర్తనమున
ధీయుక్త! శ్రీమతి!! ధైర్య సంపన్న.!!!

ఎపుడు ధర్మంబును నేమరకుండ
తీర్థ యాత్రల నెల్ల తిన్నఁగా జేసి
వ్రతము లెన్నింటినో ఘనముగాఁ జేసె
దానంబు లెన్నింటినో యొనరించె
దానము ధర్మము తనలోనఁ గలసి
రూపొందె నని తన్నుఁ బొగిడ నందఱును
ధర్మపరాయణ! విజ్ఞాన పూర్ణ!!

చల్లని చూపులు మెల్లని మాట
పండైన గననీయ నట్టి చిన్నగవు

చిందులాడఁగఁ దన వదనాబ్జ మందు,
నీతియు, నియమంబు, పేరిమి, యోర్మి,
అడకువ, మెలకువ, దయయు, ధర్మంబు
సతతము సహజ భూషణములై వెలుఁగ,
మంచి తలంపులు మంచి చేతలును
మిత్రులు తనకని మదిని భావించి
చెడ్డ తలంపులు చెడ్డ చేతలును
శ్రతువు లట్టుల రానీక దరికి
తనవారి కెల్లను తలలోని నాల్క-
వలె సంచరించుచు, బ్రీతి నిండార
పరులకు నుపకార మెపుడు సేయుచును
చల్లని మాతల్లి యని చుట్టుపట్ల
గలవార లెల్లను దన్నాశ్రయింప
కల్ప తరువు వోలె, గంగగో వట్లు
పెదల పాలిటి పెన్నిధి యగుచు
దీనుల రక్షించె నే మాన్య చరిత.!

చదువకుండిన నేమి బడులలో చదువు
చిన్న తనము నుండి చదువుట వలన
పెద్దలైన వారి వ్యాఖ్యల వలన
భారత రామాయణాది గ్రంథముల

సారంబు లెల్లను స్వాంతము నెఱిఁగి,
ముద్దు మాటలతోడ ముద్దులకై న
బుద్ధి తెలుపఁ జాలు నేర్పును గల్గి,
కలకంఠమున గానమును సేయఁ జాలి
సంగీత సాహిత్య మాధుర్య మాని
వేద సారంబుల నెల్ల నెఱింగి
సత్య ధర్మంబుల సతము పాటించి
జీవహింసను మాని జీవులఁ బ్రోచి
ఇంతకు నంతకుఁ దన్నాశ్రయింప
పిన్నలు పెద్దలు పెద్దగా నెంచి
ఓర్పున పృథ్విని, లోతునఁ జలధి,
బుద్ధి బృహస్పతిఁ, జలువఁ జందురుని
మించి రాణించుచు పుణ్య మార్జించి
నరులకు సురల కాదర్శమో యనఁగ
ధన్యజీవి యగుచు దివి కేఁగె నవతె;
ఆ మాతృ మూర్తికి నంకిత మిత్తు
భక్తి శ్రద్ధల తోడ నీ తెస్గుసేత
నాలుపో గొకటి క్రొన్నెల కిడుమాడ్కి.
తల్లికి మించిన దైవంబు కలదె!
తల్లి ఋణముఁ దీర్ప తరమె!! నా తలమె!!!

ఓం తత్సత్

# ఆర్నాల్డు కవి తిలకుని తొలి పలుకు



ఈ కావ్యమునఁ గల్పిత బుద్ధ భిక్షు ముఖంబున బుద్ధ మత స్థాపకుండును, వీరాధి వీరుండును, సంఘోద్ధారకుండును నైన భారత గౌతమ రాజకుమారుని జీవిత వర్తనంబులను నాతని తత్త్వ రూపంబును జిత్రింప యత్నించితిని.

వ్యాప్తిని గన్న దేశంబుల వైశాల్యము చేతను, అనుయాయుల సంఖ్యా బలంబు చేతను, బ్రపంచమునఁ గల మతములన్నింటి కంటెను మిన్నయై, గడచిన ఇరువది నాలుగు శతాబ్దములుగఁ బ్రబలుచున్న యీ గొప్ప ఆశియా మతమును గుఱించి ఐరోపా వాసులు నిన్న మొన్నటి వఱకు నించుకేనియు నెఱుంగరు. ఈ ప్రాచీన శాక్య సింహుని యాధ్యాత్మి కాధిపత్యము నేపాలు, సింహళము మొదలుగా ప్రాగ్ద్వీప కల్పమునందంతటను, చైనా, జపాను, టిబెట్టు, మధ్య ఆశియా, సైబీరియా, స్వీన్ లాప్ లాండులో సహితము వ్యాపించియున్నది. యావద్భారత దేశమంతయు నీ భూరి మతసామ్రాజ్యములోని యంతర్భాగముఁగా బరిగణింప వచ్చును. బౌద్ధమతము నామకః యిప్పుడీ దేశమున లేకున్నను, ఆధుని కార్ష మతంబున బుద్ధుని సిద్ధాంత

ములు వ్రేళ్లూని పాదుకొని యున్నవి. హిందువుల యాచార వ్యవహారంబులు, తలఁపులతీరు లనేకంబులు బుద్ధబోధ ప్రభావ జనితంబులై యున్నవి. మూఁడనవంతు మానవజాతి నైతిక ప్రవర్తనమునకును, మతాధ్యాత్మిక చింతనమునకును నే మహనీయుడు మూలమో, యాతని దివ్యమూర్తి చరిత్రాత్మకముగఁ బూర్తిగ ద్యోతకము గాదుగాని, మానవ మానసిక చరిత్ర యందది - యొక్కటిఁ దక్క - మహోన్నతంబును గారుణికోత్తమంబును నతి పవిత్రంబును బరమ శుభకరంబునుగా గనుపింపక మానదు. విషయ వైవిధ్య వైరుధ్యముల చేతను, కాలక్రమాపాదిత కాలుష్యము చేతను, దోష భూయిష్ఠంబులైన బౌద్ధమత గ్రంథము లీ మహనీయుని నిర్దుష్ట నైర్మల్య కారుణికత్వములకుఁ గళంక మావంతయేని కల్పింపఁగల విషయంబుల నించుకేనియుఁ జేర్కొనవు. ఈ జగద్గురువు నందు, నైజరాజోచిత గుణంబులును, నుత్తమ వైజ్ఞానిక చిత్త ప్రవృత్తియు, ఆత్మ బలిదానమునకేని వెనుదీయని తీవ్ర త్యాగదీక్షయు, అపూర్వముగ మూర్తీభవించెను. బౌద్ధమత విషయము లనేకముల నపార్థముఁ జేసికొన్న బర్తాలమి సెంట్ హిలేర్ (M. Barthelemy St. Hilaire) యీ విధంబున బుద్ధుని గుఱించి ప్రశంసించినట్లు ఆచార్య మాక్సుమూల్లర్ (Proffeser Max Muller) తగురీతి నుల్లేఖించి యున్నాఁడు. "అతని జీవితము నిర్దుష్టము; అతని

చిత్తస్థైర్య మతని కృతనిశ్చయతకే సాటి; ఆతని సిద్ధాంతములు సత్యాధారములైనను నాతని ప్రవర్తన మనింద్యము; ఆతని సిద్ధాంతముల కాతఁడే సజీవ ప్రతిరూపము; ఆతని నిర్వికల్పకృప క్షణకాలమేనియు లోపింపదు; ఆఱు వత్సరములు వనవాసియై నిరంతర తపోనిష్ఠానంతరము తన సిద్ధాంతములఁ బ్రతిపాదించి, యర్ధ శతాబ్ద మవిరళముగ మాటలచే నచ్చఁజెప్పు పద్ధతిని వానిఁ బ్రచారము గావించి, నిస్సందేహముగ, సత్య సందర్శనము నొందిన మహనీయుని వలె, నాజన్మాంతము ధర్మ మనుష్ఠించిన పురుష పుంగవుని వలె, యోగివలె, జ్ఞానివలె, నా మహనీయుఁడు తన శిష్యుల బాహువుల యందుఁబ్రశాంతముగ నసువులఁ బాసెను." కావుననే మానవ జాతిని గెలిచిన యీ బృహత్కార్యము, గౌతమునికే చెల్లెను. కర్మక్రతువుల నిరసించినను, నిర్వాణము నొందియుఁ దాను మానవ మాత్రుఁడనే యనియు, నందఱుఁ దనవలె నా స్థితి నొందగలరని చాటించినను, ప్రేమ కృతజ్ఞతా భావంబులఁ బులకిత గాత్రయై యాశియా ఖండం బమ్మహాత్ముని, యాతని మాటల బెడచెవిఁ బెట్టి, భక్తి సురక్తులుప్పొంగఁ బూజన నీరాజనంబుల నారాధించుచున్నది. అకళంకములైన యాతని పవిత్రాలయంబులు కుసుమారణ్యంబులచే నహరహంబు నింపబడుచున్నవి. కోటాను కోట్లు పెదవులు "బుద్ధం శరణం గచ్ఛామి" అని యుచ్ఛరించుచున్నవి.

ఈ కావ్యగత బుద్ధుఁడు—ఆతని యునికి నెంతమాత్రము సంశయింపఁ బనిలేదు—నేపాళ దేశపరిసరంబుల క్రీ. పూ. 620 ప్రాంతమున జన్మించి క్రీ. పూ. 548 ప్రాంతమున ఔదు లోని కుసినగరమునఁ గాలధర్మ మొందెను. సచ్చిదానంద సంధాయం కంబైన నిర్వాణ పథంబును, నిరవధిక ప్రేమామృత నిత్యత్వం బును, సర్వజీవ సముద్ధరణైక శ్రేయోధర్మంబును, మానవ స్వేచ్ఛా గౌరవ ప్రతిష్ఠాపనంబును బ్రతిపాదించిన యీ పూజ్య మతంబునకుఁ బోల్చి చూచినచోఁ దక్కుంగల మతంబులు నిన్న మొన్నటివిగా గన్పించెడిని ఈ మతాచారంబులఁ బొడసూపు పొరపొచ్చెంబులు, ధర్మరక్షణోద్యోగులయిన భిక్షుక సంఘ పతన-బుద్ధిమాంద్య జనితములే గాని యన్యంబులు గావు. బుద్ధ ప్రతి పాదిత మూల సిద్ధాంత మాహాత్మ్యమును, మానవాళిపై వానికింగల ప్రభావ విశేషముచేత నెఱుంగనగుం గాని, తద్వ్యా ఖ్యాతల వలన గాని, బుద్ధసంఘపు బునాదులపైఁ దఱువాత లేచిన నూత్న సంప్రదాయముల వలనఁగాని కాదు.

ఆసియా తత్త్వంబులఁ బ్రాగ్రూపథంబునఁ గాననగుఁ గాన నే నీ కావ్యంబును భిక్షుకుని నోటఁ బలికించితి; లేకున్న నిందచ్చ టచ్చటఁ గలరారు నద్భుతంబులనుగాని యిందు రూపొందింపఁబడిన తత్త్వ ప్రకారమును గాని యింత సహజముగఁ బ్రతిబింబింప నల్లవి

గాదు. జెరూసలెమును (Jeruselem) నెబుఖాడ్నెజర్ (Nebw-chadmezzar) ఎప్పుడు వశపరచు కొనెనో, మీడ్సు జాతివారు (Medes) నినెవా (Ninevah) నెపుడు స్వాధీనపఱచు కొనిరో, ఫోసియనులు (Phocians) మార్సేల్ (Marseilles) నెపుడు స్థాపించిరో, యానాటికే, ఆధునికుల కాశ్చర్యమును గొల్పు పునర్జన్మ సిద్ధాంతమును బుద్ధుని కాలమునాటి హిందువులు ప్రతిపాదించి, యామోదముతో బాటించు చుండిరి. ఇంతటి ప్రాచీనమైన యీ మతసిద్ధాంత విపులీకరణమిం దసమగ్రముగా కెట్లుండును! అదియునుంగాక కావ్య సంప్రదాయము ననుసరించి, తత్త్వవిచారమున ముఖ్యములగు ననేక విషయంబులను, సుదీర్ఘమైన బుద్ధుని పూర్వ వృత్తాంతంబులను విపులముగఁ దెలుపకయే దాటి పోవలసి వచ్చినది. ఇంతకు నిం దారాజ తిలకుని మహోన్నత వర్తనంబును, నమ్మహనీయుని సిద్ధాంత సారంబును సమగ్రావగాహనంబగు నట్లుచితభంగి యుల్లేఖింపఁ బడియున్న నా కృతి సఫలీకృతి నొందెనని భావించెద. పండితుల వాదోపవాదంబులకు గుఱియైన ఈ సిద్ధాంతములను స్పెన్సుహార్డీ (Spence Hardy) అనువాదమునుండి యథాతథంబుగ గ్రహించి, సంప్రదాయానుగతంబుగ వచ్చు కొన్ని పాఠంబుల సవరించితిని. మఱియు నిందుఁ గనుపించు "నిర్వాణము, ధర్మము, కర్మము" మొదలగు బుద్ధమత ముఖ్యాంశముల వివరణము, సుదీర్ఘమైన

మదీయ బృహత్కృషి జన్యమేననియు, "యేమిలేమి" యే పర మావధియను శూన్యవాదంబును, నతిసూక్ష్మ కుతర్కంబులను మూఁడవవంతు మానవజాతి మూఢముగ, గ్రుడ్డిగ నమ్మియుండ దని నా దృఢ విశ్వాసంబనియు నిస్సంశయముగ వక్కాణింపఁ గలను.

తుదిని, యీ ప్రాగ్జ్యోతిని వెలిగించిన పురుషోత్తముని యెడఁ గల పూజ్య భావముచేతను నీ వాఙ్మయంబున నాకన్న మున్నెంతయో గొప్ప కృషిని, బుద్ధుని సంస్మరణంబున నొనరించిన పండిత ప్రకాండుల యెడఁ గల గౌరవ భావము చేతను, దగు విరామంబును దగు సామర్థ్యంబును లేకయే యతి త్వరితంబుగ రచింపఁ బడిన నా కృతి యందలి దోషములను మన్నింత్రుగాత యని కోరు వాఁడను. ప్రాక్పశ్చిమ వాసులొండురులు తమ విజ్ఞానంబులఁ బరస్పరము మఱిమఱి యెఱుంగుదురుగాక యను సంకల్పముతో దీఱికలేని దినములలో దీని నే గూర్చితిని. ఈ కృతియు నాచే రచితంబులైన గీతాగోవిందము (Indian Song of Songs) భారతీయేతిహాసములు (Indian Idylls.) అను గ్రంథములును, భారతదేశంబును భారతీయులను ప్రేమించిన నా స్మృతిని చిరస్థాయిఁ గావించు కాలం బరుదెంచుగాత యని యాశించువాఁడను.

— ఎడ్విన్ అర్నాల్డు.

# ప్రాగ్జ్యోతి



భగవాన్ బుద్ధ

✥✥✥✥✥✥

"బుద్ధం శరణం గచ్ఛామి"

# ప్రథమాధ్యాయము



సిద్ధార్థుఁడను రాచబిడ్డగాఁ బుట్టి
బుద్ధప్రభుండయి పుడమిఁ బెంపొంది
నిర్వాణధర్మము నెలకొనఁజేసి
ఈరేడులోకాల నీడులేనట్టి
పరమకారుణికుండు పరమప్రాజ్ఞుండు
పరమవిజ్ఞానియుఁ బరమగురుండు
గా జీవజీవకోట్ల గాపాడినట్టి
పురుషోత్తమునిగాథ ! పరమపావబోధ !!

మనుజులకొఱకంత మఱలఁ దాఁబుట్టె.

అత్యున్నతంబైన గోళంబులగువ
ప్రతినిధుల్నలుగురు ప్రాంతాధిపతులు
కలరు, పాలించుచు కరుణతో భువిని.
మరణము పిదప ముప్పదివేల యేండ్లు
ఉన్నతంబైన యాలోకంబులందు
మహాత్ములు వసించి మఱల బుట్టుదురు;
అట్టివారలలోన నొకఁడు బుద్ధుండు.

పుట్టునవేళలఁ బోధిసత్త్వు నట్టి
గుఱుతుగా మను దోఁచెఁ, గనివాని సురలు
పుడమిలో బుద్ధుండు పుట్టనున్నాఁడు
జగతిని బ్రోవంగఁ గృపతోడ ననిరి.
గంభీరముగఁ బల్కె బుద్ధుఁడీరీతి:-
"పోయెదఁ గడసారి పుడమిఁ బ్రోవంగ,
నాకును నాధర్మనిరతులకింక
చావును బుట్టుక సమసిపోఁ గలవు;
హిమవంతు చెంతను దక్షిణ దిశను
దయయు దాక్షిణ్యంబుఁ గలయట్టి జనులు
కలరు, వారికి రాజు ధర్మానువర్తి;
శాక్యవంశంబది, జనియింతునందు"
ప్రియపతి పజ్జను బవళించి యున్న
శుద్ధోదనుని దేవి రాణి శ్రీమాయ
ఆరాత్రిఁ గలఁ గాంచె వింతగా నిట్లు:
"నాకంబు నందుండి గగనమార్గమున
వెల్గున కెంజాయ ముత్యము వలెను
ఆఱుకోఱలతోడి యేనుఁగు నాఁగ
కిరణంబులాఱును గాంతులనీన
జిమ్ముచు దుగ్ధ ధావళ్యదీధితులు
నక్షత్రమొకటి రయమున దూఁకె

ఆతల్లి గర్భానఁ గుడిప్రక్కఁ జొచ్చె.
దివ్యమహానందవారిధియందు
మున్గితేలెను 'మాయ' భూనాథుజాయ.
ఇలయెల్ల నిండెను కమనీయకాంతి;
ప్రొద్దన పొడవకమున్నె యారాత్రి,
జోకొట్టినట్టులు మణఁగాఱె నలలు;
కదలాడెఁ గొండలు పట్టులు దప్పి,
పగలు పూచెడి పూలు పూచె నాఁడేయి
మధ్యాహ్న మట్టుల; నడవి జీకఁటులు
విరియగాఁ జొరఁబడి వెలిఁగింపఁజేయు
వెచ్చవెలుఁగు వలె నాతల్లియింపు
వెల్లువలై ప్రాఁకెఁబాతాళమునకు;
కందర గర్భంబులన్నింటినిండి
సవ్వడి యొక్కటి వినవచ్చె నిటుల:
"చచ్చియు బ్రతుకంగఁ బ్రతికి చావంగ
పరువడి మఱలెడు నో ప్రాణులారా!
లెండు, వినుండిదె వీనులలరఁగ.
జన్మింప నున్నాఁడు ధరణి బుద్ధుఁడు."
అంతట నిండిన దతిశయశాంతి
లెక్కకు మీఱిన యన్నిలోకముల;
జగతి యుప్పొంగెను; నేల మున్నీట

వింతహాయిని గూర్చి వీచెను గాలి.
తెల్లవాఱిన యంత నిదియంత నెఱిఁగి
వృద్ధులు జోస్యులు పల్కిరీ సరణిః
"చాల మంచిది కల! చక్కగా నిపుడు
భానుయుక్తంబయి కర్కటమమరు.
ప్రభవించుఁ బుత్రుండు దేవి మాయకును
పూత చరిత్రుఁ డద్భుత తత్త్వవేత్త
ఏకాతపత్రమ్ముగా నేలు నిలను
గోరెనా, లేకున్నఁ బ్రజల నజ్ఞాన
ముక్తుల నొనరించి మోక్షమ్ము నిచ్చు."
అవతరించెను బుద్ధుఁ డవని నీరీతిః

నవమాసములు నిండ, నగరి వనంబు
లోన, పలాశవృక్షపు నీడలోన
ఆనాఁడు నిలచెను దేవేరిమాయ,
నిక్క నిటారుగ నింగిఁ దాకుచును
పచ్చని పైకప్పు తన కిరీటముగ
ఆలయగోపురంబును బోలు చెట్టు
-బుద్ధుని పుట్టుక నెఱిఁగె కాఁబోలు-
రాణిపై నాతపత్రము లీల వంగె
చలువపూపందిరిగా కొమ్మ లమర
నేల యీనెను వేల పూలపాన్పడ్డ

పట్టు పానుపు గాఁగ; స్నానార్థ మందె
గట్టెజాయి పగిలిన గబగబ వెడలె
స్ఫటిక నిర్మలమైన యొకవారిధార.
గొప్పపుట్టుకఁ జాటు గుర్తులై దాల్లు
మఱిరెండు కనుపింపఁ గానుపు నొప్పి
కానుపింపకఁ బుట్టె భువిని బుద్ధుండు.
ఈవార్త వ్యాపింప నగరమందంత
తల్లిని బిడ్డను దోడ్కొని పోవ
వడివచ్చె వన్నెల పల్లకి యొకటి;
పల్లకి బోయీలు గారన్యులెవరో,
నాల్గుదిక్కుల నేలు దేవతాధిపులె!
మనుజుల చేతల లిఖియించువారు
మేరువు డిగి వడివచ్చిరి వారు
వెండి తొడుంగులు ముత్యపు డాలు
ప్రాగ్దిశానాథుని సేనలకమరు;
నీలాశ్వముల నెక్కి నీలి కేశములు
దాల్చు సంబంధులు, దక్షిణదిక్కు
నేలెడి ప్రభువును గొలిచెదరెపుడు,
ఎఱ్ఱగుఱ్ఱములెక్కి పగడపు డాల్లు
చేఁబూని నాగులు వెంటరా నలరు
పడమటికి డనేలు ప్రభుసత్తముండు;

జాతరూపముతోడి యుడుపులఁ దాల్చి
పసుపుగుడ్డములెక్క పైడియద్దకము
లను బూని యక్షులు చుట్టియుండెదరు
ఉత్తరదిశసేలు నేతనెల్లపుడు.
వారి వేసము మాని దేవతలయ్యు
పల్లకి మోయు బోయీలైరి నాఁడు;
తెలియనీయక పైకి తమరూపు సురలు
సరులతో నానాఁడు కలసి మెలసిరి.
పుడమిఁ బ్రోచుటకునై చనె బుద్ధుఁడంచు
నాకలోకము సంతసమున నుప్పొంగె.

కల యర్థమేమిటో కానంగలేక
కలవర మందెను శుద్ధోదనుండు.
స్వప్నార్థమెఱిఁగిన పండితులనిరి:
"ఓ రాజ! జగమేలు జగజెట్టి బిడ్డ
అవని పాలించు నేకచ్ఛత్రముగను
పుట్టుదురిటువంటి వారలు భువిని
వేయేండ్ల కొకసారి; మఱియును గనుము
శ్రీలు నింపెడు శుభచిహ్న సప్తకము-
దివ్యచక్రము - చక్రరత్నము - మణియు,
అశ్వరత్నము- మబ్బు లెగయు గుఱ్ఱంబు,

హస్తిరత్నము- తెల్లయేనుఁగు మోాయ,
యుక్తి సంయుక్తుఁడౌ మంత్రిసత్తముఁడు,
అపజయ మెఱుఁగని యట్టి సేనాని,
ప్రాభాత సౌందర్య రోచిని మించి
స్త్రీరత్నమిా, భవ్యచిహ్నము ల్గలుగు
సప్తలక్షణ లక్షితుఁడు దేవుఁడితఁడు.”

గుఱుతులఁ గాంచి సందేహము వీడి
పురములో నెల్లను బండుగఁ జేయ
ఉత్తరువులఁ జేసె నుర్వీశ్వరుండు.
వీధులనూడ్చి పరిశుభ్రముగను
పన్నీరు చిలికిరి బాటలయందు
జెండాలు దీపాలు నిలిపిరి చెట్ల;
వేడుకఁ జూడఁగ వచ్చినవారు
ఆనంద మొంద వినోదము లెన్నో
రాజాజ్ఞ నానాఁడు రాజిల్లెనచట.
బొమ్మరాటలు చిత్రములు విచిత్రములు
ఇంద్రజాలములు మహేంద్రజాలములు
బాకాలు డప్పులు బలువాయిద్యములును,
కాళుల గజ్జెలు దాళముఁ దెలుప
గంగురంగుల వల్వ లందంబుఁ గూర్ప

ఆశ్వీని పౌర్ణిమొయ్యారంబు లొలుక
ఆటవెలందులు భావరాగముల;
చంద్రోదయంబున సంద్రంబుమాడ్కి-
ఉత్సాహమున బొంగె నగరమానాఁడు.
ఈవార్త విని దూరదూరమునుండి
ప్రభులు సామంతులు వందలు, వేలు
కానుకల్కట్నాలు గడువేడ్క తోడ
బంగారు పళ్లెరంబులఁ దెచ్చిరపుడు;
రత్నాలు ముత్యాలు చందనంబులను
పరిమళ ద్రవ్యము ల్పునుఁగు జవ్వాది,
వెలలేని మణులను గడుదుర్లభముల,
మడతలు పన్నెండుఁ బెట్టి తాల్చినను
తాల్పరి మైపస దాపఁగ లేని
నీలాంబరపు రంగు సన్న చీరెలును,
ముత్యము ల్పొదుగంగ ముద్దులు గుల్కు-
సాలువుల్ పంచలు కంబళంబులను.
సర్వార్థసిద్ధి నా బాలునిపేరు
ప్రేమతోఁ బెట్టిరి వచ్చినవారు.

అటువచ్చు వారిలో నసితుండు గలఁడు
ఋషిసత్తముఁడు, వృద్ధు, జ్ఞానియు, యోగి,
ఇహసుఖంబు నెల్ల విడచినవాఁడు

వటతరుచ్ఛాయ ధ్యానంబున నుండ,
ప్రభవించినాఁడు బుద్ధుండని సురలు
గానంబు సేయంగ విని చూడవచ్చె;
వచ్చెడి ఋషిగాంచి యెదురేఁగి నేగ
రాణియు రాజును దోడ్కొనివచ్చి
అర్ఘ్యపాద్యములిడి కూర్చుండఁ జేసి
పాపను బాదాలపైఁ బెట్టఁబోవ;
తప్పు తప్పంచును దప్పించుకొంచు
సాష్టాంగముగ మ్రొక్కె నెన్మిదిమార్లు
బిడ్డ బుద్ధుండని బుద్ధి నెఱిఁగి,
"పూజింతు నో పాప పరమాత్మ నీవు
అరుణకాంతి యదిగో నడుగులయందు.
స్వస్తిక చిహ్నంబు లితరము లవిగో
ముఖ్యమైనట్టివి ముప్పదిరెండు
ఎనుబది తక్కఁగా గలవి యల్లవిగో!
ఓ రాజ! వినుమయ్య యీ బాలకుండు
యుగమున కొకసారి మనుజవృక్షమున
ప్రభవించుఁ బూవగు; జ్ఞానగంధంబు
విరజిమ్ము జగమున, ప్రేమామృతంబు
తీయని తేనె సోనలుగ వర్షించు.
కాయంబుఁగల ప్రాణికోటులనెల్ల

ధర్మంబు బోధించి తరియింప జేయు,
కాలము సన్నిహితంబగు నాకు
వినఁజాల నీపూజ్య పలుకుల నకట!
చూచితి బుడుతని నంతోషమాయె.
ధన్యమాయెను రాజ! నీమువంగడము
ఏవ్వరులో బుట్టె నీదివ్యసుమము;
ఇహదృష్టితోఁ జూడ నట్టులఁ గాదు
వీనికై నీవెంతో వేదనఁబడెదు
చల్లని తల్లి యోదేవేరి! వినుము
ప్రియతమ వౌదువీ బుడుతని కతన.

నరులకు సురలకు నెల్లజీవులకు
దుఃఖముల్ నినువీడి దూరమై పోవు
బ్రతుకొక దుఃఖమై బ్రబలుటచేత
ఈనాటి కేఁడు దినమ్ముల కీవు
బాధ యించుకలేక పడయంగఁ గలవు
బాధావిరహితంబు బరమపదంబు”

చెప్పినయట్టు లేఁడవనాటి రాత్రి
చిరునగ వెలయంగ సుఖనిద్రఁజెందె
మాయ, పెద్ద నిదురయది కడకాయె.
చేరె “త్రాయస్త్రింశ”సను నట్టి మేటి

స్వర్గధామంబును సంప్రీతి తోడ;
ఆమాతృ మూర్తిని సురలహరహము
భక్తితోఁ బూజించి కొలుతురు శ్రద్ధ;
రాజకాంత మహాప్రజాపతి నామ
మాఱుఁదల్లి యగుచుఁ బ్రేమతోఁ బెంచె
ప్రేమపఱె నెవ్వఁ డవనిలోఁ బంచె
ఆపాపకుం దన చనుబాల నిచ్చి.

బుడుతని కెనిమిదేఁడులు నిండ తేఁడు
-పాపఁడు సర్వజ్ఞుఁడని యెఱుఁగండు-
రాజోచితమ్మగు శిక్షనొసంగ
మంత్రిమండలినెల్ల నాయత్తపఱచి,
రాచబిడ్డకుఁ దగు విద్దెల గఱప
దక్షుఁడెవ్వండని ప్రశ్నించెవారి.
ఐక్యకంఠముతోడ ననిరి వారిట్లు--
"కలఁడు విశ్వామిత్రుఁడనెడు ధీశాలి
శాస్త్రపారంగతుం డస్త్రశస్త్రముల
గుట్టెఱింగినవాఁడు దిట్టయాతండు."
రాజాజ్ఞ వచ్చె విశ్వామిత్రనరుఁడు
శుభముహూర్తముఁ జూచి చదువుఁ జెప్పంగ
మణులతోఁ బొదిగిన యంచులు మెఱయ

చందనపుఁబలక బలపముఁ బూని
వినయముతో వచ్చె గురువు నొద్దకును
అవనత వదనుఁడై భావిబుద్ధుండు.
పరమపవిత్రమా సావిత్రి నిట్లు
వ్రాయుము బాలక యని బల్కె గురువు,
"ఓం, తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్యధీమహి
ధియో యోనః ప్రచోదయాత్"
ఆచార్యు లిఖియింతు నని పల్కి వ్రాసె;
దేశదేశములందు మాఱుమూలలను
వివిధజాతులయందు వేఱువేఱుగను
నానావిధంబుల నలరారు లిపులు,
నాగిరి, దక్షిణి, మంగళి, పరుష
సేటునే, యవ, లిద్ధి, ఉక్ దారదయును
మాన మధ్యాచారి మొదలగు లిపుల
బొమ్మలతోడను, సంజ్ఞలతోడ,
అశేషజాతుల వారి యక్షరంబులను
కొండగుహలయందు కోనసీమలను
పాతాళమందు వసించు నాగులును
సూర్యసర్పార్చకుల్ వాడుభాషలను
అవి యివి యననేల యన్ని భాషలను
చాలించి వ్రాసెను గణితంబుఁజెప్పె;

ఒకటి రెండు మూఁడు వరుసగా బల్కి-
లక్ష వచ్చు వఱకు నాత్రోఁడ నన్న
తడఁబడ కించుక తోడ్తోడఁ బల్కి-
ఆఁగ కాబాలుండు చెప్పె నా మీఁద
గణితంబు నంతయు నిశ్శేషముగను.
కోటి మొదలుకొని కల్పమ్ము వఱకు
దేవతల్యాదు మహాకల్పములను
సంఖ్య లసంఖ్యాకముల సవిస్తరము.

మెచ్చె, మంచిపనుచు గోలతిలు నెప్ప
మాయను బాలకుండనెయు నీరీతి-
యాచార్యవర్య! నే వివరింతు వినుఁడు
పరమాణువులు పది పరసూక్ష్మమగును
పదియువ్వి యగునొక్క త్రసరేణు వగుఁగ
త్రసరేణుసప్తక మొకకరణంపు
సూక్ష్మతమంబైన సలుసగుఁ జూఁడె;
ఈ విధంబున బాలుఁడద్భుతంబుగను
యోజనమ్ము వఱకు క్రమముగఁ దెలిపి
గురువరా వివరింతు యోజనమ్మంచు
సూక్ష్మకణమ్ముల మొత్తము సరిగ
యని చెప్ప విభ్రమాశ్చర్యము ల్గలుగ
వేగ విశ్వామిత్రవర్యుఁడు లేచి
పాదాలకెఱఁగుచుఁ బలికె నీరీతి:

"గురులకు గురుఁడవు గురుఁడ నేనేను
పాత్రముల్ పనిలేక బడికిఁ బోకుండ
సర్వంబు నెఱిఁగియుఁ జాటవచ్చితివి
ఎఱుకతో వినయంబు మేళవించెదవు:

వారికి మించిన జ్ఞాని తా నయ్యు
గురువులందఱియెడ సిద్ధార్థుఁ డెపుడు
వినయంబు తోడుత వర్తిల్లుచుండు.
విజ్ఞాని యయ్యును వినయవంతుండు,
గంభీరవర్తనుఁడయ్యు, సౌమ్యుండు,
వీరవర్యుండయ్యు సహనముఁ గల్గి
మెత్తని మనసుతో మెలఁగుచు నుండు;
పడుచు వారల తోడ పందెము లొ్వచి
చెదరి బెదరు లేళ్లఁ దరుముటయందు
అశ్వవేగంబున నందఱ మీఱు;
ఆస్థాని వర్తిల్లు పోటీలయందు
తన రథ మన్నిట కంటెను ముందు
సాగిపో వాజులఁ దోలుటయందు
అందఱి కంటెను కడు మొనగాఁడు.
కాని యాటల మధ్య నున్నట్టు లుండి
ఆఁగి చేఁజిక్కిన జింకను వదలు,

అలసిన యశ్వరాజంబుల నిలుపు,
గెలువలేని సఖులకై జాలిఁజెంది
సగముపై గెల్చిన పందెము స్వీడు,
ఏవేవో భావాలు దలఁపునఁ దోఁప;
చిన్ని మొలక మహావృక్షమై పెరిఁగి
నిడుపు నీడల చుట్టు నిలిపెడి రీతి
వయసు మీఱఁగఁ గృప వృద్ధిగాఁ జొచ్చె
అంతకంతకును స్వభావసిద్ధముగ.
రాజతనయుఁడౌట బాలబుద్ధుండు
మదిని దా నెఱుఁగఁడు మచ్చునకైన
దుఃఖమనఁగ నేమొ బాధ యెట్టిదియొ,
వింతపేరులు గాగ వినియుండు గాని.
ఆమని నొకవేళ రాకొమరుండు
ఉద్యానవనములో విహరింపుచుండ.
అంచలబారొక్క టాకాశవీధి
ప్రీతిమై వలపుల పలుకులు మిగుల
ప్రేమచోదితములై వాయువేగమున
గూళ్లను జేరంగ నుత్తరంబుగను
మంచుకొండను జేరఁబోవుచు నుండె
బుద్ధుని దాయాది దేవదత్తుండు
తిలకించి వానిని తీక్ష్ణమైన

బాణంబు వదలెను గుఱి సరిచూచి;
చాచిన ఱెక్కల గ్రుచ్చుకొనంగ
వదలిన వాల్తూపు గుఱి తప్పకుండ
అంచ యొక్కటి పాపమ వనిపైఁబడియె,
విలవిలఁ దన్నుకొంచును బాధపడుచు
తెల్లని రెక్కలు కారునెత్తుటను,
ఎఱ్ఱగామారి వికారముగాఁగ;
దానియవస్థకుఁ గృపచిగురొత్త,
పులుఁగును రాపట్టి మెల్లఁగానెత్తి
మెత్తని తన తొడమీఁదను బెట్టి
ఈఁకలఁ దన కేల సవరించి నిమిరి
వెఱపును బ్రోఁద్రోలి యలజడి నణచి
మెల్లఁగా స్వస్థత మేకొనఁ జేసి
చల్లఁగ క్రూర నారాచముం బెఱికి
అల్లన మందు మాకులను బట్టించె.
తనకు బోధపడఁగ బాధ యెట్టిదియొ
తన చేతిలో గ్రుచ్చుకొని వాఁడియలుఁగు;
కలరూపు కానరాఁ గన్నీరుఁగార్చి
పులుఁగు నొప్పినుడుప గడగెనుమరల

ఇంతలో నొక లెంక వడివడి వచ్చి
"మాదొర పడవైచె నొకపక్షి నిపుడు

పడియుండు నిచ్చట ప్రాపాదరిండ్ల
యిచ్చి దానిని నన్ను బంపుమా" యన్న
చిఱునగ వెలయఁగ సిద్ధార్థుఁడనియె:
"చచ్చిన హంతకు సొత్తగుఁగాని
చాకున్న నెబ్భంగి నిత్తునుదీని,
రెక్కల నాడించు నద్భుతశక్తి
ఉడుగంగఁ జేసెను బాణప్రయుక్తి,
అంతమాత్రనఁ బక్షి యాతని దగునె?"
దేవదత్తుండనెఁ బ్రత్యుత్తరముగ--
"నింగి నెగయుఁ బులుఁగు లేరివి కావు
ఇలకు దెచ్చిన వానివే నగు నవ్వి
చచ్చిన బ్రతికిన నేభంగినైన
అట్లాట నాదైన యంచ నాకిమ్ము"
అంచ నక్కునఁ జేర్చియనియె బుద్ధుండు:
"అనుకంప జనియింపఁ బెంపారుప్రేమ
బాధ నివారించి బ్రతికించినాఁడ
దయయు దాక్షిణ్యంబు తగుఁదగు నంచు
చాటింతు జగతిని సమయింతుఁ బీడ:
ప్రేమ యుత్తమమైన కృప గొప్పదైన
అంచ నాయది, నీవు సరిగాదటన్న
బెద్దవారల కిది యొప్పగించెదము."

మఱునాఁడు నిండు కొల్వునఁ జర్చవచ్చె
పలికిరి పలువురు పలువిధంబులుగ
అందొక్క సరిక్రొత్త యతి లేచి నిలచి
అనెనిట్లు సభనున్న వారెల్ల వినఁగ:-
“ప్రాణి రక్షించిన వానిదౌ గాక
నాశనం బొనరించు వాని దెట్లగును ?
ప్రేమ పోషించును హింస తాఁ ద్రుంచు
పక్షి రక్షకు సొత్తు సందేహమేల”
ఇంత యొప్పునే తీరుపని రెల్లవారు
గౌరవింపఁగ జూఁడ యతి కానరాఁడు
కన్పించె నొకనికి సర్పరాజంబు
ప్రాఁకిపోవఁగ దివ్య లోకొక్కసారి
కనుపింతు రిటుల సందేహంబుఁ దీర్ప;
కృపఁ జూప మొదలిడె నీరీతిఁ బ్రభువు
ఇదిగాక యెఱుఁగడు బాధ వేఱొకటి
బాధపోవఁ బులుంగు బాగయి పోయి
నిజజాతిఁ జేరంగ నెగిరి తాఁ జనియె.

ఒండొక దినమున నామనివేళ
తనయునితో దండ్రి తగనిట్లు పలికె:-
“రమ్ము వసంతశోభను దిలకింప,
గ్రామము ప్రజలెట్లు కృషిసల్పి కడఁక

బంగారు పంటలఁ బండింత్రో పుడమి
పన్నులఁ జెల్లించి నింపి బొక్కసము
తమ పోషణము నెట్లు గావించుకొందురో
పృథ్వీపతివి గావె నావెన్క నీవు"
అని తోడుకొని పోయెఁ దనయు నొక్కెడకు
ఋతుశోభ దీపించె నూతనరుచుల
చిగురించు చెట్టుల వికసించు పూల
పచ్చని పొలముల పనివారి రొదల;
ఒక్కచో తోఁటలో రైతు దున్నంగ
చక్కని చాళులు లోతు తెగంగ
అలలుగాఁ బొరలి వెన్దిరిగెను మన్ను,
జలజలఁ బ్రవహింపఁ గాల్వల నీరు
దరులందు చిగురించెఁ బచ్చిక పూలు,
మొక్కలు నాటంగ మఱియొక చోట
ముసిముసి నగవుల భూమాత మురిసె;
పక్షులు పచ్చని వృక్షాలఁజేరి
కిలకిలా రవముల గీతికల్ పాడె;
పొదలందు నానంద పారవశ్యమున
రొదఁజేసెఁ దుమ్మెదల్ కీచురీఁగలును
ముచ్చట నుడుతలు కొమ్మలఁ జారె
బల్లులు పాములు నటునిటుఁ బారె

చిలుకలు పండ్లను బొడిచి భక్షించె
చిగురుటాకులు మెక్కి గండు కోయిలలు
కుహూకుహూ యనికూసెఁ గర్ణపేయముగ,
చిలుక గోర్వంక సీతాకోకచిలుక
వింతవర్ణములు కన్పండువుఁ జేసె,
దరహాసవదనంబౌ సుందరకాంత
వలె నుండె వనము వసంతాగమమున;
నింగిని గ్రద్దలు గిరగిరఁ దిరిగె
సరసులఁ జేపలు సయ్యాట లాడె
నీటికాకులు నిల్చె నెనుముల మీఁద
రంగుగోపురములఁ బింఛముల్విప్పి
బహుభంగుల నటించెఁ గేకితండంబు
దూరాననుండెడు పల్లెలనుండి
వినఁబడె మెల్లన పెండ్లి సందడులు;
ఎచ్చోటఁజూచిన యింపునుసొంపు
ఆహ్లాదకరముగ నలరారెనవని,
వీనిని వీక్షింప రాకొమరునికి
డెంద మానందంబుతో నిండిపోయె.

ఔగాక యిది పైకి యగపడు రూపు
తెరఁదొలగించి లో దొంగిచూడంగ
అగుపడు రీతులు తీరులు వేఱు

బ్రతుకను పన్నిటి పూవులనంటి
మొలచిన ముళ్ళను గనుఁగొనె నాఁడు.
బ్రతుకుపై నాసచే బానిసయగుచు
బువ్వకై పలుపాట్లుబడు బీదరైతు
పగలురే యనకుండ చెమ్మట లోడ్చు,
మండుటెండను ద్రోలు ములుగోలఁ బసుల
పురుగులఁ దినుగప్ప దినుదానిఁ బాము
వడిఁ దన్నుకొనిపోయి తినువీని గ్రద్ద
చిన్నచేపను మ్రింగుఁ బెద్దది నీట,
ఎలుకను దిను బిల్లి, పిల్లిని గుక్క-
డేగ గూఁబను గొట్టు గూబ పిచ్చుకను,
ఒకదానిఁ దెగటార్చి యొకటఁ దామడియు
చావుపై మనుగడ సాగిపో నకట!
సొంపుగా బైరూపు కనుపించుగాని
మనుజుఁడు మొదలుగా బ్రువ్వులవఱకు
కరుణలేకించుక కడుకర్కశముగ
బ్రతుకు టాసను బిశాచంబులఁబోలి
హత్యపై హత్యయుఁ గుట్రపై గుట్ర
గావించుచుందురు కడు దయమాలి.
ఇవియెల్లఁ దలపోసి నిట్టూర్పుఁబుచ్చి
కాఁబోలు నిదికనఁ గొనివచ్చెనిటకు

బడుగు రైతుల బాధ, పశువుల గాథ
నింగి నేలను నీట నిటనటననక
ఎచ్చోటఁజూచిన హింసయుఁ బీడ
వీని గుట్టెమిటో తలపోయువాఁడ
అనుచు సిద్ధార్థుండు దాపుననున్న
జంబూతరుచ్ఛాయ బుద్ధుని పగిది
పద్మాసనస్థుఁడై తలపోసెనిట్లు:-
"బ్రతుకను రోత రోగంబున కేద్ది
మూలకారణ, మెద్ది ముక్తిమార్గంబు?
ప్రాణికోటిపయిని బంధురప్రేమ,
బాధ నివారింప గాఢమౌ వాంఛ
పట్టఁగారాక పెల్లుబికి యుప్పొంగి
కరుణాసముద్రుని హృదయమ్ము కలఁప
పారవశ్యతనొందె భావరాజంబు.
మనుజ సహజమైన మమకారములను
విషయవాంఛల వీడి నిర్మలుఁడగుచు
ధ్యాననిమగ్నుఁడయ్యెను బాలకుండు
మొదటి మెట్టిదికాదె ధర్మమార్గమున
అత్తఱి నెత్తుగా నాకాశసౌధ
నెగిరిపోవుచు నున్న వేల్పు లైదుగురు

వటవిటపిని దాటిపోఁ బోవ నపుడు
స్వేచ్ఛగా సాగుఱెక్కలు తడంబడియె.
మంత్రముగ్ధము లైన సర్పాలబోలె
ముందుకుపోలేక నిలిచిరి వారు.
మనకు మించినశక్తి మలపెను మనల
ఏమౌనో"యని వారు దిగులఁజూడంగ,
రక్తైకదీక్షతో ధ్యాన సుస్థిరత
కనుపించె బాలుండు కాంతిసాగరుఁడు.
వినవచ్చె నొకవార్త వనమునందుండి:-
"జగమును రక్షింప దిగివచ్చినాఁడు
బుద్ధుండు దిగిరండు భక్తిఁబూజింప"
వినిదాని వారలు రయమునవ్రాలి
స్తోత్రంబుసేసిరి రుచిరస్వరముల
ముకుళితహస్తులై ముడిచిఱెక్కలను;
దివ్యుల కీశుభవార్తను దెలుప
ఱివ్వున నెగిరిపోయిరి వారుదివికి

రాజాజ్ఞఁ గొందఱు వెదుకఁగావచ్చి
కాంచిరి సిద్ధార్థు ధ్యాననిమగ్ను
మధ్యాహ్న మరుగఁగా మార్తాండుడపుడె
పడమటి కొండలో బడఁబోవుచుండె

నిడుపునీడలు మాసిపోవుచు నుండె.
జంబూతరుచ్ఛాయ వీడదాచోటు
ధ్యాననిమగ్నుని యుత్తమాంగమును
తరణికిరంబులు తాకనోయంచు;
అ దృశ్యమునుగన్న వాని వీనులకు
వినఁబడె నెలుగొండు వింతగానిట్లు
పూచినపూలు వల్కినవోయనంగ
"పిలువఁగాబోకుఁడీ! యిపుడురాపట్టి
ఆతని మనమున్ను నలమియున్నట్టి
తెలియుమి యనునీడ వెడలదెంచాక
నానీడ కదలదీ చోటు నందాక."



# ద్వితీయాధ్యాయము

పదియు నెన్మిది యేండ్లు నిండ బుద్ధునకు
ప్రాయంపుఁ గుసుమంబు పొటమరింపంగ,
ముచ్చటఁ గొల్పెడు మూడు నిలయములు
రాజాజ్ఞ నిర్మింపఁగాఁ బడె నందు
వాన కాలము నెచ్చఁగా నుండునట్లు
మలచిన దూలాల వాసాలతోను
గంధపుఁ జెక్కల నలరారు నొకటి
వేసవిఁ జల్లఁగా నుండెడి భవనము
చలువ రాతి గృహంబు చక్కని దొకటి,
చలికాలమున కనువగు నట్టిదిగాఁ
నీలంపుఁ బెంకులఁ గప్పుగాఁ బఱచి
కాల్చిన జాతితో గట్టిన దొకటి.
శుభ, సురమ, సురమ్య యను పేరు లొప్పు,
రంజిల్లు చుండె నా భవనత్రయంబు.

ముచ్చటఁ గొలుపుచుఁ జట్టును బెరిగె
ఉద్యానవనములు హృద్యంబు లగుచు;
జలజల నటునిటు సెలయేళ్లుపాఱె,
చక్కని పొదరిండ్లు చలువపందిళ్లు
పూవుల బాటలు మోదంబు నింపె.
విహరించె నిచ్చోట విచ్చలవిడిగ
నిత్యనూతనములౌ వింత వేడుకలు
కాలమ్మును హరింప గజదొంగల వలె
రాపట్టి యౌనోత్సాహ మువ్వొంగ.
కాని, వీని నసుమ వదలక వచ్చె
ధ్యానంపు ఛాయలు, జాలి తలఁపులు
స్వచ్ఛమౌ కొలకుల జలములయందు
కదలు మబ్బుల నీడ కన్పడు నట్లు.

గమనించి వానిని గ్రక్కున ఱేడు
మంత్రుల రావించి మంతనమాడె.
"వింటిరి గాదె ము న్జోస్యులనంగ:
రాజాధిరాజౌను దా గోరుకొన్న
లేకున్న సన్న్యాసియై సంచరించు"
అన్నట్లు వారలు జరుగునో యేమొ
వింత సుఖంబులఁ జొక్కుచు నుండి

కొంత విచారము సలుపు బాలుండు,
చక్రవర్తి యగునో సన్న్యాసి యగునొ;
డెందంబు కొందల మందెడి నాకు
కడు బుద్ధిమంతులు కాఁబట్టి మీరు
పెడదారిఁ బట్టక రాజగు నట్లు
తగు నుపాయంబును యోజింప రయ్యా,
కన్న కడుపు గానఁ గడుదీపి బిడ్డ
డిక్కెవ్వ రిక లేరు దప్పవాఁ డొకఁడు"

అనిపల్క వారిలో వృద్ధుఁ డిట్లనియె
"ఏంతవర్తన మాన్ప వెఱవగు వలపు;
వాలుచూపుల డాలు వాతెఱ తీపి
మహిమ నెఱుంగఁ డీ బాలుఁ డిప్పటిక
కాంతలు గారె సంసార కారణము;
తమ యౌవనము చేతఁ గవ్వింపఁ జేయు
సహచరులను బంపు సొగసుల జెలుల
గిలిగింత బెట్టు కౌగిళ్లలోఁ బొదివి
వలపుల కడలి డోలికల నూఁగింప,
యోచన మఱలింప కమల లోచనల
కడగంటి చూపులే కడు సమర్థములు"

అనవిని యెల్లరు నౌగాక యనిరి
కాని, రాజటులనె, "మనమెన్ను కొన్న

కన్యక నచ్చఁగా వలదె యాతనికి
మెచ్చునో మెచ్చఁడో మదిని యాతఁడు;
తాకటు, లింపు సొంపులు గుల్కు నట్టి
వాసనఁ జూపని పూవుల నెన్ని
కోసి తెచ్చి నిలుపఁగా దనయెట్ట యెదుట
ఇచ్చ వచ్చిన వాని నేలుకొనంగ
మది మెచ్చుకొని వాని రూపసంపదను
ఊరకుండునో యేమో కోర కొక్కటియు;
వాని వలపుఁ బిల్పు వాచవి రుచియు
యెఱుఁగఁ డొక్కటియును బసిబాలుఁ డితఁడు"
అదివిని యందొక్కఁ డనియె నీరీతి:
"అలుఁగునఁ బడుదాక యెగురును బులుఁగు;
కావునఁ జాటించి నగరిలో నున్న
సుందరాంగుల నెల్ల సమకూడఁ జేసి
ఆటలఁ బాటల నందచందముల
పోటీలు బెట్టించి వారి కందఱికి
తగురీతి బహుమతు ల్పంచి పెట్టింప
రాకుమారుని చేత, వారిలో నొకతె
గాకున్న నొక్కరైనను దప్పకుండ
యువరాజు మనము నాకర్షింపఁ గలరు;
వలపు వలలఁ జిక్కు పగపును మాను

తెప్పక రాపట్టి" యని చెప్పఁగాను;
రాజాజ్ఞఁ జాటిరి రాజ్యమం దంత:-
కొలువుఁ దీరును ఱేడు నేఁడు వేడుకను
నగరిలో గలయట్టి కన్య లందఱును
రూపలావణ్యంబు దీపింప వచ్చి
పారితోషికములఁ బడయంగ వచ్చు.
స్వయముగ బహుమతుల్ ప్రభుసూనుఁడిచ్చు."
ఆలించి చాటింపు నతి కౌతుకమున
కన్నియ లున్నీట జలకంబు లాడి
సింగారములు దీర్చి పెన్నెఱి కురులు
పలువిధంబుల దిద్ది, యలరులు దుఱిమి
నొసట బొట్టును బాదములకుఁ బారాణి
పెట్టి పట్టించి మైపూతల నలఁది
పట్టు పుట్టంబులు చల్వ వల్వలను
బహుభంగుల ధరించి వాసన ల్దాల్చి
నగలు నాణ్యంబులు నవురుగా మెఱయ
చెక్కిళ్ల సిగ్గులు చిందులు ద్రొక్క
సొగసుల నిగ్గులు శోభిల్లు చుండ
ఆస్థానమును జేరి యభిరామ లీల
ఒక్క రొక్కరు గనుఁ సిద్ధార్థు నెదుట
నడచిరి తలవంచు కొని యంచ లటుల;

అందని పండని రాపట్టిఁ దలఁచి
యిచ్చిన కానుక ల్చేబుచ్చుకొనుచు
బెదరు జూపులు దోప గబగబఁ జనిరి
గుంపు జేరఁగఁ జను జింకల వలెను.
రాగంబు నొక వికారంబును లేక
రాపట్టి జూపట్టె, ప్రతిమ నిశ్చలత,
కానుకల్ తఱిగి పోయిన వెన్క వచ్చె
కడపటి పడఁతిగా సిద్ధార్థు కడకు
రమణి యశోధర పార్వతివోలె
చూపులు మారుని తూపులో నాఁగ
కన్నులు వలపుల పిలుపులో యనఁగ
వర్ణనాతీతమౌ వదన బింబంబు
దివ్య సౌందర్యంబు దనురూప మొప్పఁ;
అచ్చెరు వందఁగ నచ్చటి జనులు
తత్తరపడి చూడ సర్వార్థసిద్ధి.
నెమ్మోము పై కెత్తి చేతులు గట్టి
నాకేది కానుక యని నవ్వె బాల.
వచ్చిన వారిలో సౌందర్యవతివి
కానుకల్ నిండె గాకేమి కొమ్మంచు
తన కంఠసీమను దనరారు నట్టి
పచ్చల పతకమ్ముఁ గడు వడిఁ దీసి

కలదో లేదో యను విచికిత్స నొప్ప
పడఁతి పట్టు మొలకు రాపట్టి జుట్టె,
ఉల్లము ఝల్లనఁ బులకలు మొలవ
కన్ను లొండొంటితో వియ్య మందంగ
చూపు లొండొంటితో సరస మాడంగ
రాగోదయం బయ్యె నాత్మణ మూడె.

"శాక్యకన్యను జూచి చలన మందితివి
కారణం" బేమని ప్రార్థింపఁ బలికె
బుద్ధుఁడైన పిదప శిష్యుల కిట్లు:-
"మేమిర్వురము గాము క్రొత్త వారలము
వెనుక జన్మములోన వెలసితి నేను
బోయని కొడుకుగ, నొకనాఁట నడవి,
యమునాతటిని, నంద దేవి సన్నిధిని
తీర్పరినై నేను బోయకన్నెలకు
పందెము ల్పెట్టితి, కుందేళ్ల వలెను
పరుగులు గంతులు వెట్టిరి వారు
ఉల్లాస ముత్సాహములు పెనఁగొనఁగ.
పూలిచ్చి యొకతెను బండ్లిచ్చి యొర్తు
నెమలి యీకల నిచ్చి నొండొకర్తుకను
కడపట మిగిలిన యంద గత్తెను

పెంపుడు జింకను ప్రేమతో నిచ్చి
ప్రేయసి గాఁ గయికొంటిని నేను.
హాయిగా నేండ్లును బూండ్లును గడసి
కాలవాహిని యందు గలసి పోయితిమి,
ఆమె యశోధర, యాతండ నేను;
కర్మ వశంబున మరల బుట్టితిమి;
ఆల్మగల తగుల మంటిరా వెంట
విత్తు నుండి వెడలు మొక్క పోలికను
చేసిన పాపపుణ్యములు రాఁ గలసి.
సుప్రబుద్ధతనయ తన తనయుండు
అనురాగ మిగురొత్తఁ గాఁ బరస్పరము
వలపుఁ జూపులఁ జూచుకొని రని వినఁగ
సంతోష ముప్పొంగ శుద్ధోధనుండు
పెండ్లి పెద్దల బిల్ల నడుగఁగా బంపె

కలదొక నియమంబు శాక్యవంశమున
గొప్పవంశపుఁ గన్యఁ బెండ్లాడఁ గోర
ఆ కన్నియను గోరు సాటివారలను
రణరంగ విద్యల గెలువంగ వలయు;
ఈ నియమంబును జ్ఞప్తికిఁ దెచ్చి
మీ పుత్త్రుఁ డిటు గెలుపొందఁ బోటీల

పట్టింపుఁ బాటింప మేలగు నంచు
బదులుమాటను బంపె సుప్రబుద్ధుండు.
ఆవార్త విని రాజు చింతిల్లె నిటుల:
"దేవదత్తుఁడు ధనుర్విద్యలో మేటి
అర్జును సాటిరా రెవ్వరుఁ గాని
హయముల స్వారి గావించుటయందు,
కత్తి సాముల నందుఁడసమానుఁ డగును
పట్టి చేపట్టు నేగతి యశోధరను?"
తండ్రిఁ గాంచి కొడుకు దరహాస మొలుకఁ
పలికె "నే నేర్చితి విద్యల నెల్ల
ఇదె నాదు ప్రతిన చాటింపు రాజ్యమున
నేటి కేడవ రోజు జరుగు బోటీలు
కోరు నెవ్వఁడు యశోధర సతిగాఁగ
పాల్గొన వచ్చునుఁ బందెము లందు
గెల్చు వానికి జెందు నాయింతి పొందు"

వచ్చె నేడవ రోజు; జెచ్చెర జనులు
పందెము లరుగు మైదానంబు నందు
గుమిగూడఁ జొచ్చిరి రాష్ట్రంబు లోని
పల్లె పత్తనముల నివసించు వారు
ప్రభులు సామంతులు వారును వీరు

నేల యీని నయట్లు వేలాది వేలు
దేవదత్తుఁడు నందుఁ డర్జునఁ డాది
అని పనులం దారి తేఁజిన వారు
మగటిమిఁ జూపఁ గోరెదు మొనగాండ్రు,
కొమ్ముల బంగారు కుప్పెలు మెఱయ
మైనిండఁ బూదండ లమరిన యెడ్ల
బూన్చిన రంగుల పసిడి బండెక్కి
బంధుజనులు గొల్వ మేళతాళముల
పెండ్లికూతురు రీతి సౌందర్యరాశి
వచ్చె యశోధర యచ్చటి వారు
కఱవుదీరఁ గనఁగఁ గండ్లప్పగించి.
కంటకంబను దవళాశ్వంబు నెక్కి
సిద్ధార్థుఁ డరుదెంచి జనులను గాంచి
రాజుల గాకున్న నేమాయెఁ గాని
సుఖ దుఃఖములఁ జూడ నావంటి వారె
అని తలపోయుచుఁ గాంచి ప్రేయసిని
ఆఁపి గుఱ్ఱంబును దూఁకి క్రిందికిని
తరుణి పుత్తడి బొమ్మ తగు నుత్తమునకె
సాహసించితిఁ గొన చాల నటన్న
యెదిరింప రారండు వేవేగ యన్న;
బాణపరీక్షకుఁ బిలిచె నందుండు

లోహాపుఁ బల్లెము గురి జూచి కొట్ట
ఆఱుగవ్వల కడ నందుండు పెట్టె.
అర్జునుం డట్టులే; దేవదత్తుండు
ఎన్మిది గవ్వల కావల నునిచె.
పది గవ్వ లవలఁ గన్పడ గవ్వ యట్లు
సిద్ధార్థుఁ డునిచెను లోహాపుఁ బలక.
గుఱుతును గురిచూచి కొట్టె నందుఁడు
యర్జునుం డట్టులే; దేవదత్తుండు
నారిని చెవిదాక వదలఁగా లాగి
గుఱి జీల్చుకొని పోయె బాణ మవ్వలికి;
ప్రేక్షకు లుప్పొంగి భళిభళి యనిరి
మొగమున జార్చెను దనమేలి ముసుఁగు
తనప్రియు శౌర్యము తప్పునో గుఱుతు
అని భయపడి యశోధర తత్తరమున.
బలవంతు లేగాని కదప లేనట్టి
నిగనిగ లాడెడు పేవ బెత్తంబు
చుట్టును నరముల కట్లు శోభిల్ల
వెండి నారెని గల్గి యున్నట్టి విల్లు
వడిఁ దీసికొని చెవి వఱకును లాగ
సిద్ధార్థుఁ డప్పుడు చేతి కొలంది
కొనలు కలుసుకొన వంగి బుంగటుల

కరిమునఁ బెళ్లున విరిగె నా విల్లు.
ఆటల కిది గాని పోటీలఁ దగదు
శాక్యులు, చేబట్టఁ దగినట్టి విల్లు
లేదె నాఁ గలదంచుఁ బలికె నొక్కరుఁడు
సింహాసంహను విల్లు కల దాలయమున
ఎప్పటినుండియో ఎఱుఁగ రెవ్వరును,
నారిని దగిలింప లేరెవ్వరైన
తగిలింప సారింప నలవిగా దద్ది,
అన వేగ దెచ్చిరి దాని నచ్చటికి,
బంగారు తీగెలు బయిని బ్రాకంగ
ఉక్కుతో జేసిన చక్కని వింటి
చేఁగొని రాపట్టి మోఁకాట వంచి
కసి దాని బలమును సహచరు ల్వినఁగ
బలమున్న వీరులు వంపుఁడు దీసి
అన వారు వీరు యత్నింపంగ వంప
వంగ దొకింతేని యది యెంత దృఢమొ!
సిద్ధార్థుఁ డొకకొంత వాటము వంగి
వంచి దానిని తగిలించెను గుణము.
టంకార మొనరింప దాని నిస్వనము
దిక్కులు పిక్కటిల్లఁగ మాఱు మ్రోఁగ
ఏమి శబ్దంబని వెఱగొంద జనులు

సింహాసనంమాను వింటి సవ్వడి యనిరి.
సంధించి బాణంబు సిద్ధార్థుఁ డపుడు
చెవిదాక సారించి వదలంగ నదియు
చీల్చి చాకాశంబు గుఱుతును జీల్చి
ఱివ్వు ఱివ్వునఁ జనెఁ గనుమేఱ మీఱి.

కత్తిసాముల నేర్పుజూపి రాపిదప
అఱయుద్ధ మందము గలతాటి చెట్టు
తెగవేసెఁ ద్రుటిలోన దేవదత్తుండు,
అర్జును డేఁబంగుళమ్ముల దాని,
తొంబ్బదంగుళముల దాని నందుండు.
అట్టి మందముగల చెట్ల రెండింటి
జంటగా నరికెను రాపట్టి వాలు
మెఱుపట్లు మెఱయుచు జిటికెలోపలను;
తెగియును దెగనట్లు నిలచెను జెట్లు
ఆవ్రేటు లాఘవ గమన మెట్టిదియొ.
సుప్రబుద్ధతనయ భయము వాపంగ
దక్షిణపవనము దివ్యమై వీచె
పెల్లునఁ బడెఁ జెట్లు గాలికిఁ గదలి

గుఱ్ఱపుఁ బందెము ల్సాగె నా వెనుక.
బాగుగా బోధింప బలసి యున్నట్టి

గొప్ప గుట్టంబులపై మూడు మార్లు
చుట్టిరి మైదానమును వేగమును
పోటిలఁ బాల్గొన్న కౌతు లందఱును.
కంటకాశ్వపుఁ గాలిదుమ్ములో నయిన
తక్కిన తురగము లొప్పలేక జిక్కె
దాని వేగంబు నే నేమని జెప్ప
నోటి నురుఁగు నేలఁ బడకయ మున్నె
బల్లెము లిఱునది గడచి ముందేఁగె.
"కంటకాశ్వము నెక్క నెవఁడైన గెల్చు
గాన దెప్పింపుఁడు శిక్షణ లేని
పొగరు గుఱ్ఱంబని" పల్కె నందుండు.
చెఱఁగ నివ్వాలఁ జూపు చెదరంగ జూలు
ముకుబెజ్జ మల్లాడ నెఱ్ఱగా నుబికి
కారు మొయిలు రీతి నెఱపును గొలుపు
జీను కళ్లెము లేని నల్లగుఱ్ఱంబు
గొని వచ్చిరచటకు గొలుసులఁ గట్టి.
ఎక్కిన వానిని దప్పకుండగను
గ్రక్కునఁ బడఁద్రోచెఁ గాళ్లు పైకెత్తి
భీకరహయ మద్ది వింత మృగంబు.
అర్జునుం డొకకొంత నిలచెను గాని
పడఁద్రోసి వానిని జంప నుంకింప

మేపరు ల్వరుగుడి తప్పించి రతని,
వలదు పోవలదని వారింప జనులు
వెఱవక రాపట్టి దానిని జేరి
గొలుసుల సడలించి జూలును బట్టి
కండ్లగపడకుండ కరమున మూసి
చెంగున నెక్కెంగఁ గడు జోద్యముగను
మంత్రముగ్ధంబైన పాము పోలికను
కదలేఁ జెప్పిన యట్లు కంటక మట్లు;
అచ్చెరు వందుచు నచ్చటి జనులు
జేజేలు వల్కిరి చప్పట్లు చఱచి
అందఱికిని మిన్న సిద్ధార్థుఁ డంచు
ప్రత్యర్థు లందఱు బలపఱుపంగ.
సంతోష మందెను సుప్రబుద్ధుండు
మనసులో గోరిక యీడేరె ననుచు
"నాయబ్బ నీకెట్టు లబ్బెనో తెలియ
ఈపను ల్నేరుపు లీ మగంటిమియు
అంతిపురములోన వింత సుఖముల
అనుభవించెదవని వినియుందు గాని
ఇంతవఱకు నాది యిఁకపైన నీది
గైకొమ్ము నీసొమ్మ"యని సైగఁ జేయ
జనమధ్యమున లేచి యన్నులమిన్న

మేలి ముసుఁగు దించి మొగమడ్డుపడఁగ
పూలమాలలను దాల్చి కరకమలమున
నడుమను గలవారి నధిగమించుచును
అల్లన నేగె సిద్ధార్థుని కడకు,
నల్లని తురగము నిలువఁగా జెంత
వెలుగులు విరజిమ్మ సఖుని సన్నిధికి,
మేలి ముసుఁగుఁ దీసి ముఖచంద్రు నుండి
వెడలెడు లావణ్య కౌముది తోడ
వినయమ్మ పెనఁగొన నవనతయగుచు
రాపట్టి గళమున నునిచెఁ బూదండ,
తల వ్రాల్చె నెదపైన తలపులు నిండ.
నీ దాన నైతినే వీరుఁడా యంచు
పదములు దాకంగ పటము జాఱంగ
వంగు చెలిని బట్టి యెత్తె రాపట్టి
కరమునఁ గరమును గీలించి వారు
ఏకమై డెందములు స్పందింపఁ గాను
కదలిపోవుటఁ గాంచి కనుల పండువుగ
కరము హర్షించిరి పౌరు లందఱును.

బుద్ధుఁ డిటులఁ బల్కె శిష్యులడుగంగ
“తొలిబాము నందునఁ బులిఁగాఁగ నుంటి,

హిమవంతు చెంగట వసియించు చుంటి,
క్రూరగనర్తనుఁడనై ప్రాణు లెన్నిటినో
చంపి చల్లార్చుచు నాకటి చిచ్చు.
వనములో నొకనాఁడు పులులన్ని చేర,
అందచందంబుల నలరారు చున్న
పులిపెంటి పెట్టెను బ్రియు నెన్నుకొనఁగ
మగజాతి కంతకుఁ దగనట్టి పోరు.
చించి చెండాడుచుఁ బులులమొత్తమును
గెలువంగ నన్నిటి రోజుచు నున్న
నాకడ కడివచ్చి నాకి ప్రక్కలను
తన జంటగా నెన్నుకొనియెను నన్ను.
పూర్వజన్మము లిట్లు పోలుచునుండు
వ్యాఘ్రి యశోధర వ్యాఘ్రంబు నేను.

శుభముహూర్తము జూచి శుభకార్యమునకు
శాక్యవంశపు సంప్రదాయపు సరణి
వైవాహికోత్సవ మ్మొనరించినారు.
పెండ్లి పందిళ్లు పచ్చని తోరణముల
పూల మాలలఁ గూర్చి రతిమనోజ్ఞముగ,
రంగురంగుల రత్న కంబళంబులను
పఱచిరి కళ్యాణవేదిక మీఁద

త్రియని "రొట్టె"ను నడిమికి గోసి
అత్తరు లక్షతల చల్లిరి దిశల,
మణిబంధనంబుల ముడివైచి మఱియు
గడ్డిపోచల రెంటిఁగాచిన పాలఁ
గలియఁ దేలించిరి కలకాల మిట్లు
ఆలుమగల ప్రేమ యలరారు నంచు;
మంత్రతంత్రములతో నడచె సప్తపది,
ఆలయంబులఁ బూజ లన్నదానములు
విరివిగా జరిగెను, బూజ్యు లందఱకు
కానుక లొసగిరి పాత్రత నెఱిఁగి.
వృద్ధరా జనె వధూవరులను గాంచి
"నీదయ్యె నాబిడ్డ నేటినుండియును
నీతోడి దే జీవితంబని యెంచు
యేలుకో యనుకంప యువరాజతిలక!"
మేళతాళంబులు గీతవాద్యములు
వేడుకల్ మిన్నుముట్ట వెంటరాహితులు
రాపుత్రు కరమున నిడిరి రాకన్నె,
వలపుల సెలయేఱు పొంగి యుప్పొంగి
వడిఁబాఱి ప్రేమంపు వారాశిఁ గలసె,
ప్రేమ సామ్రాజ్యంబు నద్వితీయముగ
కాముండు పాలించె నిర్నిరోధముగ.

ప్రేమబంధములతో బోనీక రాజు
వెనువెంట గట్టించెఁ బుడమి లేనట్టి
భువనమోహనమైన భోగసౌధంబు
వింతతీరులు క్రొత్తసొబగులు వెలయ,
విశ్రామవనమని విఖ్యాతిఁ జెంద;
నగరవనంబులో నడుమను గలదు
పసిమి మిసిమి మించు పచ్చని కొండ
హిమనగమునఁ బుట్టి యాకొండఁ జుట్టి
గలగల బ్రవహించి గంగను గలియు
రోహిణి యనునది; దక్షిణ దిశను
సాల వృక్షంబులు చింతచెట్లులును
మింటి చాయను గల గంటెపూలల్ల
దట్టముగా నుండు దడిఁగట్టి నట్లు;
వెలుపలి నవ్వాడి లో దూర దచట
కొంత చెవింబడ దూరము నుండి
తుమ్మెద రొదఁబోలెఁ దెలియ దోశ్కాంత.
ఉత్తర దిశనుండుఁ బెనుగోడ వలెను
నేలను గొలువఁగఁ గొలబద్ద యనఁగ
హిమవంతు శిఖరంబు లతినిర్మలముగ
నిగనిగ మెఱయుచు నింగి నొఱయుచు
దుర్గమ నంబులై యద్భుతంబుగను;

యతి విశాలంబగు నా పితృభూమి,
గగనంబుఁ జుంబించు కొండల కొనలు,
పచ్చని లోయలు మంచు మించులును,
మట్టమూ మెట్టులు గట్టి మిట్టలును
బీటలు వాఱిన ప్రక్కవాటములు
తెగఁగొట్టి నట్లుండు తెంపుఁ జీలికలు
లోతైన లోయలు చీఁకటి గుహలు
చూడంగఁ జూడంగ నెత్తుల తీరు
నగరాజు నున్నత పథములఁ గాంచ
తలఁపు లున్నతములై పై పైకిఁ బ్రాఁకి
చేరి స్వర్గంబును దివ్యుల తోడ
మాటాడి నట్టుల నైతు మఱపించు.
మంచుగప్పిన చోట్ల క్రింద నొప్పారు
మబ్బుల గుంపులు కాఱుచున్నవియును
దుముకుచు దూకెడు నీటి యూటలును;
వాని దిగువ నుండు చెలఁతోఁటలును
గంధపు తోఁపులు ఘుమఘుమలాడ;
చిమ్మచీఁకటి క్రమ్ము నావనులందు
నెమిళుల పిలుపులు కాకి కాకాలు
పులుల గాండ్రింపులు సడయాడు నట్టి
మృగముల గిట్టల సప్పుడి మఱియు

గ్రద్దల కూఁతలు వినిపించునచట;
అక్రిందఁ బైనున్న ఘనులఁ బూజించు
భక్తుఁడు నాఁ బర్వెఁ బచ్చనిబీడు
పచ్చలు పొదిగిన కంబళిమట్లు;
ఇచ్చోట పర్వతప్రాంతంబు లందు
సౌధంబు నిర్మింపఁ బని మొదలిడిరి.
ఎత్తైన బురుజులు నిలిపి యిర్వంక
బలు కంబములు గల మంటపంబులను
చుట్టును గట్టిరి; వానిదూలముల
పూర్వపు గాథలఁ జిత్రించి రిటుల:
రాధికాకృష్ణుల రమ్యలీలలును
గోపికలం గూడియాడు రీతులను
సీతమ్మ కథయును హనుమంతు చరిత
పాంచాలి పరిభవ మాదిగా గలవి;
డాలు శూలము నిల్పి కరకమలముల
-జ్ఞానశుభంబుల నొసఁగుట కొఱకు-
విఘ్నేశు చిత్రంబు తొండంబు తోడ
మధ్యమంటపమునఁ జెక్కి రింపొప్ప.
ఈ ద్వారమును దాటి లోనికిఁ బోయి
మలుపులు దిరిగిన పూవులబాట
నడచిన మఱియొక ద్వారంబు వచ్చు;

కెంపురంగుల యీనె లమర నందందు
పాలఱాల పసందు కట్టడమద్ది,
బొమ్మల బారులు తీరిచి యున్న
పింగాణి చట్టాలు గంధంపుఁజెక్క
తోఁ జేయఁబడినట్టి తలుపులుగలవు;
ఆ ద్వారమును దాటి మెట్లపై నడచి
స్తంభసమూహంబు లిరుగడ నిలువ
అంచుల సందుల యచ్చులు వెలయ
రంగుల పై కప్పు వింతను గొలుపు
రమణీయ మంటప మార్గానఁ బోవ
ఎత్తైన కడుఁగొప్ప మందిరంబులను
చేరి చూడఁగ వచ్చు నచటివింతలను.
చల్ల నీడల నీను తీగెల తోడి
పచ్చని వాటిక లారామములును
పూల పందిరులును బటకుటీరములు
పెక్కులు సొంపారఁ గనవచ్చు నచట;
కలువ, తామరలాదిగాఁ గల పూలు
పిల్లగాలికిఁ దూలి లాస్యమాడంగ
తళతళ మెఱసెడి రంగుల మీలు
వింతగా నటునిటు నీదులాడఁగ
చల్లని కోనేరు లమరు నందంపు;

గాలికి విడివచ్చు పూల ఱెక్కలను
నములుచు చేరెడు కన్నులు మెఱయు
గోడసందుల నిల్చు జింక లందముగ;
వానవింటిని బోలు వింతవన్నియల
కిలకిల పులుఁగులు కుజములఁ జేరు.
బంగారుపూతల మెఱయు కోణముల
పావురాయి పిచుక గూళులువెట్టు,
రంగుల రంగారు పూఁబాటలందు
వింతవన్నెలు గల పింఛము ల్విప్పి
నాట్యమాడు నెమిళు లందచందముగ
తీవితో కొంగ గోర్వంకలు చూడఁ;
ఫలములు మెసవఁగ జిలుకలు జేరు
చెలరేగుఁ దుమ్మెద ల్పూదేనె లాని,
కప్పుపై బల్లులు గబగబఁ బ్రాకు
శాంతి రాజిల్లఁగా భయము వోనాడి
చేదిండిఁ దినవచ్చు వడివడి నుడుత,
పునుగుఁబిల్లులు దొరలాడెడి చోట
కోఁతులు కిచకిచ కాకుల దరుము,
మొగలి పూఁబొద మాటు వైరముమాని
సిరియు సంపద లిచ్చు సర్పరాజంబు
మిన్నాగు మణగును విన్నాణ మొప్ప.

ఇంపులు సొంపారు ప్రేమహార్మ్యమున
ఎచ్చోటఁ గనుఁగొన్న నందచందములె
ముసిముసి నగవుల ముద్దు మొగములె
అవ్యాజపుంబ్రేమ, మడుగనిసేవ
చల్లని చూపులు మెల్లని మాట.
మనమును మురిపింప మరియాద తోడ
చెప్పిన పనిఁజేయ జెలు లుందు రచట.
సుఖము సంతోషంబు పొదలఁగా నందు
డెంద మానందంబుతో నిండుచుండు;
నిత్యనూతనములౌ పూదరులందు
మెల్లఁగా జారెడు వాఁగు పోలికను
బ్రతుకు భారము లేక హాయిగా సాగు.
ఆరమ్య, హార్మ్యపు టందచందముల
రమణీయ కమనీయ దృశ్యజాలముల
కన్నింటి కంటెను మేటియై తనరు
రమణి యశోధర రాణియై యుచట.

ఆహార్మ్యశతముల కావలఁగలదు
శయనమందిర మొండు, నక్కి నట్లుండు.
తమ పనితనమెల్లఁ గనఁబడ నచట
శిల్పులు చాతుర్య మంతయుఁ జూపి

ఊహించి తోఁపఁగా జిత్రించి రచట
మనమోహనముల మనోజ్ఞదృశ్యముల,
కళలను గురిపించు రూపసంపదల.
చతురస్రముగ నుండు దాని ద్వారంబు
ఎత్తైన గోడల ప్రత్యేకముగను;
తెల్లని గచ్చుతో తళతళలాడు.
పాలరా పలకలు పఱచిరి నేల,
కొలను చుట్టును, మెట్లు మూలలయందు
చెక్కి తీర్చిన రత్నరోచులెగయఁగ
మంచు గప్పినయట్లు చల్లఁగా నుండు
వేసంగి వేళల విశ్రమించుటకు.
పంచలఁ గడచియు వంకలఁదిరిగి
అరుణకాంతిని వీడి, వేడిమి విడచి
సూర్యుని తేజంబు వెన్నెల పోలె
ఛాయ చందంబునఁ బడుదూరియచట,
తైక్ష్ణ్యంబు విడనాడి శైత్యంబు దాల్చి
పగలు సాయంకాలముగఁ దోచు నిచట.
ఆద్వార మావల నలరు మందిరము
భూతలస్వర్గము భువన మోహనము,
జగతిలో లేనట్టి యాచక్కఁదనము

సంభ్రమాశ్చర్యముల్ సంధిల్లఁ జేయు.
మృదుకాంతి కప్రంపు దీపాల నుండి
ముత్యపుఁ జిప్పల మిలమిల్ జిమ్మ
రంగుల తళ్కుల తళతళల్ నెఱపి
కిటికీల సందుల యందున దూరి
అచ్చట నున్నట్టి సరిగ చీరెలను
పట్టు పాన్పుల నెల్ల మెఱపింపఁ జేయు.
అద్భుతంబై నట్టి యవనిక నెత్తి
లోఁ బ్రవేశింతురు సుందరతములు.
పగలు రాతిరి భేదమేతోప దిచట
ఎల్లవేళలు దోచు నొక్క రీతిగనె.
వింత వెల్గులు మీఱు నిత్యము నిచట
దినమణి దీప్తులఁ గాంతిని మించి
చల్లఁగా నుండు సాయంకాల మటుల.
వింత గాలులు వీచుఁ గమ్మగా నిచట
వేసవ తెమ్మెర యాహ్లాద గుణము
మాపటి గాడ్పుల చల్లఁదనంబు
రెండింటి తనలోనఁ గలుపుకొన్నట్లు;
సరస గానము గూర్చుఁ జెవులకు విందు
ఎల్ల వేళల యందు తియ్యగా నందు.
పంచ భక్ష్యంబులు పరమాన్న ములును

చోష్య లేహ్యంబు ఫలాహారములును
టెంకాయ నీరంబు చెఱకు రసంబు
నానా విధములైన పానీయములును
ఇత్తు రెల్లప్పుడు విడుపైన లేక,
కొఱఁతయుఁ గొదవయు లేవు లేవిచట.
పగలు రేయచ్చోట సేవఁ జేయుదురు
ఆట వెలందులు సుకుమారవతులు
కాముని తూపులు వలపులనిధులు
తమ యాటపాటలఁ జొక్కంగఁ జేసి
జోకొట్టి శేనికి సిదురఁ జేకూర్తురు;
రాపట్టి మెల్లోన మనసు మరల్ప
వలపు గీతంబుల నొయ్యార మొల్క
కలకంఠముల నెత్తి యాలపించియును,
వీణను మీటియు వేణువు నూది,
కరముల గాజులు కాళ్ల గజ్జెలును
ఘలుఘల్లు మనిమ్రోయ నాడిపాడుచును
లాస్యముఁ చేయుచు హావభావముల,
తమ యంగకంబుల వంపుల సొంపు
నిలువు చెలువములఁ జూపి జూపకయ
మోహంబు రేకెత్తి మురిపింత్రు మనము;
పునుగు జవ్వాజియు సాంబ్రాణి యగరు

ధూపము ల్వేసియు ఘుమఘుమలాడు
వాసన ల్గుబులుకొఁ జేయగఁ నవ్వుడు
వలపుకోరిక లూర సిద్ధార్థుఁ డంత
రమణి యశోధర జేరఁగా నరుగు,
భావిబుద్ధుం డిటుబద్ధుఁడై యుండు.

ఇవి చాల వన్నట్లు శుద్ధోధనుండు
కట్టుబాట్లను జేసె కడు దిట్టముగను.
అచ్చట నున్నట్టి వారెవ్వరైన
చావు, వార్ధక్యమ్ము దుఃఖము సుఖము
వీనిని గూర్చి నోరెత్త రాదు.
అచటి విలాసిను లాటకత్తెలును
నిత్యయౌవన లట్లు మెలఁగఁగా వలయు,
పదములు నాట్యమునకై దడఁబడెనేని
ఒక కేశమున కేని నరయు చేర్పడిన
వెడలించెదరు వాని నచట లేకుండ.
వాడి రాలిన పూల నాకలములను
నిత్యము జాగ్రత్తగా బ్రోగుచేసి
ఆవలక్వైచెద రగుపడకుండ.
ఈరీతి తనయుఁడు తన యౌవనంబు
గడుపఁగా వలపుల వలలలో జిక్క—

కష్టంబు నెఱుఁగక కలలోన నైన
ఆత్మవిచారము దూరమై పోవ
వైరాగ్యమున కవకాశంబు లేక
ధరణి నేకచ్ఛత్రముగ నేలునట్టి
రాజాధి రాజగు విఖ్యాతి గాంచు
నని యెంచె గాఁబోలు వృద్ధభూవిభుఁడు.

ఆగ కంతటి తోడ నవనినాథుండు
ఎత్తైన గోడల జుట్టు కట్టించె,
లోహ నిర్మితములౌ పెద్దతలుపులు
ద్వారముల్ పెట్టించెఁ బ్రాకారములకు.
పాసి దీయగ మూఁయ నూర్వురు వలయు
వాని యులివు పర్వ్య నర్ధయోజనము,
ఇట్టివె మఱిరెండు చుట్టు గోడలును.
ఇట్టివె మఱిరెండు ద్వారబంధముల
గట్టించి వానికిఁ గావలిఁ బెట్టె
నమ్మిక మైనట్టి రక్షక భటుల;
కట్టడి జేసెను గట్టిగా నిటుల:
"ప్రాణముల్ నిలుపుకో గోరుదు రేని,
జాగరూకత తోడ మెలఁగగా వలయు
రాజాధిరాజైన రాపట్టి యైన
వాకిలి దాటంగ రా దెవ్వరైన."

# తృతీయాధ్యాయము



ఆ భోగ మందిరం బందు రాపట్టి
కాలంబు నిశ్చింతఁ గాముఁడై గడపె.
కొఱవన నేమియో కొదవ యేమిటియో
చావును ముదిమియు బాధయు వ్యాధి
ఇవియెల్ల నెట్టివో యెఱుఁగ కొక్కటియు.
కాని యొక్కొక వేళ్ల కలఁ గాంచు నిట్లు.
కడలి యానము సేసి కడకు వేసారి
వింత వస్తువుఁ దాను గొని తెచ్చి నట్లు.
ప్రేయసి పాలిండ్లు తలగడ కాఁగ
హాయిగా నిదురించి యుల్కిపడ్డట్లు
చప్పునఁ దా లేచి బిట్టరచు నిట్లు:-
"వింటి, దెలిసికొంటి, వచ్చితి" ననుచు
తనకంటి కగపడు జగతిఁ బేర్కొంచు.
వెలఁది యదిరిపడి విభ్రాంతి తోడ
"ఏమి ఏమిటి నాథ!" యనుచుఁ దన్నడుగ;

ఆ వేళ నాతని వదన చంద్రుండు
కన్పడు దివ్యమై కృపశోభ నిండి.
చెలివగ మాన్పంగ చిఱునగ వెలయు
ఆలపింపుము వీణ యని యానచేయు.
ఒక్కనాడు మఱచి యొక్క విపంచి
పెట్టిరి వాకిలి గాలి మ్రోగంగ
విని రెల్ల వారలు దాని నిస్వనము
వినఁబడె రాపట్టి కొక దివ్యగీతి:

"తిరుగాడు గాడ్పుల గొంతుక ల్మేము
తీరిక లేకయే తిరుగు చుండెదము
ఇహజీవనం బది పోలు గాలులను
కష్టలేని యిడుముల సుడిగుండి యగును.

రాక యెందుండియో పోక యెచ్చటికో
ఏమిటో నాటక మెఱుఁగ మెందులకో
శూన్యపు ఛాయలు మావలె మీరు
సుఖము శూన్యంబయి కష్టము ల్మేలు

క్షణికములై మాఱు సుఖముల యందు
అందఁగా నెట్టు లానందంబు పొందు
గాలుల పోలిక మనుగడ నడక
నడచివచ్చు వెసఁబోవు మఱిఁ గనఁబడక

పుడమి నల్గడలను వెదకి చూచెదము
మాయసుతా! నీవు చెవియొగ్గి వినుము.
ఆక్రంద నంబులె యెచ్చోట విన్న
కన్నీటి కాల్వలె యెచ్చోటఁ గన్న.

చూడ వ్రేలాడంగ బ్రతుకు బూటకము
గట్టిగా బట్టుకొని యేడ్చి, నవ్వెదము.
చదలఁ గదలకుండ మొయిలు నాపెదమొ?
పాఱకుండఁగ నేఱు నాపంగఁ దరమొ?

దుఃఖాగ్నిఁ గుములుచుఁ బాడు లోకమ్ము
దరి దాపుఁ గానక వాపోవు సుమ్ము,
సర్వార్థసిద్ధుండ! దరిసెఁ గాలమ్ము,
జగతిఁ గాపాడంగ వేవేగఁ బొమ్ము!

తిరుగాడు గాడ్పుల గొంతుక శ్మేము
తిరుగాడి నీవును గనుము సత్యమ్ము.
వలపుల విడనాఁడు దయ లోన నిలుపు
ముక్తి కన్నియ యిచ్చు ముదముతో వలపు,

వీణ తీగెల మీటి పలికితి మిటుల
విషయ లంపటులకు వినఁబడు నటుల,
పుడమిని కడగండ్లఁ గన నొకసారి
పనియాయెఁ బోదము వచ్చిన దారి.

తరువాత నొకనాఁటి మాపటి వేళ
గొలువుండె రాపట్టి గోరిక మీఱ
కెంగేలఁ బ్రేయసి కేల్దమ్మి వట్టి,
కాలంబు వేగింపఁగా కాంత యోర్తు
ఎలుఁగు రాపడ గొంతు సవరించు కొంచు
పూర్వగాథల వింత గొలుపఁగా జెప్పె;
కీలు గుఱ్ఱంబును గడలి యానంబు
నవ యౌవనుఁడును వాని ప్రేమంబు
అబ్ధిలో దినమణి యస్తమించుటయు
వింతజనంబులు క్రొత్త లోకములు
మొదలుగా గల వాని నన్నిటిఁ జేర్చి,
వినుచుండ నాకథ జ్ఞప్తికి వచ్చె
తీగెల పలుకు విషాద గీతములు.
ఇమ్ము చిత్రకుఁ బారితోషిక మ్మంచు
సతిఁ గాంచి పలికెను - జెప్పుము నాకు:
పృథ్వి విశాలంబుగా నుండుఁగాదె.
కలరుగా మనవలె నెందఱో జనులు
కలియుదమే వారి మన సహోదరుల
తగు సహాయముఁ జేయవచ్చు వారికిని;
భానుండు బంగారు బాట వెల్గింప
తూర్పుదిశను బుట్టి పడమటఁ గ్రుంక

ఎందఱు చూతురో పగటివెల్గులను
ఎందఱు కందురో మాపటిరుచుల,
వారందఱును ప్రేమ పాత్రులు గారె!
కలవర మొక్కండు కలవర పఱచు
పిలుపు వినంబడు రా రమ్మటంచు.
నీ పెదవుల తీపి కడగంటి చూపు
ఆపఁగా లేనట్టి యొక యద్భుతమ్ము
ఆకర్షణము సేయు నన్నావరించి;
ఓ చిత్ర! చెప్పుమా సగర మెచ్చోట
ఎందుండు నాయశ్వ రాజంబు సెపుమ
వడి నెక్కి చని వేగ నగరంబు దాటి
చూచి వచ్చెదఁ గాక భూతల మంత;
ఓ! గృధ్రరాజంబ! నీవలె నాకు
ఱెక్కలు గలిగిన నిముసము లోన
అరుణకాంతులు నిండు నాగిరి కొనల
చేరి చుట్టుంబట్లు చూడ కుండుదునె.
ఇచ్చట నొంటిగా నే నేల యుంటి
యిందాక గ్రుడ్డిగా, వింతల వింటి
ద్వారాల కావల కలదేది? యనఁగ
అం దొకఁ డిటు లనె "దేవర! వినుము

ముందు దేవళము లవ్వాని తర్వాత
తోటలు పొలము, లవ్వాని దాటంగ
బింబిసారుని భూరి రాజ్యము గలదు.
ఆవల నేల సాగును గడలేక
కోటాను కోట్లను జనులను గలిగి"
"ఔనౌను! చెప్పెఁదు చెన్నున కిపుడె
రథము నాయత్తము గావింపఁ గాను
రేపు మధ్యాహ్నంబు వీక్షింతు నగరు"

అని పల్కఁ బుత్రుండు తండ్రికిఁ దెలిసి
చాటింపు వేయించెఁ బురములో నిట్లు:-
"రేపు మాపటి వేళ రథముపై నెక్కి
యువరాజు వెడలును నగరుఁ జూడంగ;
కుంటియు గ్రుడ్డియు ముదుసలి రోగి
ఇలు వీడఁగా రాదు బయట రా రాదు
తిట్లాట కొట్లాట యలజడి తగదు,
చచ్చిన వానిని దాచఁగా వలయు
రాపట్టి వచ్చి పోయెడి నంత వఱకు
దహనాది సంస్కారములు చేయ రాదు."

చాటింపు విని పురజనులు వేడుకను
అందంబుఁ గూర్చిరి నగర సుందరిక
చూచు వారందఱు చోద్య మందంగ,

వీధుల నూడ్చిరి పరిశుభ్రముగను
జలములఁ జిలికిరి బాటల యందు
ముగ్గులు దీర్చిరి ముంగిళ్ళ ముందు
మాసిన బొమ్మల రంగులఁ దీర్చి
ఇళ్ళకు గుళ్ళకు సున్నముఁ గొట్టి
సొంపులు దీర్చిరి వింత సొబగుల
పచ్చ తోరణములు పందిళ్ళఁ గట్టి
జెండాల నిల్పిరి వృక్షా గ్రహాములను
అలకా పురము వోలె నా పురవరము.
ధవళాశ్వములు రెండు పూన్చిన యట్టి
రంగుల వెలుఁగొందు రథముపై నెక్కి
యువరాజు పురమును వీక్షింప వెడలె.
పలు వన్నె వలువలఁ దాలిచి ప్రజలు
స్వాగతం బిచ్చిరి సిద్ధార్థునకును
హర్ష నాదంబులఁ గరతాళములను.
వారి సంతోషంబు గాంచి రాపట్టి
బ్రతుకు మేల్మేలంచు మదిఁ దలపోసె;
సోదరీ సోదరుల్ నా రాకఁ గాంచి
ఎంత సంతోషాన స్వస్తి పల్కితిరి
మధురము ల్సరళము ల్వారి డెందములు,
రాజులు గాకున్న రాతిరి బవలు

కష్టించి పనిపాట చేయుచునున్న
సంపూర్ణ సంతృప్తి నిండుమనంబు. . . .
గొప్పగా నన్నిట్లు గౌరవింపంగ
నేనేమి చేసితి వారికి మేలు,
ఇంతలేసిగ సుఖ మందంగ గల్గ
కొఱవ యేముండును కొదవ యేమిటికి,
పూవులు జల్లిన యా తమ్ముగుఱ్ఱ
కొనిరండు, తెండిదె నా తోడనుండ.
ఓ చెన్న ! పోనిమ్ము తేటి నావలికి
ఇందాక నే గాంచ నట్టి వారలను
ముదిత మానవులను గనుఁగొందుఁ గాక,

అని పల్కి వడి సాగె ముందుకు రథము
తండోపతండము ల్గాఁ జేరి జనులు
జేజేలు గొట్టిరి మిన్ను ముట్టగను.
రాజాజ్ఞ నిట్టులు పౌరు లందఱును
ప్రియమొప్పఁ గనుపింప నా సమయమున
గుడిసె వాకిలి దూరి బయటకుఁ బ్రాకి
గడగడ వణకుచు నడు వీథిఁ జేరె
చిరిగిన పాత పేలిక మొలఁ జుట్టి
మూల్గుచు రోతగా ముదుసలి యొకఁడు;

మాంస హీనంబైన యస్థి పంజరము
ముడుతలు పడినట్టి వాడిన వపువు
దంత హీనంబైన వదన గహ్వరము
చొంగతో వడఁకెడు దవడలు గలిగి,
లొట్ట కన్నుల యందు పుసి నీరు క్రమ్మ
వార్ధక్యమున వీపు విల్లునా వంగ
ఎగయుఁ బ్రక్కల నొక్క చేతిని బెట్టి
దడ నుడుపఁగఁ గఱ్ఱ వేఱొక చేత
బట్టి, చేరిన మూఁక సందడి గనుచు,
వచ్చు ప్రాణము పోవు ప్రాణము తోడ,
దగ్గాపఁ జాలక తబ్బిబ్బు లగుచు
చావు దప్పక వచ్చు నీనాడో రేపొ
బిచ్చమ్ము దయనిచ్చి రక్షింపు డనుచు
చిక్కిన చేఁ జాచెఁ గడు దీనుఁడగుచు
జాలిని గొల్పెడి యా బీద బడుగు.
వానిఁ గన్గొని వేగ నచ్చటి వారు
బడబడ ప్రక్కకుఁ బట్టి యీడ్వంగ
"వలఁ దీడ్వ వలదయ్య! ఆగుం డ"టంచు
యువరాజు పరికించి యా వింత వ్యక్తి
శోకంబు వేదన రూపొందె నాగ
వంగియుండెడి వస్తు విది యేమి చెన్న?

మనుజుని పోలిక యమరు నొక్కింత’’
అన యువరా; జిట్లు సారథి పలికె:-
“దేవర యీతఁడు వృద్ధుఁడౌ నరుఁడు
నలుబ దేడుల ముందు వంపేమి లేక
దృఢకాయుఁడై వీఁడు మనవలె నుండె
బలమును దేజంబుఁ బ్రాయము గల్గి;
కాలచోరుఁడు వీనిఁ బీల్చి పిప్పిగను
జవసత్వముల నెల్ల దోచుక పోయె;
కాలిపోయెను వీని దీపాన చమురు
వత్తియు నుసిఁగట్టె, కొడికొట్టుకొనుచు
గుప్పున నెప్పుడో ‘ఘనమ’గుఁ గాదె?
వయసు వైఖరి యిది! మన కేల’’ యనిన,
“ఒక్కొక్క చో నిది యరుదుగా నగునొ
లేకెల్ల వారికిఁ గలునొ’’ యన్న;
“వచ్చువార్థక్యంబు వయసు మీఱంగ
ఎట్టి వారికి నైన దప్పక నన్న;
“వయసు మీఱు వఱకు జీవింతు నేని
యీగతి పట్టునే తప్పక నాకు?
నా యశోధరకు గంగకు గౌతమికిని
జాలీనికిని చిన్ని హస్తకుఁ గూడ?
“తప్పదు యువరాజ’’ యనఁగఁ జెన్నుండు

విని దాని రాపట్టి వానికి ననియెః-
"తలవని తలఁపుగాఁ గనుఁగొంటి నేఁడు
రథము మరల్పుము చేరంగ వీడు."

చింత తోప మదిని యోచన మునిఁగి
సిద్ధార్థుఁ డీలు సేరె స్వస్థతఁ దప్పి;
రుచికర మైనట్టి పలు పదార్థముల
వడ్డింప విందారగింపఁడా రాత్రి,
పేర్గన్న ప్రౌఢలౌ భోగ భామినులు
ఆడంగఁ బాడంగ హీన భావముల
గన్నెత్తి యైనను గాంచఁడా వంక.
ఈ తెఱంగున మాట లుడిగి తా నుండ,
చూచి యశోధర శోకంబు పొంగ
పాదాలపైఁ బడి ప్రార్థించె నిట్లుః-
"వేష భాష లుడిగి యిట్లుండ నాథ;
నావల్ల సౌఖ్యంబు గనవె ప్రాణేశ"
"ప్రేయసి" వినుమంచుఁ బలికె రాపట్టి
డెందంబు వేదనతోఁ దల్లడిల్ల,
"ఈ ప్రేమ కలకాల ముండదు సకియ,
ఓ కాంత! వినుము నీవును నేను గూడ
సొగసును గోల్పోయి యౌవనము ముదుగ

జనసత్వములు వోవ, జిగిబిగి వగల
ముదుసళ్ళ మగుదుము గదా ససహ్యముగ;
ప్రేమను బంధింప బాహువల్లరుల
పెదవులఁ బెనవైచి పగలును రేయి
ఊపిరి యొకటిగా మనకిద్దఱకును,
కాలము నడిచివచ్చి మన కడ్డముగను
నీదు లావణ్యంబు, నాదు రాగంబు
అపహరించును, జుమ్మి గిరులపై రుచుల
నిశి దోచుకొని పోవు చందంబు దోప,
కనుగొంటి దీనిని కలవర మాయె
చీకటి క్రమ్మెడి వెఱపు గల్గెడిని;
ఈ కాల హంతబారిని బడకుండ,
వార్ధక్య మెఱుఁగక వలపుల తీపి
మను మార్గ మెయ్యది యనుచు నా మనము
యోచనఁ బడి మున్గి తేలును జెలియ”
మనము సమాధాన మందక నిట్లు
మేల్కొనె రాపట్టి యానిశి యంత.

ఆ నిశి యంతయు శుద్ధోధనుండు
కలవర మొందెను గల లిట్లు గాంచి:
ధగధగ మెఱయుచుఁ బెద్ద పతాక

మధ్య మార్తాండ బింబము వెలుగంగ
రెపరెప మనె నింగి నింద్రునిది వలె,
పెనుగాలి యరుదెంచి పట్టు పతాకఁ
చించి ముక్కలుగాఁగ బడవైచెఁ బుడమి.
నీడ మేనుల వారు గుంపుగా వచ్చి
చెడిన జెండా నెత్తుకొని మోసి కొంచు,
తూర్పుగా బోయిరి ద్వారంపుఁ ద్రోవ.
రెండవ కలయిట్లు: కోఱలుమీఱ
పంజరంబులు బది దిక్కు లద్రువఁగ
దక్షిణా పథమున వరుసగా వచ్చె;
ప్రథమ గజము మీఁద రాపట్టి యొప్పె,
చూపఱ కన్నులు మిఱుమిట్లు గొలుపు
కాంతులఁ జిమ్ముచు రథమొండు వచ్చె;
నుఱుగుఁ గ్రక్కుచు నోట ముక్కు లల్లాడ
గుఱ్ఱము ల్నాలుఁగు వాయు వేగమున
వడి నీడ్వ యువరాజు నడుమఁ గూర్చుండ.
మూఁడవ కలయిది; కల నాలుగవది:
వెండి కుండలు మణిమయపు టాకులును
అంచుల నలరారు వింత వ్రాతలును
గల చక్ర మొక్కటి గిరగిరఁ దిరిగె,
కాంతి గీతంబుల పెదబల్లు నట్లు;

ఐదవ కలయిది: రేయిక భూరి భేరి
కొండకు నగరికి సమముఁ గన్పించె,
ఇనుప గదను బట్టి రాపట్టి కొట్ట
ఉఱుమట్లు మ్రోతలు మిన్నులు ముట్ట
దూర దేశంబుల వినఁబడు నట్లు.
ఆఱవ కలయగు గొప్ప గోపురము
మింటి మబ్బులఁ దాకెఁ బుర మధ్య మందు,
అద్దాని పై నెక్కి సిద్ధార్థుఁ డుండె,
చేతుల రెండింట వన్నెల నీను
జాతి రత్నంబులఁ గెంపు పచ్చలను
వెదజల్లు చుండెను నలుగడ లందు;
గుంపులుగాఁ గూడి మనుజులు మూగి
చిక్కినన్నిటి నేఱుకొని పోవు చుండ్రి.
ఏడవకల- నాలుగురు కంటఁ బడిరి,
నోళ్లు గొట్టు కొనుచు కొఱకుచుఁ బండ్లు
ఏడ్చుచు నేగిరి విఫలులఁ బోలె.

కల లేమి సూచించుఁ దెలుపుఁ డటంచు
అడిగెఁ బండితులను శుద్ధోధనుండు,
చేతులఁ ద్రిప్పిరి తెలియ దటంచు.
"కాల్పనే మీ బుద్ధి పండితబ్రువులు"

అని కోపపడి రాజు చింతతోఁ గుంద
ప్రజలు దుఃఖించిరి ప్రభు పరిస్థితికి.
జింక తోలును గప్పి కొని యోగి వోలె
నొప్పారు, నొక క్రొత్త మానిసి యొకఁడు
"స్వప్నార్థముల నేను జెప్పంగలాఁడ
గాని పొందు నను వేగఁ బ్రభుని సన్నిధికి"
అను తన్ను గొంపోవ రాజున్న యెడకు
చెప్ప సాగె నిటుల నా వింత వ్యక్తి.
"జయమగు నో రాజ! శుభమగుఁ గాక,
శోభ నొందును గాక నీదు వంగడము!
నీ పొడఁగన్నవి కడు మంచి కలలు.
పడిన జెండా చేయు సూచన వినుము:
పాత మతా లొప్పక, క్రొత్తవి రాగ
నగుళ్ళు సురలును మాఱి పోవుదురు,
రోజులు మారంగఁ గల్పాలు గడచు.
పుడమిఁ గదల్చిన పది యేనుఁగులును
పది జ్ఞానమార్గాల సూచించు నయ్య!
జ్ఞానియై యువరాజు వదలు రాజ్యంబు,
సత్యసూక్తులఁ జాటి జగము నూగించు;
సెగ లెగఁ జిమ్మెడి నాల్గు గుఱ్ఱములు
తెలివి వెల్గుల నిచ్చు నాల్గు శీలములు;

తిరుగు చక్రము ధర్మచక్రము సుమ్ము;
భేరి ఢాంకారము ధర్మంపు ఘోష;
ధర్మప్రవృద్ధిని దెలుపు గోపురము;
వెదజల్లు మణిరాశి నరసురాదులకు
అనుసరణీయంబు లౌ సూక్తు లగును;
ఏడ్చెడి యార్గురు గురువులు సూవె,
వారికి బుద్ధుండు వాదబోధముల
సత్యంబు నెఱిఁగించుఁ మౌఢ్యంబుఁ బాపి;
ఒందు మానందంబు నో వృద్ధరాజ!
యువరాజు భాగ్యంబు రాజ్యాధికంబు,
రాజ వేషము మించు సన్న్యాసి సొబగు,
ఏడు రోజులలోన నిదియెల్ల జరుగు
స్వప్నార్థ మిదియగుఁ బోయి వచ్చెదను."
తిరిగి చూడఁగఁ గనుపింపడు యోగి,
పారితోషిక మిచ్చి భటులఁ బంపింప,
చంద్రమందిరమునఁ గానంగ రాహు,
ఎగురుచుఁ గనుపించె నొక గుడ్లగూబ;
దేవత లొక్కచో వత్తు రేరేతి.

ఆశ్చర్యమున విని వెఱగంది రాజు
చిత్తము మార్పంగఁ దన తనయునకు

క్రొత్త పోకడలను నింతగీతులను,
వేగము సమకూర్పఁ డని యాన తిచ్చె
అచ్చటి యున్నల మిన్నల కెల్ల.
ద్వారాల కావలి దిట్టము సేయ
రెట్టింపు గావించె రక్షక భటుల.

విధి నడ్డగింపఁగ వశమౌనె మనకు?

నగరంబుఁ గాంచంగ సంకల్ప మొదవె
యువరాజు మనమున రెండవ మాఱు.
“బ్రతుకు కోటిని గల యల లెంత హాయి
కాలపు టిసుకలో గలసి పోవున్న,
వ్యర్థంబులై విషాదాంతములగుచు
ఇసుక పఱ్ఱల లోన నింకి పోవున్న”
అనుకొని జనకుని కడ కేగి యిట్లు
యువరాజు వివరించె మదిలోని కోర్కె.
“ముంత దాచఁగ నేల చల్లకు వచ్చి?
తెలియకుండఁగ నేను దగు వేస మూని
ప్రజల కష్ట సుఖాల నిత్యజీవనము,
వారి వైఖరు లన్ని యున్న దున్నట్లు
తిరిగి నగరమంత చూతును గాక,

దయతోడఁ జేయకు మునుపటి వలెను
కట్టుబాటుల నన్ను సంతోష పఱుప,
జనులకు నీకును సన్నిహితుండ,
సాకల్యముగ వారి సంగతు ల్గనఁగ
అనుభవ మబ్బును, దెలివియు గలుగు.
కావునఁ జూడబో మొదల యిమ్మ"న్న
మంత్రిమండలిఁ గూర్చి యోచనఁ జేసి,
"కూటిలో నుండంగ నన్నిట భయమె
స్వేచ్ఛమై యెగురంగ విశ్వాస మమరు,
డేగపిల్లను బోలు నీ బాలకుండు;
మునుపటి శోకముఁ బాయంగవచ్చు,
పోనిండు, నాతండ్రిఁ గనిపెట్టి యుండి
మనసెట్లు మాఱునో తెలుపుఁడు నాకు"
అని సమ్మతిని దెల్పె శుద్ధోధనుండు.

ఆ మఱునాడున మధ్యాహ్న మందు
తానును సారథి చెన్నుండుఁ గలసి,
యజమాని భటుఁడటు వేసము ల్దాల్చి,
నలుగురిలో నొకరైన పోలికను,
అచ్చటి పనులను వింత లారయఁగ
కష్టసుఖంబుల తీరులఁ గనఁగ,

బయలు చేరిరి వారు పురవీధు లందు.
రంగుల చారల యంగడి లోన
పద్మాసనస్థుండై కోమటి సెట్టి,
బేరసారంబుల సాగించు కొంచు
లెక్కల సరిజూచు కొనుచుఁ గూర్చుండె;
వాగ్యుద్ధములఁ జేసి ధరలు తగ్గింప,
విప్పిరి డబ్బు మూటల కొనువారు;
ఈగెలు మూగె మిఠాయి యంగడుల;
తప్పకొనుఁడు త్రోవఁ, బ్రక్కఁ బొండనుచు
తోలిరి గలగల రెండెడ్ల బండ్లు;
పల్లకీ ల్మోసిరి పాడుచు భటులు;
చంకను బిడ్డఁడు నెత్తిపై బిందె
తో వచ్చె నిల్లాలు బావికి బోయి,
కాలు గజ్జెలు మ్రోయఁ గొనసియాడ;
టంగు టంగని మ్రోయఁ దనవింటి త్రాడు,
ఏకెను దూదిని నొక సాలెవాఁడు;
వడుకఁగ నొక్కతె, నేయ నొక్కరుఁడు;
బహాదూర మేగిన భర్త భద్రముగ
మఱలంగ నింటికి, మగబిడ్డ కలుగఁ
గోరుచు, మగనాలు కానుక ల్గొంచు,
శ్రద్ధతో గుడికేగ భక్తిఁ బూజింప.

కమ్మరి కుమ్మరి కంసాలి సాలి
మంగలి చాకలి మఱియు వడ్రంగి,
వివిధ వృత్తుల వారి వారి చాకిరుల,
కాయ కష్టంబులఁ జాకచక్యముల,
బ్రాహ్మణుల్ క్షత్రియుల్ వైశ్యశూద్రులను,
గాయకుల్ సైనికుల్ గారడివాండ్ర,
పగటివేషంబులఁ బాముల వాండ్ల
పంతుళ్ళ గుళ్ళను వివిధోత్సవముల
పాఠము ల్వల్లించు బాలబాలికల,
తిలకించి, పరికించి, విని, విచారించి
వీధులవెంబడి నడువగా వారు
కోట గోడకుఁ గ్రిందుగా నున్నయట్టి
ఏటివంతెన సమీపించుచు నుండ;

కుయ్యో యటంచును మొఱ్ఱో యటంచు
చచ్చితి వేగమె రక్షింపుఁ డంచు
దారి దుమ్మునఁ బడి బొర్లాడు చుండె
దైవోపహతుఁడైన యొక కుష్ఠురోగి.
కనుగ్రుడ్లు పెనునొప్పి గిఱ్ఱునఁ దిరుగ
వేదనతో నోరు వంపులు వోవ
చెమట నొసటఁ గ్రమ్మ, దడ నొడల్వడఁక

సీగ్గారు పుండ్లపై నీగలు మూఁగ
బీభత్సవముగ నుండెనా పాడుపాపి
ఊపిరి తిరుగక తబ్బిబ్బు లగుచు,
పచ్చిక యూతగా లేవఁగా బోయి
సగము లేవక మున్నె చతికిలఁబడెను
తడఁబడ కాళులు గుండె కొట్టుకొన,
చావు కేకను బెట్టి కాపాడుఁ డంచు;
విని దాని యువరాజు కని వాని స్థితిని,
వేగమె పరుగెత్తి వాఁడున్న యెడకు,
మెల్లఁగఁ దలనెత్తి మెత్తని చేత
మోకాట నిడుకొని మృదువుగ నిమిరి
ఎసక మెసఁగ, జాలి, కృప నిట్లు వలికె:
"ఓయన్న! నీకేమి యాపద యొదవె
వేదనం బడెదవు లేవలే కిటుల;
ఓచెన్న! కారణ మేమిటో చెప్పుము!
రోఁజుచు రొప్పుచుఁ బరు లెగయంగ
నిట్టూర్పు వెడలంగ మాటాడ లేక
మూల్గుచు నున్నాఁడు శోచనీయముగ"
సారథి చెప్పె సమాధాన మిటుల:
"ఓస్వామి, యేమని చెప్పుదు? వీఁడు
వ్యాధి పీడితుఁడయి బాధ నల్లాడు,

అంగంబు లెల్లను బట్టులు దప్పె,
సంధులు జాఱెను, గ్రంధులు చెడియె;
నిండు ప్రవాహంబు పోలిక పాఱు
నెత్తురు చెడి, పీని నాడుల యందు
పొంగుచుఁ బొరలుచు గంతులు వైచు;
క్రమబద్ధముగఁ గొట్టుకొను వీని గుండె
వక్రమై యల్లాడు వడిగఁ దిన్నగను,
గతి దప్పి వాయింప మ్రోగు మద్దె లన;
అంగబలము వోవ నందంబు డింద
మూర్ఛ పైకొన మూల్గు రోగి యీతండు,
గాలి పీల్చఁగ లేక కడుఁ గష్టపడుచు,
గ్రుడ్ల మిటకరించు, బండ్లను గొఱుకు,
ఆవేఁగా లేకయు నోర్చుకో లేక
తారుమారగు పేఁడు తగులు నొప్పులకు;
నిస్సారముగఁ బీల్చి పిప్పిగఁ జేసి
బహుగు ప్గీనును వీడి వెడలును వ్యాధి
వెంటాడ నొక్కని; తాకకు మయ్యా
నీకైన రావచ్చు నంటు రోగంబు"
"ఇట్టి వారు కలరె పుడమిఁ బెక్కండ్రు,
నాకైన సోకునే యిట్టి జాడ్యంబు"
అని పల్క రాపట్టి; చెన్నుఁ డిట్లనియె:

"వ్యాధులు పరిపరి విధముల వచ్చు
మానవ కోటికి మానక స్వామి,
దగ్గు బ్బసంబును జలుబు జ్వరంబు,
పారుడు నీరుడు పిత్త వాతములు,
శ్లేష్మ రోగంబులు క్షయయుఁ గుష్ఠువ్రును.
తెగుళ్ళుల తెన్నులు తెలుపంగ తరమె?
అవి యివి యననేల నెన్నఁగాఁ జాల
తెలుపక వచ్చునే? యని యడుగుదువె.
డాచిన కోఱల పామును బోలి,
పొదమాటు దాగిన పులుల పోలికను,
పిడుగు కైవడి, కర్మ వశమున వచ్చు
ఎప్పు డేరూపునో యెఱుకకు రాక.

"ఔనౌను ఓస్వామి! నీవన్న యట్లె
ఆయువు నూఱేండ్ల, దినము గండంబు,
బ్రతుకు వెఱపుఁ గొల్పుఁ బ్రాణుల కెల్ల;
హాయిగా నిదురింతు నీరాత్రి యంత
ప్రొద్దున మేల్కాంతు లేదొక చింత,
అని చెప్పఁగలవాఁడు ధరణిలో లేడు"
"చెప్పక వచ్చెడు దుఃఖాలఁ దూలి,
బాధ లనుభవింప మిగులున దేమి?"

"శుష్క శరీరంబు, శోక మానసము".
"ఆపైని బ్రతుకంగ?" "ముదుసలి తనము."
"బ్రతుకు భారము నీడ్వ బాధాభయముల
వయసు మీఱంగఁ గడ కెద్ది ఫలితము?"
"చావు తప్పదు స్వామి పుట్టఁగా భువిని
ఎప్పుడో యెక్కడో యే విధంబుగానో.
వచ్చెడి నదె చూడుఁ చచ్చిన వాఁడు,

కను లెత్తి చూడంగఁగనఁబడె నెదుట,
వలవల యేడ్చుచు నేటి వైపునకు
కాటికిఁ జనుచుండు జన సమూహంబు;
ముందు నిప్పుల ముంతతోఁ జన నొకఁడు,
రామ భజనఁ జేయ వెనుక బంధువులు,
నాలుగు తట్టుల నలుగురు మోయు,
కదలి వచ్చెను పాడె, కనఁబడ నందు
కాళ్ళుగపడ ముందు, మీఁది శవంబు
కట్టె వలెను నీల్గి కదలిక లేక;
గుంటలు పడెఁ గండ్లు, బిగిసెను బడ్లు,
జాఱెను దవడలు, చూపు లోపించె,
పసుపు కుంకుమ చల్లఁబడి యుండె బైన.
నాలుగు బాటలు కలసెడి చోట

దింపుడు కల్లాన దింపిరి దాని,
ఆపైని కొనిపోయి పేర్చిన చితిని
పెట్టిరి; అంతట నిప్పు నంటింప,
చిటపట మంటలు నాలుక ల్చాచి
నలువంక బ్రాకంగ, బొగ లెగయంగ,
పటపటం బగులంగ నెముకలగూడు;
కట్టెలు, కండలు కాలి పోవంగ
బూడిద పిడికెడు కడపట మిగిలె.

"ఇదియేనా యంత్యంబు?" "ఔ, యువరాజ"
"కాకులు దినవచ్చి బూడిదఁ గాంచి
కా కా యటంచును నరిగెడి దిరిగి.
గుప్పెడు నుసియయి మిగిలిన యితఁడు,
మనవలెఁ దినె, ద్రాగె, నవ్వెఁ, బ్రేమించె,
బ్రతుకు తీపి యనుచు మదిని భావించె;
విధి వశంబున వచ్చు వ్యాధినిఁ బడియొ,
ఒక్క ప్రమాదము నకు గుఱి యయ్యొ,
అసువులు వెడలంగ, శవముగా మాఱి,
ఆకలి యెఱుఁగదు, చెవి వినఁ బడదు,
రుచి చూడఁగా లేదు, మాంసంబు నంటి
మంటలు గ్రమ్మంగ వాసనఁ గనదు.

ఇంద్రియ వ్యాపార మెల్లయు నుడుగ,
కట్టెగా మిగిలి కాయము గాల
కని దాని విలపింత్రు చుట్టలు చెలులు;
కాల్చుకున్న నగును కడుపార విందు
క్రిమి కీటకంబుల కది భూమి యందు;
జీవన జ్యోతికిఁ గుదురైన కుంపె
మట్టిలోఁ బుట్టి తా మట్టిలోఁ గలియు;
రాజును పేదయు ఖలుఁడు సజ్జనుఁడు,
పులియును బురుగును పుట్టయు చెట్టు,
పుట్టిన వన్నియు గిట్టుట నిజము!
నామ రూపముల కియ్యది యగు నవధి.
మఱల జన్మించియు, మరణించి, మఱల
చావు బుట్టుకలను చక్రానఁ దగిలి
తిరుగు చుందు రనుచుఁ జెప్పఁగా విందు"

కడదాక కని విని మనుగడ నడక,
దివ్యాశ్రువులు గాఱఁ గనుగవ నుండి,
మోమెత్తి రాపట్టి గగనంబుఁ గాంచె,
కరుణతో నిండిన కన్దోయి తోడ.
పుడమిని గనుఁగొనె; చూపు తూపులను
నింగిని నేలను బర్వఁగాఁ జేసె;

కనరాక, బుద్ధిని నెఱుఁగంగ రాక
మఱుఁగున డాఁగొని, మింటిని మంటి
రెండింటి నడిపించు నద్భుతశక్తి,
నన్వేషణము సేసి యరయఁగా గోరి,
సత్య స్వరూపంబుఁ గాంచు జిజ్ఞాస;
నెనరు వెన్నెలఁ గాయ మోము జాబిల్లి,
గాఢ విశ్వాసంబు మనమున నిండ,
ఆశతో మొగమెత్తి యావేశ మనఁగ
ఉచ్చైస్స్వరంబునఁ బలికె రాపట్టి:

"బ్రతుకు కోరిక యల్లి కూర్చిన యట్టి
చావుఁ బుట్టుకలను వలలోనఁ జిక్కి,
వేదనఁ బడియెదు మానవులార!
దుఃఖ దవానల దగ్ధ లోకంబు!
కంటి, దెలిసికొంటి కనువిప్పు గాఁగ
మనుగడ కడలేని యొక పెనుబాధ;
క్షణిక సుఖంబుల చవిని జూపించి
కోతి కోనంగుల లట్లాడించి మనల
మోసగించు మిగుల నింద్రియ గణము
పట్టి బూటక మిది కపట నాటకము.
సుఖము లంతములగు బాధల యందు,

ప్రాయంబు ముదుసలి తనమును బొందు,
ప్రేమబంధము వియోగంబును జెందు,
ప్రాణంబు తప్పక మరణంబు నొందు.
చాఁబుట్టుకల జీవి తిరుగుచు నుండు.
సుఖములు కడలేక కొనసాగు నంచు
బ్రతుకు తీపి యనుచు భ్రమపడి నాఁడ.
జీవిత వాహిని గలగల పాఱి
కడ కుప్పునీటిని, గడలిలో గలియు.
తెఱ జాతి పోయెను, దెలిసె వాస్తవము.
నావలె నందఱు నిస్సహాయులరె;
ఎలుఁగెత్తి పిలువఁగా వినరు దేవతలు;
ఆదుకో లేనట్టి వారలె వారు.
వారికి సాహాయ్య మవసర మేమొ;
శక్తి నా కుండిన విడువ కొక్కరిని
గాపాడ కుందునే యందఱ బ్రేమ.
మార్గ మేది మనకు మోక్షంబు నంద,
దేవుఁ డొక్కఁడు గల్గ నిజముగా మనకు;
కష్ట జలధి నేల బొగలును బుడమి.
ఉండిన పాపిష్టివాఁడు కాఁబోలు,
లేకున్న నగునేమో వట్టి దద్దమ్మ.
సారథి కన్నుగొంటి సకలమ్ము నేఁడు,

రథము మరల్పుము చేరంగ పేటం.

వృద్ధరాజది విని కడు వెఱగంది,
మూడింతలుగఁ బెంచె ద్వార పాలకుల.
కలలోని దినములు గడచిన దాకి
రేగాని, పగలైన, నెవ్వరే గాని
వెలుపల, లోపల, పోరా దటంచు
గట్టి కట్టడిఁ జేసెఁ గడు దిట్టముగను.

———:o:———

# చతుర్థాధ్యాయము



గడువు దాటక మున్నె, తటి తప్పకుండ,
భువన విఖ్యాతమౌ, బుద్ధుని భూరి
సంపరిత్యాగంబు సంభవ మయ్యె.
తప్పనే జరుగక దైవ నిర్ణయము!
పొగిలె నేడ్పుల తోడ భోగ మందిరము,
పగిలె శోకంబుచే రాజు మానసము,
రగిలె రాజ్యంబున వగ సెగ పొగలు,
-కలిగెను గాదె యీ యెడబాటు వలన-
మానవ జాతికి ముక్తి మార్గంబు;
వెలిగె ధర్మజ్యోతి విశ్వమం దంత!

అది మధుమాసంబు, పున్నమ రేయి,
ఇందూదయం బయ్యె, నినుఁడు గ్రుంకంగ;
తూర్పు వైపొక్కటి పడమట నొకటి
వెన్నెలఁ దెచ్చుచుఁ జీఁకటిఁ బడుచు
ఎగఁబ్రాకె నొకశక్తి దిగజాఱె నొకటి;
క్రిందు మీఁదులు కాల సహజముల్ గావె!

సుఖము దుఃఖంబును జావుఁ బుట్టువులు
సురలకు నరులకు సూర్యచంద్రులకు
సమయము రాఁ గల్గు సకల జీవులకు.
మామిడి కాయలు ముదిరె నెఱ్ఱగను,
వాసనల్ నింపె నశోక వృక్షములు;
శ్రీరామ నవమి పండుగ వచ్చునపుడు
పల్లె పట్టనములు పొలము లన్నియును
పచ్చఁగఁ గళకళ లాడుచు నుండె;
మంచు కొండలనుండి పిల్ల తెమ్మెరలు
చల్లఁగా వీచెను హాయి గొల్పుచును,
మింటిపై జుక్కలు మంటిపై బూలు
కాచెను బూచెను గనుల పండువుగ,
"విశ్రామ వనవీథి జేరె రేరాణి,
నిగనిగ గగనంబు నెక్కె రేరాజు,
కొలకులఁ గలువలు కలకల నవ్వె,
మిలమిల మెఱసెను 'రోహిణి' యలలు.
వెన్నెల పులుగుల కడుపులు నిండె;
నిదురించు కొండలు గట్టులు గుడులు
యిండ్లల కప్పులు వెండిగాఁ దోచె
పిండి పఱచినట్లు పాలవెల్లివలె
పండు వెన్నెల కాయు పున్నమి రేయి;

అమృతంబు వర్షింప నింగిజాబిల్లి
భూమాత తన కష్టముల నెల్ల మఱచి
ఆనందమున నిదురించె మైమఱచి;
కీచురా యఱపులు నక్క కూతలును
కావలి వారల పిలుపులు దప్ప,
వేరొండు సవ్వడి వినఁబడ దపుడు.
ఉపరిభాగమ్ము వెన్నెలయందు మెఱయ
నిశ్శబ్దముగ నుండె భోగమందిరము.

మలచిన శిలల సందులలోనదూరి,
ముత్తెపు గోడల మెఱపింపఁ జేసి,
పనిగల పాలరాతి నేలను గడచి,
వెన్నెల దీపింప లోపలి గదిని
నాగలోకములోని నగర సుందరుల
మించెడి మగువలు గన్పించి రచట,
నొకదాని నొక్కటి కాంతిని మించు
దివ్య హారములోని మణుల పోలికను,
కనుఁగొనఁ గన్నులు జాలవో యనఁగ,
భోగమందిర భోగ భామినుల్ వారు.
అంగంబు లందందు నగపడఁ గొంత
నిద్దుర యొడిలోని వారి సోయగము,

వారి విలాసము వర్ణింపలేము;
నిగనిగ నెఱికురు ల్విరులను బోలి
తీవితో గంబు కంఠంబును గప్పి
సన్నని నడుమునఁ బడి జాఱిపోయి
వలుద పిఱుందుల నెగఁబ్రాకి యుండె;
వెన్నెల పులుగులు కలకంఠ మెత్తి
పగలెల్ల హాయిగా బ్రేమతోఁ బాడి
అలసి ఱెక్కలసందు నిడుకొని మెడను
ప్రొద్దు పొడుచుదాక నిద్రించు కరణి,
ఆటపాట నలసి పండిరి వారు.
తళతళ మెఱసెడె వెండి గొలుసుల
వ్రేలాడు రజతంపు సెమ్మెల యందు,
పరిమళ తైలముల్ పెంపఁగా వెల్గు
దీపపు గాంతులు వెన్నెలం గూడి,
వింత కాంతుల నీన, నచ్చటి వారి
నంపుల సొంపులు హొయలు గన్పించె;
ఊపిరి కల్లాడు వక్షోజములును,
విప్పిన పెదవులు ముత్యంపుఁ బంట్లు,
పట్టు కన్రెప్పలు, వింటి కన్బొములు,
చెక్కుటద్దంబులఁ జెదరు ముంగురులు,
వట్రున రెట్టలు, రంగుల వ్రేళ్లు,

చంద్రాననలు చక్కఁదనమును జూపె.
చేతులఁ గాజులు కాళ్ల గజ్జెలును
చిరు సవ్వడిని జేసె పొరలఁగా నారు:
తన నాట్యమును మెచ్చి రాపట్టి ప్రీతి
నొసఁగిన కానుకఁ బుచ్చుకొన్నట్లు
కలఁగాంచి, నవ్వెనో యన నొప్పె నొకతె;
వక్షౌనజేరిచి నగలాడి యొర్తు
లేడి మొగంబును, బన్నీటి పువ్వు
రేకుల నందింప దాని నోటికిని,
ఇద్దఱట్టులె నిద్ర నొందఁగా, మిగిలె
నొకరేకు సొగసుగా సుందరి చేత
సగము మ్రింగినయది సారంగి నోట.
మొగలిరేకుల దాల్చి తమ జడలందు
పూఁబోఁడు లిద్దఱు కలసి నిద్రింప,
వాసన లూపిరిలో మేళవించె,
అవయవంబులు పొంద మొక్కటి గాఁగ;
సతి కంఠహారంబుఁ గూర్పఁగా నెంచి
పచ్చల రవ్వలఁ గెంపు నీలముల,
సూది దారముతోడ గ్రుచ్చుచు నుండ,
పచ్చల పూసొండు మిగులుగాఁ జేత
గ్రుచ్చక దానిని నిద్దురఁ గూరె;

పరచిన రత్న కంబళముల మీఁద
సోలి వ్రాలిరి పద్మగంధులు గుమిగ,
సెలయేటి సవ్వడి లాలి పాడంగ;
ప్రొద్దు పొడువ విచ్చి రాణించు కొఱకు
ముడుచుక యుండెడు పద్మంబులట్లు.
దీని దాట గలదు శయన మందిరము,
వాకిలియందు గౌతమియును గంగ
సర్వాంగ సుందరుల్ నిద్రించు చుండ్రి.

కెంపులు నీలాలు కాంతులఁ జల్ల,
జాలువా జలతారు లంచుల మెఱయ,
తెఱ యొండు వ్రేలాడు వాకిలిఁ గప్పి;
పనితన మగుపడ దీర్చిన యట్టి
యందమౌ గంధపుఁ జెక్కతో నమరి
చూడ సొంపగు ద్వారబంధము మిగుల,
మూడడుగులు వోవ దానిని దాటి,
కన్పడు నయ్యారె! కన్నులు చెదఱ
రమ్యాతి రమ్యమౌ శయన మందిరము!
వెండి దువ్వలువలు గప్పిరి నేల,
నడువగా మృదువుగా బువ్వులఁ బోల;
అందు వేదిక మీఁద నగుపడు మనసు

తూగు మంచము పైని పెండిలి పాన్పు,
మలచిన ముత్యాల చిప్పల తోడ
గోడలు వెలుగొందు, చలువరాకప్పు
చిత్ర విచిత్రంబులౌ శిల్పకళల
రంగుల మణులతో జెక్కిన యట్టి
పువ్వులఁ, బిట్టల, నలరారు చుండు.
చిత్రముగా నుండు చేపట్టులోని
ముచ్చట యచ్చుల సందుల దూఱి,
పుష్ప సుగంధముల్ తమతోడ గొంచు
చల్లని గాలులు, లోబ్రవేశించు
వెన్నెల వెలుఁగులతో గూడిమాడి.
రూపలావణ్యాల నపురూపు లగుచు,
అన్నిటఁ దమయున్కిఁ చేతను మించు,
ప్రేమ మూర్తులైన రాజ దంపతులు.

నిట్టూర్పు లెగయంగ, నదరంగ గుండె,
పయ్యెద జాఱంగఁ, గన్నీరు కాఱ,
ప్రక్కఁ బరుండిన యువరాజ పత్ని
రాణి యశోధర, మృదుశయ్య నుండి
లేచి, కొంత దనుక మాటాడ లేక,
సిద్ధార్థు హస్తంబుఁ బెదవితో దాకి,

మూఁడు ఝాములు తుద కోళ్ళులు మ్రోఁగ
"లేలెమ్మ ప్రాణేశ' యూఁపడింపంగ",
"ఏమి ప్రాణప్రియ యేమాయె" నన్న
కడకతో గడకళ్లు పలికెను దేవి:
"మన వలపుల పంట మన భాగ్యరాశి
మన బిడ్డ కడుపులో కదలి యాడంగ
వినఁబడె నింపైన సంగీత మట్లు,
ప్రాణే ద్వయ ధ్వని నాడుల యందు,
పొంద మానంద కంపకలితము గాఁగ
నిద్రఁ గూరితి నాథ నేటి రాతిరిని,
కలలఁ గంటిని మూఁటి, కడు భయదముల;
వృషభ రాజును గంటి ప్రథమ స్వప్నమున;
శృంగంబు తెగయఁగ కీవిగా నడువ,
వీథుల వెంబడి ద్వారము కడకు;
దాసి ముఖంబున వెలిఁగె రత్నంబు
కాంతిని రాలెడు నక్షత్ర మనఁగ,
పాతాళ లోకాలఁ జీకటు లీడ్చ
ఫణి ఫణాగ్రస్థమా రత్నమో నాఁగ;
ఇంద్రుని కైనను శాసింప రాక
అనివార్యముగ నది నడువఁగా నట్లు,
బట్టడ్చి, మెడఁబట్టి, నిలుపఁగా నెంచి,

ద్వారము లూర్మియుఁడో యని యఱచితెసి;
కొంత విజృంభించి కోపాల తేషు,
ఊపుతో బట్టును విడఁగొట్టు కొంచు,
కావలి వారలఁ గాళ్ళతో ఊచి,
కదలిపోయెను ద్వారబంధంబు నెడలి.
దిక్పాలురను బోలి దేదీప్యముగను
నెగ్గు మూపులు నాలు, గంబర వీథి,
కడు రయమున వచ్చి వ్రాలెను, నగరి
కోటపై నెగరెడు సింద్ర ధ్వజంబు
ధరిఁగూలె, నచ్చోట బానులుగా నెలసె,
వింత శోభలతోడ విజయ పతాక;
వళులందు జలతారు పోగుల నంటి
ధగధగ మెఱసెను మణుల దీధితులు
క్రొత్త పదంబులు వింత వాక్యములు;
వేకువ గాలి రా, విడివడె వళులు
అగుపడె వ్రాత లందరికి స్పష్టముగ;
మననముల యందు మన ప్రాంత మందు
కసరాని వెన్నెల పూవులు రాలె
ముదముఁ జేకూర్చుచు జూచు వారలకు.
"ప్రేయసి దృశ్యంబు ప్రియముగుఁ గాదె",
అన్న రాపట్టికి దేవి యిట్లనియె;-

"ఔగాక! భయదమై కడ వినుపించె;
'సమయము వచ్చె సమీపించె' ననుచు;
అంతట మూడవ కల కనుపించె:
నాతోడు నానీడ నాకు సర్వంబు
ఓనాథ! నీకయి వెదకులాడంగ,
తలలేని తలగడ, పై గుడ్డ దక్క,
కన్పడవు, పడక శూన్యమై యుండె,
ముత్యపు మొలత్రాడు నా రొమ్ము చుట్టు
చేరెను, జూడఁగా బాముగా మాఱె;
కడియముల్ విడిపోయె, గాజులు విఱిగె,
తలలోని పూవులు వసివాడి పోయె,
పందిరి మంచము తలక్రిందు లాయె,
రంగుల తెఱ చిన్గి ముక్కలై పోయె,
వినఁబడె దూరాన వృషభపు ఱంకె,
కనఁబడె దూరాన విజయ పతాక,
మఱల వినంబడె నా వింత వాక్కు
-జలదరించు నేడద తలంచు కొన్నంత-
'సమయము వచ్చె సమీపించె' ననుచు;
మేల్కాంటి నోనాథ! స్వప్నార్థ మేమో?
ఏను గతింతునో, లేకున్న నయ్యో,
నీ వియోగంబు నందుదునో ఓనాథ,

ఏమి కర్మమొ యేమి జరుగ నున్నదిరొ"
అనుచు దత్తరముతో నిట్టూర్పు లెగయ
విలపించు, ప్రేయసిం గాంచి ప్రభుండు.

తియ్యని చూపులు చిఱునగ వెలయ,
బుజ్జగించుచు నిట్లు ప్రేమతో బలికె:-
"నిశ్చలమా ప్రేమ నిత్యమె యైన
ఊరడిల్లుము సఖి వగనొంద నేల,
కానున్న పనులకు ముందుగా దోచు
నీడలే యైనను నీకన్న కలలు,
దేవత ల్నలవులు దప్పిన గాని
జగతిఁ గాపాడంగ ననువైన త్రోవ
కనుపింపఁ గాలము చేరువ యైన,
సిద్ధార్థు ప్రేమ యశోధర యందు
నిశ్చలమై యుండు, నిది నిశ్చయమ్ము;
కానున్న యవి కాక మానవు సుమ్ము;
నీ వెఱుఁగవె నేను గొన్నాళ్ళనుండి
పుడమి వగపు మాన్ప పూని యుండుటను,
మొగమైన యెఱుఁగని మనుజులు వగపు
జూచి మానుపఁ గోరు నెప్పుడు నా మనము,
ప్రేమింప కుండంగ నెట్లుండ గలను?

నా తోడు నీడను ప్రియతమ నిన్ను;
మన దేహాయుగమును బంచుక పుట్టు
బిడ్డఁ డో ప్రేయసి, ఓ మాతృమూర్తి!,
గూటికూనల వీడి దేశ దేశముల
గ్రుమ్మరి, యాహారమును సేకరించి,
జీవ్వన నిసువులఁ జేరంగ వచ్చు,
ఫుల్గు కైవడి, యాత్మసరుల దుఃఖముల
శ్వాసంగ, పరిపరి విధముల వెదకి,
ఏతెంచు, నినుఁ జేర, కుసుమ కోమలిని;
మగువల మేల్బంతి గుణముల దొంతి,
వృషభరాజంబును విజయ పతాక,
దీని సూచకముగ నేదైన యొకటి
కలిగినఁ గలుగనీ, గాకేమి వినుము:
నీయెడ నా ప్రేమ పూర్ణము సఖియ;
యిప్పు డప్పు డనక యెల్ల కాలముల.
అందఱ కొఱకునై వెదకుదు దేని
ముందు నీకగుఁ గాదె ముద్దుల గుమ్మ;
కావున నాచెలి వెఱపును వీడు,
స్థైర్యంబు పూనుము, ధైర్యము నిలుపు,
కావడి కుండలు ఖేద మోదములు;
ఒకవేళ మన దుఃఖజాలము వలన

పుడమి పొందఁగ వచ్చు శాంతిపథమ్ము.
ప్రేమ చాలదు తెల్ప, నెఱిఁగింతు నెట్లు?
విశ్వాసియగా ప్రేమసూచక మిదిగో!
కౌఁగిలి కానుక గైకొమ్ము కొమ్మ,
ముద్దిమ్ము మోమున బుత్తడి బొమ్మ,
హృదయము హృదయమ్ము హత్తుకొనఁగ,
తెలిసికొమ్మొరు లెఱుఁగని రహస్యమ్ము;
ప్రాణికోటుల నెల్లఁ బ్రేమింతుఁ గాక,
నిన్నుఁ బ్రేమింతు నే నన్నిటి కన్న,
నిద్రపో నారాణి కాపుందు నేను.

కొలుకుల కన్నీరు తుడవకుండఁగనె
నిదురింప నాదేవి, నిట్టూర్పు లెగసె.
మఱల నా దృశ్యంబు కన్పించె నేమొ
డగ్గరె కాలమ్ము మాట విన్పడెనో.
మోమెత్తి యువరాజు గగనంబుఁ గాంచ.
కర్కాట కస్థుఁడై రేరాజు వెలిగె.
మున్నెప్డొ విజ్ఞలు చెప్పిన భంగి,
ఉడుగణం బెల్లను నింగి యందమరె;
"ఇదె వచ్చె నానిశి, యెన్నఁడో నీవు
కోరుదో కీరితి, మంచి కానలెనో,

రాజాధి రాజుగా నుండఁ గోరుదువో,
సంఘ పరిత్యాగివై సంచరింతో.
పుడమిని పాలింతో, బ్రోతువో పృథ్వి"
అని తన్ను బ్రశ్నించు నట్టులఁ దోఁచె.
అదిగాక దేవతల్ వీణ మ్రోయింప,
మును విన్న గీతికల్ వినఁబడె మఱల;
అదు నెర్గి సురవరు లేమకానో యంచు
చుట్టును మూఁగిరి సిద్ధార్థుఁ జూడ,
లేకున్న వింతలు పుట్టునే యిఁటుల?
"వచ్చెను సమయంబు వెడలుదు నిద్దె.
నిదురించు నో రాణి! నీ పైని ప్రేమ
పురికొల్పు చున్నది పురము వీడంగ,
వచ్చుగాక వియోగము మనకు దీన,
నిశ్శబ్ద గగనాన నగుపడు నదిగో,
మెఱపు దీగయు బోలె నా విధి వ్రాత
దేనికై పుట్టితి పెరిగి తిందాక.
వలదు కిరీటంబు పుడమి, పెత్తనము,
దండ ప్రయోగంబు, దమన నీతియును,
పీనుగల్ తేలంగ నెత్తురు వాఁక
విజయ యాత్రలు సాగఁ గోరదు మనము;
వైరులఁ గల్పించి వధియించి వారి

రక్తాన్నమును దినఁ గాను రాక్షసుఁడ;
బాటసారి నగుదు భిక్షమా బ్రోవ.
ఓరిమి తోడుగా నహచెద నందు,
అకలుష పదముల నకలంకముగను,
ధూళి ధూసరితముల్ పడకలు గాఁగ,
నిర్జన స్థలముల నివసింతు నేను;
అల్ప జీవులు గాఁగ సహచరు ల్నాకు,
పాత పేలికలు దువ్వలువలు గాఁగ,
భిక్షాన్నమే గాఁగ బరమాన్న సమము,
పొదలు గుహలు గాఁగ రాజ సౌధములు,
సన్న్యాసి రాజునై సంచరించెదను;
జీవుల బాధలు, కడగండ్లు, వెతలు
జగతి దుఃఖము గాంచ కరుణతో నిండె
నాయాత్మ, కావున నే నొనరింతు
ఎట్టి త్యాగంబైన, పోరాట మైన
వారింపఁ గల్గిన వారల ఎగవు.
చిన్నలు పెద్దలు పెక్కు దేవుళ్ళు
చూచిన దెవ్వరు న్నారలో లేరో?
శక్తి సంపన్నులో, కరుణ కల్గెడినో,
మానవు లేప్రొద్దు వారి ప్రీతికిని
భజనలు సల్పంగఁ, బ్రార్థన ల్సేయు,

మాటాడ నేరక, కోతుల రీతి
శబ్ద సంజ్ఞల తోడ మెలఁగిరి కాదె!
ప్రేమయు త్యాగంబు సాధన తపము
సాధింపఁగా లేని సుఖములు గలవె.
అన్నియు నమరిని నావంటి వాఁడు,
కొదవయే లేనట్టి కొదమ సింగంబు,
ఆరోగ్యవంతుఁడు, నవ యౌవనుండు.
కోరిన రాజాధిరా జగువాఁడు,
బ్రతుకు బాధల తోడ విసిగి వేసరక,
మొక్కవోవని మగటిమిఁ గలవాఁడు,
వలపులఁ దేలియుఁ దృప్తిని గనక,
తక్కువ తన కేమి లేకున్నఁ గాని,
యితరుల దుఃఖాల దనవిగా నెంచి
వింత చింతలు దోప వగ గూరువాఁడు,
వ్యర్థము గ్గానీక వీని నన్నిటిని,
మనుజుల రుజలనుఁ బోకార్పఁ బూని
కరుణ జాల్వారంగఁ, దెంపు పెంపార,
ప్రేమయు దయను బరవళ్ళు త్రొక్క,
సత్యంబు నెఱుఁగఁగ మోక్షార్థి యగుచు,
నిశ్చల బుద్ధితో దీక్ష వహించి
పరిశోధనము సేయఁ బలు విధంబులుగ,

తెలియమి యను తెఱ దిగజాఱి పోదె,
ఎప్పుడో యెక్కడో యెఱుకకు రాదె
సత్య స్వరూపంబు లో చక్షువులకు.
పోయిన యిహలోక సౌఖ్యము లొల్లని,
పరలోక సౌఖ్యము ల్పడయును వాఁడు.
మృత్యుం జయుండగు నమరత్వ మొందు;
కృత నిశ్చయుఁడ నౌదు దీని సాధింప,
కోటి మానవుల దుఃఖముఁ జూడఁ జాల,
ఎట్టి త్యాగంబైన నెఱవక చేతు,
ఆహుతి గావింతు నా యన్న దంత.
సౌఖ్యంబు సేకూర నా సోదరులకు,
పిలుచు జుక్క లవిగోఁ! పొగిలెడు పృథ్వి,
వింటిని పిలుపులఁ, గంటి నేడుపుల,
నా యౌవనంబును, నాదు రాజ్యంబు
నాదు సుఖంబుల భోగంబు లెల్ల,
నిదురించెడే నాదు వలపుల రాణి!
ప్రియతమమా నీదు బాహు వల్లరుల,
కడుపులో మెదలెడి నా కన్న తండ్రి!
పోజాల నినుజూచి నా భాగ్యరాశి.
ఎట్టులో గుండెను రాయిగఁ జేసి,
అన్నిటి నందఱి వదలి పోయెదను.

భార్యయు బిడ్డఁడుఁ దండ్రియు బ్రజలు
ఎడఁగల్గఁ బొందిక యడ్డు రానుండ,
ధర్మమార్గంబును గనుగొన్న దాక,
నిర్వాణ పదమును జేరు నందాక.
దానఁ గల్గును గాదె, మీకును నాకు.
శాంతి సుఖంబులు బ్రాణులందఱకు.

సంకల్ప సిద్ధుండు సర్వార్థ సిద్ధి
పోవంగ సమకట్టి, పోఁ గాలు రాక
తడఁబడఁ గాళులు, దడదడ గుండె,
కొట్టుకో, జేతులు గట్టిగా బెట్టి,
మూఁడుమార్లు తిరిగె మంచము చుట్టు
దైవ సమముగాఁగ నెంచుచు మదిని,
పాలభాగము సోక పాదాంగుళులను
చెలి పాదముల దాకె బ్రేమ పూజారి.
అశ్రువు లింకను నింక దన్నట్టి
ప్రేయసి ముఖపద్మ మందున వ్రాలె
అంతట నాతని చూపు తుమ్మెదలు.
మగుడ కెంతటికిని మాధుర్య మహిమ.
లేఖిని కంద దప్పటి భావదీప్తి;
మరులు మఱల్పంగ తగులము ద్రెంప,

ఎంత తెంత లవురగ! యెంత వాడికిని!
ముమ్మారు పోబోయి ముమ్మారు మఱలె;
ఎంతగా ధృఢమౌనో ప్రేమ బంధంబు!
ఎంతగా మధురమో ప్రియురాలి పిలుపు!
ముసుగు మోమున నెట్టకేలకు జార్చి,
గుండె రాయిగ జేసి ధీర వరుండు,
కడు సాహసంబున, తెంపు సొంపార,
తెఱఁ దొలగించెను ద్వారంబు దాటి;

అచ్చట నయ్యారె! తన యెట్టయెదుట
సుందర వనములో ముకుళించి యున్న
పువ్వుల పోలిక, నిద్రించు చంద్రి.
ప్రియసఖ్యు లెల్లరు ప్రీతిఁ గొల్చుచును
ముందు, ముచ్చట మీఱ, గంగగౌతములు.
"సెలవు సఖియలార! పోవుచు నుంటి
మిముపీడి, పోవంగ మనసొప్ప కున్న-
పోకున్న తప్పదు జరయును మృతియు,
పొట్ట బెట్టుకొనును బెన్నిద్ర మనల,
పూ, రాలిపో, శోభ, వాసన కలదె?
చము రింకిపో దీప మారిపో వలదె!
చిమ్మచీకటి! రమ్ము, నడిఁ గ్రమ్ము కొమ్ము,

అణచి పెట్టుము వీరి నడ్డురా కాండ్ర,
వీరును నేనును వృక్షము ల్వోలె
ఋతువుల మారుచు, తుద కెండిపోయి,
పొయ్యి కట్టెలు గాఁగ బ్రతుకఁగా లేము.
ఆలస్య మాయెను బో సెలవిండు,
జవసత్వములు గల్గఁ గనుఁగొన నింక,
అ పరంజ్యోతిని ముక్తి మార్గమును.”

ఆడుగులు వైచుచు దాటుచు వారి
వెడలె, సిద్ధార్థుండు గృహమును వీడి.
చుక్కల కన్నులఁ నొలికించెఁ బ్రేమ
రాపట్టెఁ గనిపెట్టి శేరాణి ప్రీతి,
చల్లని గాలులు వీచె హాయిగను;
వికసింపఁ బూవులు వాసన లెగసె,
ఫుడమి చలించెను, గడలి యుప్పొంగె,
నగములు గదలాడె, నా శుభవేళ
ఆనంద మయముగ నలరారె బ్రకృతి.
దివ్య గానము నింపె విందు వీనులకు
ఆడంగఁ బాడంగ గంధర్వగణము.
కమ్మని వాసనల్ గ్రమ్ముకొనంగ
వీదుల వాన కురిసె వెన్నెల లోన.

నాల్గు దిక్కుల నుండి వచ్చి దేవతలు,
బిగిసిన పెదవులు ప్రాణికిఁ దెల్ప,
కృపయును బ్రేమంబు పెనఁగొని రూపు
దాల్చెనా, జెన్నారు రాపట్టిఁ గాంచి
ముకుళిత హస్తులై మూగిరి చుట్టు.

చీకటిం బడిపోయి సిద్ధార్థుఁ డప్డు,
తట్టుచు లేపుచు నిట్టుల బలికె:
"చెన్నుఁడా లే లెమ్ము తెమ్ము కంటకము"
"ఇదియేమి, నాసామి, నడికి రే యందు
కనఁబడ దెద్దియు బొడిచికోఁ గండ్లు-
కార్య మేమగు" నంచుఁ బలికె చెన్నుండు.
తిన్నఁగ లేచెను నులుముచు గండ్లు.
"మెల్లగ మాటాడు! తెమ్ము గుఱ్ఱమ్ము
సమయము డగ్గఱె సత్యార్థి నగుచు
వెడలెద నేనిప్డు పురమును వీడి;
పసిడి పంజరమున బద్ధుఁడ నగుచు
నేనుంటి నిందాక పులుఁగు పోలికను;
పోయెద నెగురుచు నిశ్శృంఖలముగ,
నిజరూప మెఱుఁగగ నిశ్చల బుద్ధి,
సర్వ మానవులకు సేవఁ జేయంగ."

“అయ్యయో! నాస్వామి కడకిట్టు లౌనే?
మున్ను శాస్త్రజ్ఞులు సెప్పిన దెల్ల
వమ్మయి పోయెనే, యో యువరాజ!
పెదవుల కందిన యమృత భాండంబు
పగులంగ నైతువే, యెట్టి నా తండ్రి?
భూలోక స్వర్గంబు భోగ మందిరము,
రాజాధిపత్యంబు నన్నిటి విడి,
కటకట పోదువే కానల కిటుల”
అని గద్గదికతోడఁ బలికె ఛన్నుండు.
“విధివ్రాతఁ జెల్లింతు నాపనిఁ జేతు;
రాజ్య పిపాసతో రాలేదు నేను,
మాఱుచు నెప్రొద్దు మాయమౌ కడను
మాపట్టు జగమిది, నే గోరునట్టి
మాఱుపు నెఱుఁగని నిశ్చల శాంతి:
కావునఁ, గొనిరమ్ము కంటకాశ్వమును”
“నిన్ను సర్వమ్ముగా మదిని భావించి,
సుఖపడఁ దలఁచిన వారల విడచి,
వెతల పాలుగఁ జేసి, వెడలిన, నీవు
రక్షకుండ వెటుల చెప్పుము” యన్న
ఛన్నున కిట్టుల తెలియఁగఁ బలికె:
“స్వార్థమౌ ప్రేమము పట్టి బూటకము;

ఎల్ల ప్రాణులఁ బోలె, వారల నేను
నిజముగా ప్రేమింతు సధికముగాను;
కాయంబు గలవారిఁ గాపాడ బోదు
కావునఁ, గొనిరమ్ము కంటకాశ్వమును"

తెచ్చెద నిదె యంచు జనెను ఛెన్నుఁడు.
చింత తోఁప మదిని, చేరి లాయమును,
అశ్వ రాజంబును బయటకు దీసి,
నడుము పట్టను గట్టి కళ్ళెము వెట్టి
దుమ్మంత దులిపియు, దోమెను వోఁడలు
నిగనిగ పట్టులా మెఱయఁగ మేను;
మొగము పట్టను గట్టి, జీను నమర్చి,
జలతారు త్రాడుల మిలమిల మెఱయు
అంకెములను జార్చి, సవరించి యున్ని-
మీఁదఁ గప్పెను మేటి పట్టు పుట్టంబు
జాళువా జలతారు ముత్యముల్ మెఱయ,
సిద్ధ మిటులఁ జేసి చెన్నుండు వేగ
నడిపించె నశ్వము ద్వారము కడకు;
ఏమి యెఱింగెనో తురగోత్తమంబు
హర్షాన సకిలించె, యువరాజుఁ గాంచి.
వినియుందు రందరాహాయ హేష నపుడు

పద ఘట్టనంబుల పటపట ధ్వనిని;
కాని కానఁగరాని చెక్కల గప్పి,
నిద్రించు వారికి వినఁబడ కుండ,
సద్దు లేకుండంగఁ జేసిరి సురలు.
తురగపుఁ దలఁ జేర్చి యెడఁదకు రాజు,
మెఱయు మెడను దట్టి కర కమలమున,
దానితో నిట్లని చెవిలోనఁ జెప్పె-
"ఎన్నడే రాతు తా నేగని కడకు,
నిజమును గనుగొన నే నేగనుంటి,
ఎప్పుడు ముగియునో వెదకుట తెలిఁయు;
తెలియు వఱకు రాను తిరిగి నే నిటకు,
శౌర్య సాహసములఁ జూపింపు మిపుడు"
పొమ్మన చిచ్చయి, గాలిని మించి,
జివ్వనఁ గొనిపొమ్మ దవుదవ్వులకును;
గోడలు మేడలు నదు లగడ్తలును
వేయి యడ్డంబైన నొకలెక్క గొనక,
కార్ముక నిర్ముక్త బాణము పగిది.
"జగతిని గాపాడు పనిలోన, నీవు
తురగోత్తమంబ! భాగస్వామి వగుము!
నరుల కొఱకె గాదు నేఁ బోవనుంటి,
మాటాడ నేరక, చెప్పుకో లేక,

అసహాయులై యున్న యన్ని జీవులను
సాహాయ్య మొనరింపఁ జనువాఁడఁ గాన
నీకేని గొనిపొమ్ము వీరుని వోలె.”
ఎక్కి యదల్పంగ దూకె గుఱ్ఱంబు,
మేను ముందుకు సాచి, జూలెగయంగ,
పడె పైనయని చూపరులు వెఱగంద;
కాళులు నేలను దాకెనో లేదో
కానరా కుండంగ గడురయమునను;
గిట్టలు రాళ్ళపైఁ బటపట పడఁగ
నిప్పు రవ్వ లెగసె చిటపట మనుచు;
ఇంత శబ్దంబైన వినరొక్క రైన;
అచ్చట దేవతల్ పువ్వులఁ గోసి
ఒత్తుగా బరచిరి పోయెడి బాట;
కనరాని చేతుల శుద్ధదేవతలు
అణచిరి కళ్లెముఁ గొఱకు శబ్దంబు;
వాకిలి చేరరా, యక్షులు వేగ
వింత వస్త్రంబులఁ బఱచిరి క్రింద,
పరుగిడు సవ్వడి పైకి రాకుండ!
అద్భుతం బేమని చెప్పుదు నేను,
నూఱు మంది యయినఁ గదలుప లేని,
ద్వారపుఁ దలుపులు వాటికై యవియె

తెఱవంగ బడియెను దిన్నఁగ; మఱియు
తెఱవగా రెండు క్రోసులు వినిపించు
పెను మ్రోత, వినఁబడ దించుక యైన.
నడిమి ద్వారంబును బయటి వాకిలియు
అవ్విధంబుగనె తాదొలఁగిపోవంగ,
వింతగాలి విసర, మైకమ్ము గ్రమ్మ,
శవములై సోలంగ గవునుల భటులు,
వెడలె సిద్ధార్థుండు తురగంబు నెక్కి,
విశ్రామ వనమును దాటి యావలికి.

ప్రత్యూష పవనంబు లల్లన వీవ,
నేగుఁ జుక్క వెలుఁగ సరిహద్దు నందు,
పాఱు 'అనోమ' యన్ వాహినీ తటిని,
ఆపి యశ్వంబును, దూకి క్రిందికిని
తురంగంబు చెవుల సందును ముద్దుపెట్టి,
తియ్యఁగా సారథితో ననెనిట్లు-
"నీ వొనరించిన యీ చేత వలన,
సర్వ భూతములకు నగుఁ గాక మేలు;
నా యందు నీ కెంత ప్రీతియో తెలియు,
నీయందు నా కపార ప్రేమ నమ్ము;
కై కొని పొమ్మిక తిరిగి గుఱ్ఱంబు,

ఇదె కిరీటమ్ముఁ, గొను, బహురత్న మయము;
రాచ వస్తు లివిగో, కొఱగావు నాకు;
ఖడ్గ మియ్యది, రత్న ఖచితపు టొరయు,
ఉత్తరించిన సిగ యిల్లిదె, కొనుము.
కొనిపోయి వీనిని, నాతండ్రికొసఁగి,
ప్రణతుల జెల్లించి, నామాట లిటులు,
నా జనకుని తోడ వినిపింపు మయ్య-
తనకున్న జగతిని, త్యజియించి కొడుకు
ఉద్ధరింప జగతిఁ జనెనని యనుము;
మనుజుని గాపాడ మనుజుఁడై వలయు.
ఏకాకినై తిర్గి, వినువక వెదకి,
పోరాడి, శోధించి, పరిపరి గతులు
వెలుఁగు గలుగుదాక రాఁడని యనుము.
ప్రభులకు ప్రభుఁడయి వచ్చు నందాక,
వెలలేని ధర్మముఁ గనుఁగొను దాక,
నామాటగాఁ జెప్పు మఱచిపొమ్మంచు."



# పంచమాధ్యాయము

శ్రీ బింబసారుని రాజ్యంబు నకును,
రాజధాని యగును రాజగృహంబు.
రమ్యముగా నగరంబు చుట్టును జుట్టి,
కావలి గాయుచు నున్నవో నాగ,
అందమై నట్టివి కొండ లైదుండు;
చెట్లుచేమలఁ గిడుఁ బచ్చగా నుండు.
వైభార యనునది మొదటిది వాస;
వైఫల్లి యనునది రెండవ కొండ.
దాని, జుట్టి సరస్వతీ నది పాఱు;
మూడవ తపోవన మనువేరి కొండ,
వెచ్చనీటి కొలకు లమరు నందందు,
గ్రక్కు- నిప్పుల గొన్ని గుట్ట లచ్చటను.
శైలగిరి వెలయు దక్షిణ దిశను,
రత్నగిరి వెలయు దూరుపు కడను,
నడుమగా నఱిగిన రాళ్ళతో నిండె,

మెలికలు దిరుగుచు కలదొక బాట
కొండపై కెక్కంగ; మార్గమధ్యమున
కలవెన్నొ వృక్షముల్ వనపుష్పములును,
నల్ల మామిళ్ళును, వెదురు పొంపములు,
తెల్లగా మెరసెడు రాతి గుట్టలును,
చరియలు, లోయలు, గుహలు, శృంగములు.
పటమటి దిక్కున గుహ యొండుగలదు,
అల్లిబిల్లిగ ద్రాక్ష తీగ లల్లంగ.
చేరఁ బోకుము దాని నో! బాటసారి;
చెప్పులు, తీయుము: వాల్పుము శిరము.
పుడమిఁ బవిత్రమా స్థల మిది సుమ్ము:
ఇచ్చోట బుద్ధుఁడు మునపునై యున్న,
ఎండ వాన లనక, చలిబాధ కోర్చి,
జోగియై భిక్షాటనం బాచరించి,
నేలపై శయనించి ఏకాకి యగుచు,
కఠిన తపము, జేసె సతి ఘోరముగను;
రాత్రులు నక్కలు గుహచుట్టు గూయ,
బిట్టు గాండ్రింపంగఁ బొదలలోఁ బులులు,
భగవానుఁ డిచ్చట హఠయోగ మూని,
సుకుమార దేహంబు శుష్కింప జేసె;
యోగనిష్ఠను బూని యచలుఁడై యుండ,

తాను గూర్చుండిన బండను బోలి,
మోఁకాట సుడులిలు నెమ్మితో బ్రాక,
కాళ్ల సందున గూళ్ళఁ బెట్టుఁ బిచ్చుకలు,
చేతి దగ్గర నున్న బిచ్చపుటటికఁ
జేరి భక్షించెను మెతుకులు గుప్ప.

మధ్యాహ్న మౌన ధ్యానంబున మునిఁగి,
ఎఱుఁగఁ డొకింతేసి యెండ తీవ్రతను,
హోరిసి వీచెడు పడగాడ్పులపుడు;
పుడమి చల్లఁబడంగ బ్రొద్దు వాలుటయు,
సంజ కెంజాయల నెఱుఁగఁ డొక్కింత,
చుక్కలు బొడచుటఁ జూడఁడు, చుట్టు
నక్కల కూఁతలఁ, బిట్టల రొదల,
చెవి నొరసీయఁడు నిశ్చలుఁ డగుచు,
ఆత్మావలోకి నాయత్తత నుండు,
బాహ్య లోకము తోడి బంధమే లేక.
అజ్ఞాన మను గాఢ గహనము నందు,
ఈర్ష్య యుఁ గోపంబు ద్వేష మాదిగను
గల, దుర్గుణంబులు దిరుగాడు భంగి,
ఆహారమునకునై యడవుల యందు
దిరుగు, కర్పూరమృగపు టరపులు దక్క,

ఖిగత జగితి యంత మాటు మణఁగి,
సగము రాతిరి దాక తప మాచరించి,
ఒకజాము నిదురించు; మలిజాము లేచి,
పద్మాస నస్థుఁడై ధ్యాన సుస్థిరత,
అవలోకనము సేయు నిద్రాణ జగతి,
జీవ రాసులఁ గూర్చి తలపోయు చుండు.

ఇంతలో నగుపించు తూరుపు తట్టు,
తెల్లవాఱు తీరు తళుకు బెళుకులు;
కాల పురుషు లేప కడసారి గాను,
సుందరి యను నుషఃకాంత యందించు
ముద్దు సవ్వడి నాగ గలగల యొంపు,
కదలాడు పొలములఁ బర్వుచునుండ,
పొద్దు మేల్కొల్పుల చిత్రంబు లవుడు,
ఒక్క టొక్కటి గాఁగఁ బొడగట్టు చుండు;
ముదురు కెంజాయ తాఁ దోచును మొదట
కొక్కొరో కో యని కోడి కూయంగ;
పెద్ద యల లొప్పెతెఁ బై పైకిఁ బ్రాకు
తెల్లని కాంతులు; తెరలు తెరలుగ
జిమ్మన గ్రోవితో జిమ్మిన యట్లు,
వన్నె తఱుగు వేగుఁజుక్కఁ గప్పుచును;

అగుపించు నంతట శ్వేత కెంజాయయు,
అచ్చటఁ మెలఁగెడు నంబుదాంచలములఁ
బసిఁడి మిసిమి తోడ మెఱపింప జేయు;
నిండు బంగరు రంగు వెడలు నామీఁద,
నీలఁపు రుచులలో వెలుఁగు వలువల
దాలిచి, ప్రభవించు దినమణి యంత
నిదురించు జీవుల మఱల మేల్కొల్ప.
తొలిసంజ తీరులు వర్ణింపఁ దరమె!
ప్రకృతి చిత్రములలో ప్రథమమౌ గాదె,
ఆవర్ణ వైచిత్రి, శాంతియు, హాయి
ఆ విలాసము, దోఁచు నతి దివ్యముగను,
పురుషోత్తముని మూర్తిఁ గొలుచు గొంత.

మన ప్రభు వంతట మెల్లన లేచి,
ఋషివలె సవితృని స్తోత్రంబు సేసి,
పొద్దుటి పనులెల్లఁ బూర్తి గావించి,
మలుపుల త్రోవను మెల్లఁగా దిగుచు,
పుర వీధులం జేరు బిచ్చ మెత్తంగ.
ఆ శాంతమూర్తిని యా చంద్రవదను,
ఆజానుబాహుని యరవింద నయను,
వీక్షించి పౌరులు మేము మేమంచు,

పోటీలు పడుదురు భిక్ష నీయఁగ;
ఇల్లాండ్రు గొందఱు బిడ్డలఁ బట్టి,
పాదాల కెఱగింత్రు భద్రమహా నంచు;
కలభ చారు గమను, గరుణా సముద్రు,
గాంచి, కన్నియ యొకర్తు కను లప్పగించి,
కలలోనఁ గాంచిన వాఁడేమొ యనుచు,
వీక్షింపఁ, దలవంచి తన పనిముగించు,
వచ్చిన త్రోవను మఱల దా బోవు,
కొండ మీదికి, చేరఁ బెద్దల నచట,
తెరువుల నరయంగ ముక్తినొందుటకుఁ,
కలదాని గనుఁగొన, లోచూపు నిలుప.

రత్నగిరి దరుల తోపుల యందు,
వింత వితండ వాదులు వసియింత్రు;
శత్రు వాత్మకు శరీరంబని యెంచి,
కాయము పశుసమ మంచు భావించి,
అలయించి సొలయించి శుష్కింపఁ జేసి,
నామమాత్రావశిష్టము సేయు చుంద్రు,
పాషాణ కర్కశ హృదయులై ; చూడ
వికృత రూపములతోఁ జాలిఁ గొల్పుచును.
వారిలో గొందఱు నిష్ఠతో నిలుప,

చేతులు పైకెత్తి వ్రేలు కాలంబు,
నెత్తురు పాఱుట నిలిచి పోవంగ,
బాకీన సంధుల బుడుగొని యగుపడ,
సాగ హీనమైన భుజముల నంటి
ఎండు కట్టెల వలె నగుపడు చుండు;
పిపీలిలి యట్టులే వదలక పట్టు,
నాడిలో గొంగళులు, పుండులు వఱ్ఱ
అఱచేయి దూరెను బెరిగిన గోళ్ళు.
శిరమున నెరిసిల్ల మోయుచుట్టు నట్టి,
మెయినిండ బూసిన పూతలు బూసి,
తొడిగిరి కొందఱు ముండ్ల చెప్పులను;
కొందఱు కూచిరాళ్ళను జేతం బూని,
ఎవరయుం దొడయును నుదురు బుగ్గలను,
అక్కఱ చీల్చు కొనిరి గాయము లలుగ;
కుమిలెడి గుదియతో గాలిచి కొనిరి;
గ్రుచ్చుకొనిరి సెండి, యొడలు నిండుగను,
ముళ్ళను సూదుల మఱిదబ్బనముల;
అవశేషములు దిని గాకియు గ్రద్ద,
కాకులు నక్కలు దిరుగాడు చుండు
కాటిలో, గొందఱు కాపురముండ్రి;
ఒంటి కాలి పయిని నిలిచి యొక్కరుడు,

కమలిన మెడచుట్టుఁ జుట్టి పాములను,
కదలక శివనామ జపమును జరిపె,
బిక్క మొగంబుతో బిగ్గఱగాను.
ఎండి, వాడి, కఱుడుగట్టిన యట్టి,
ముడుతల యొడలును, గుంట కన్నులును,
మొద్దుబారిన మొగమ్ములు నివ్వటిల్ల,
కడు దీనముగ నుండె నా జోగి గుంపు.
ఐదు నాళ్ళు గడున, చచ్చిన పిదప
చెడిన శవములట్లు బీభత్సముగను.
ఒడిలోన నిడుకొని వేయి గింజలను,
దుమ్ములో దొరలుచు, నొక టొకటిగను
దీయుచుఁ దినుచుండె దినలేక యొకఁడు,
సడలెడు నోరిని చిక్కఁ బట్టుచును;
నాలుక రుచిమూన్పఁ బచ్చి యాకులను
తినుచుండె నొక్కఁడు తీరికగాను;
ఒక యోగి కనుపించె నతి వికృతముగ-
పురుష చిహ్నము లేక నాలుక లేక,
వినుటకు జెవిలేక కనఁ గన్నులేక,
మాటాడ నేరక మూచూడలేక,
యింద్రియంబులు లేక వికలాంగుఁడగుచు
కొని తెచ్చుకొనె తాను కోరి యన్నిటిని,

దేహాత్మ బంధంబుఁ దెగ నఱుకంగ;
బాధఁ బొందెడు పరమావధి కాగ.
సరికిమ్మ మఱపించు వారి యాతనలు.
నాహసించి రిటుల శాస్త్రాల నవిస్త్ర
హఠ యోగమును బూనఁ గలుగునా ముక్తి?

కారుణ్య మొలుకఁగ వారలఁ గాంచి,
ఒకనాఁడు వారితో ప్రభు విట్లు పల్కె;
"ఈ కొండపై నేను సత్యార్థి నగుచు
నెలలెన్నొ గడపితిఁ జూచితి మిమ్ము,
దేహంబు నిట్టుల సర్దయు లగుచు
కష్టపెట్టెద రేలనో యయ్యలార!
బ్రతుకొక దుఃఖమై ప్రబలును బుడమి
క్రొత్త వెతల నేల గుడిరిపింప దాని?"
అన నొక ఋషి యిట్టు లుత్తరమిచ్చె:
"శాస్త్రము జెప్పును: మనుజుఁడు కడఁగ,
కాయంబు తాను గాదనుచు భావించి,
బాధయే బ్రతుకుగా వెతల గుడ్పించి,
మరణ దేవతకు మృష్టాన్నంబు సేయ,
బాధాగ్ని లోఁబడి పరిశుద్ధమగుచు,
ఆత్మ మెగిరి యూర్ధ్వ లోకాలఁ జేరు,

దివ్య సుఖంబుల ననుభవింపంగ,
ఊహకు రాని యానందంబు నొంది."
పసిడి రుచుల మించు మెఱుపులఁ జూపించి
అని వానితో ప్రభుఁడుల్లస నిట్లు:
"అలలతో నల్లాడు కడలిలోఁ బుట్టి,
వినుము, యోగివరుఁడ! యా నల్లమబ్బు,
వాన, చినుకుల రూపమునఁ దాను మఱల,
కన్నీటి బొట్లట్లు పుడమిని బడియు,
కొండ గుట్టలఁ జుట్టి వాఁగు వంకలను
కలసి పాఱుచుఁ జేరి గంగను కడకు,
మున్నీటఁ గలియదే పుట్టిన చోట!
ఈగతిఁ జెందవే నాక సుఖములు.
పెరుఁగుట యెల్లను విఱుగుట కొఱకె,
ఉన్నది వ్యయమయి పోవును గాదె!
నాకముకై యిట్టి నరకానుభవము?
మొద లెత్తుకొందుకే యవి ముగియుంగ?"
"మొదలిడ వచ్చును తెలియదు నాకు
ఆతత్త్వ మంతయు," నని మార్గయోగి.
"రాత్రిపోఁ బగలు దా వచ్చును గాదె,
కష్టింప ఫలితము దక్కును గాదె,
ఆత్మ కడ్డంబగు దేహంబు గాన

బలి యిచ్చెదము వాని బదులుగా బొంద
దివ్యసౌఖ్యంబుల సేంద్ర పదవుల."
అను వానిఁ బ్రశ్నించె నీగతి బ్రభుఁడు:
"ఇష్టభోగంబుల నాక లోకమున
ననుభవింపఁగ వచ్చు సురలహారిహాము;
పుణ్యము తఱుఁగఁగ మగుడఁగ వలెను;
కాకున్న జెప్పుఁడు కలదేమి గాని
మీరున్న నెఱుఁగని యమృతంపు బ్రతుకు?
కలకాల మందురే నాకాన సురలు
ఎఱిఁగినఁ జెప్పరే ఓ యయ్యలారా!"
"బ్రహ్మ శాశ్వతమయ్యు, కారు దేవతలు"
అని చెప్ప నాయోగి, యంత బ్రభుండు
ప్రాజ్ఞులు ధీరులు పండితులయ్యు
పోలునే మీకిటు పందము ల్వేయ
నిర్దయులై యొకఁ లాహూతిఁ జేసి,
నశ్వరముల దివ్య గతులను గోర;
ఆత్మాభిమానంబు మితిమీఱి నిట్లు,
పవగింపఁ దగునె మన తనువులను,
వెఱ్ఱి మొఱ్ఱుల వలె వెతల నొందించి
కాయంబుఁ జంపగాఁ గాలము మునుపె
నిజ గేహమును జేర నాత్మ మోయుంగ,

వాహనమే లేక యుండును గాదె,
పరుఁగిడు గుఱ్ఱంబు మఱిమఱిఁ దోల
పడుఁగాక దారిలో బైకేగు నట్లు?
రాత్రి రాకమునుపె యిలు చేరగలఁడ.
దేహగేహము నిచ్చె దేవుఁడు మనకు
చేతులారఁగ దానిఁ బీకి వైచెదమె.
మొదటిది కాయము ధర్మ సాధనకు;
పొందవచ్చు సుఖము ప్రాణము లున్న,
జ్ఞాన మార్జించి ముక్తిని బొందవచ్చు,
పని ముట్టులేకున్నఁ బనిసేయు టెట్లు?
బిఱ్ఱుగా బిగియింపఁ దెగుఁగాదె తీగ;
వీణఁ బోలు నొడలు మితిమీఱి రాదు
అతిని వర్జింపఁగా వలయు నన్నిటను”
“నమ్మితి మీరీతి నో రాజపుత్త్రి,
నడుతు మీ బాటలో జచ్చిన నేని,
దీనికి మించిన మంచి మార్గంబు,
తెలిసి యుండిన నీకు జెప్పుము మాకు
లేకున్న నీపని జూచుకో వయ్య”

అను వారి మాటలు విని చింతఁజెంది,
తలపోసి కొనుచిట్లు తనలోనె దాన

మన ప్రభుఁడంతట ముందుకు సాగె.
వెలినక చావుకు బ్రతుకఁ గోరుదురు
ప్రాణము లోప్పనాశి పొందఁ గోరుదురు
మీఁది సుఖంబుల మూఢమానవులు;
దైవము మెప్పింప నియమము లూని,
ఉపవాస వ్రతముల శుష్కింప జేసి,
దేహము నలయింత్రు హఠవాద మూని
నరకబాధ నిష్ఠై యనుభవించెదరు;
తనువు నొవ్వఁగ నాత్మ త్వరపడు నంచు
వింత నమ్మకముతో మూఢమానవులు;
నవ్వుచుఁ బాలములో బువ్వ లయ్యవిగో,
రంగు రెక్కల విప్పి కనుల పండువుగ,
నమ్మ తెమ్మెరలకుఁ దావుల నింపి,
రుచి మురిపించుచు కొందము తుమ్మెదల;
దరహాస మొలకఁగ, నుయ్యాల లూగు.
లాస్యంబు సేయు నో సుందరులారా!
పూర్ణమా సంతృప్తి పొదలునే మీకు?
మనుగడపై రోత దోపదా మీకు?
నాతోడఁ జెప్పలేరో తోటిచెట్ట!
మొక్కగా బుట్టియు మ్రానుగా బెరిగి,
శాఖలఁ గాయుచు నింగి దాఁకుచును,

గలగల ధ్వనులతో గాలి నింపెదవు,
ఎప్రొద్దు సంబర మబ్బునే నీకు?
కొమ్మ కొమ్మ కెగురు నో రామచిలుక!,
కమ్మగా బాడెదు నో కోయిలమ్మ!
జుమ్మను తుమ్మెదా! తెలుపరే మీరు
రోతయే దోపదా బ్రతుకుపై మీకు?
దనువుఁ బోషింతురు సతతము మేత,
నుపవాసముల తోడ నక్కఱఁగ లేక?
పొంగంగ నోరరా పెద్ద సదవ్రులు?
మిము జంపి భక్షించి బలుల నొసంగి,
మేటిగా భావించుఁ దన్ను మానవుడు;
హింసతో బుణ్యంబు నార్జింపఁ గలఁచి,
తన్నుఁ దా హింసింప మొదలిడు నిటుల"
అని తలపోయుచు నడువఁగా బ్రభుఁడు.

దుమ్ము రేగెను గాలి నెఱ్ఱగా నిండి,
గిట్టల సవ్వడి వినబడె, నంత
గొఱ్ఱె మేకల గుంపు కనుపించె నెదుట.
కొంచము వంగిన మూపుల యందు
కఱ్ఱల వ్రేలాడు చద్ది మూటలను,
మొగఁ ద్రోసి కొంచును "యిస్సిస్సు" మనుచు,

వంగిన కొమ్మల నాకుల దినఁగ
మునిగాళ్ళపై జేరు మేక పోతులును,
దప్పిఁ దీర్చుకొనఁగఁ బ్రక్కన నున్న
కొలకులఁ జేరెడి గొఱ్ఱె కూనలును,
పచ్చిక మేయఁగ నటునిటు నేగు,
జీవాల నదలించి తోలిరి గ్రేలు.
కవలఁ గనిన మేక కల దొక్క టందు;
కాలు దెబ్బ తినఁగఁ గార నెత్తురులు
కుంటుచుఁ గదలు గొఱ్ఱె యొక్కండు,
అటునిటుఁ దిరుగాడు కూనల కొఱకు
వెదుకఁగాఁ జాలక వేదనఁ బడుచు,
విధిలేక బాధతో నడచుచు నుండె;
ప్రభుఁడు దానిని గాంచి కడుజాలి నొంది,
మూఁపున నిడుకొని మెల్లఁగా నెత్తి,
"ఉన్ని నిచ్చెడి తల్లి! పొగలఁగ నేల
మోసికోఁ బోయెద మానుము గోడు;
ఆ కొండ పైనుండు జోగులఁ గూడి,
జగతి దుఃఖంబును జూచుట కంటె,
ఒక జీవి బాధను మాన్పుట మేలు"
అని ప్రభుఁడనుకొనె నంతరంగమున:
"ఈ యెండలో నేల నో గొల్లలార!

గుంపును గఱలించి తోలుచున్నారు
సంజవేళలఁ గాదె యెల్లవారలును,
మందల మఱలింత్రు దొడ్డి జేరంగ"
అని ప్రభుఁ డడుగఁగా గొల్లఁడి ట్లనియె.
"యేమేమి సేతుము మా దొడ్డ ఱేఁడు,
యజ్ఞ వాటిక లోన దేవతా ప్రీతి,
బలు లొసంగుటకుగా గొని తెమ్మనంగ,
తరలించు చున్నాము రాజాజ్ఞ గాదె!"
"వచ్చెద నేనును మీతోడ" నంచు,
మూలుగు గొఱ్ఱెను మూపునఁ గొంచు,
మిడిమిడి మిడిసెడు మండెడు నెండ-
మెల్లఁగా నడచెను మాటాడ కుండ,
మన ప్రభుఁ డెడఁదలో తలఁపులు నిండ.

వారటుఁ బోవుచుఁ జేరఁగా నదిని,
వారిఁ జేరఁగ వచ్చె తరుణి యొకర్తు;
శోక విషాదము ల్మూర్తి భవింప,
కన్నీటి కరలతో మాయఁగా మొగము;
చేతులు జాపుచు బిట్టేడ్చుచుండి,
ప్రభువుఁ జేరఁగ వచ్చి పలవించెనిట్లు:
"నిన్నుఁ గాదే స్వామి నీతోడ నేను,

నా విషాదపుఁ గాథ విన్నవించితిని.
ఈ యాత్ర తోఁటలో నేకాకి నగుచు,
నేఁ గాపురము సేతు నా పట్టితోఁక;
ముందు రోజున పాప యాడుకోఁ బోయి
పాముగుపడ దాని పడగను బట్టి
వేడుక మీఱంగ నాడుకొనంగ,
బిరబిర నేఁ బోయి పట్టి తెచ్చితిని.
ఒడలు చల్లఁబడెనోఁ బాలీయ బోవ
పెదవులతో జన్ను పట్టలేఁడాయె,
ఏపాప మెఱుఁగని నా చిన్న పాప
నేమి చేసెనో గాని యా చిన్న పాము.
మందు వేయు మనుచు విష మెక్క ననుచు
అగుపడు కొండ దాపున నున్నయట్టి
మహాసీయు నొద్దకుఁ గొని పొమ్మటంచు,
పరిపరి విధములఁ బల్కఁగా జనులు
వడిఁ దోడుకొని రాగ నీయున్న యెడను,
కసరి కొట్టక కడు జాలితో జూచి,
అనునయ వచనాలతో బుజ్జగించి,
ముసుగును దొలగించి మొగమును జూచి,
కృపతోడ నిట్టులఁ బల్కితి వీవు:
‘ఓయమ్మ యూరిలో నిండ్లకు బోయి

తులము నువ్వుల సద్దె పెడఁ గొనితెమ్ము;
ఇత్తు రెవ్వరు వారి గృహమందు, వినుము,
ఒక్కరైనను జచ్చి యుండఁగా రాదు;
పాటింపఁగా వలె నీ నియమమ్ము'
అని చెప్పి పంపఁగా బరుగునఁ బోయి,
గౌతమ్మి శవముఁ గొని వదలని పట్టి,
విసుఁగును జెందక వినయము తోడ.
కాళ్ళఱుగ, గడప గడపను మెట్టి,
ఇమ్మని వేడితె నువ్వులఁ దులము.
ఈయ సిద్ధపడిరి దాసిని కాని,
-మగఁడీల్గె, మొన్నంచు నుగుప యొకర్తు,
తనయుఁ డీల్గె ననుచు తల్లి యొకర్తె
తండ్రి గతించెను, దల్లి గతించె,
అనుచు, నింటింటను వగచిరి వరుస.
కాని మృత్యువు లేని గృహ మొక్కటైన,
ఊరునాఁడు వెదుక ముచ్చునకైన,
కనుపింప దాయెను; గడకు వేసారి,
అత్తి తోపున ముద్దుపట్టిని బెట్టి,
నీ చరణంబులె శరణని నమ్మి
పరుగున వచ్చితి పావన మూర్తి!
ఎచ్చోట తిలలను గానంగ వచ్చు,

స్వామి నాపాపము గృపఁ గావుమయ్యా."
అనుచు వాపోయెడి నసహాయుఁ గాంచి
కృప జాలువాఱంగఁ బ్రభుఁడిట్లు పలికె:
"చల్లని నూఁ జల్లి యుండియు వెదకె
విఫలులై రేమందుఁ గానంగ లేక;
బ్రతికిన నీబిడ్డ యరమర లేక,
ధారవోయనె నాదు మేని రక్తంబు;
శరణంబుఁ గానక దుఃఖాన నగిలి,
నాఫు వాతను బడు జీవులన్నియును.
లాభంబుఁ గోరుచు స్వార్థంబు గొఱకు
యజ్ఞయాగాదుల బలుల నొసంగ,
నిస్సహాయు లైన యీజీవ రాశిఁ
జంపఁగాఁ దోలేదు మూఢ మానవుఁడు;
బాధను మాన్ప బాటను వెదుక
పాటు పడుచు నుంటి, మఱి దారి లేదు,
కనగోత మిక పామ్ము నీముద్దుపట్టి,
భూమాత యొడిలోనఁ బండఁ బెట్టఁగదె.

సాగిపోయెఁ బ్రభుఁడు గుంపును గూడి;
అస్తాద్రిఁ జేరంగ లోక బాంధవుఁడు,
నీడలు నిడువులై నేలపైఁ బర్వె.

గొల్లలతోఁ బురిఁ జొచ్చెఁ ప్రభుండు,
మూల్గెడు గొఱ్ఱెను మోసెడి ప్రభుని
వీక్షించి యాశ్చర్య చకితులై వేగ,
రక్షక భటులెల్లఁ దొలగిరి త్రోవ;
దారికడ్డంబైన బరువైన బండ్లు,
అచ్చటి జనములు ప్రక్క కీడిచిరి,
బేరపు రచ్చల మాని యంగళ్ళ,
కండ్లప్పగించిరి ప్రభునిఁ గన్గొనఁగ,
కొనువారు విక్రయించెడి వారలెల్ల;
సమ్మెట నెత్తిన కమ్మరి కేలు,
నేత నేసెడి సాలివాని కరంబు,
లెక్క పెట్టుచునున్న వాని మనంబు,
వ్రాయుచు నుండిన వాని కలంబు,
కదలక మెదలక యున్న వున్నట్లె,
నిలచి పోయెను వాని వృత్తులమాని,
ప్రభుఁజూచు తమకాన, పరవశోత్సాస;
అదలించు వారలు లేనందు వలన
అంగడి ధాన్యంబుఁ దినియె నాఁబోతు;
పిదికెడి పా లొల్కిర్లి నేల పాలాయె.
ఇతరంబులౌ పను లెల్లను మాని
వీధి జనంబుల చూపు తుమ్మెదలు

ప్రభు వదనాబ్జంబు పైఁ బ్రాఁకె మూఁగి;
మకరంద మాధుర్య మహిమ యెట్టిదియొ,
వీధి వాకిళ్ళలో మూఁగి గుంపులుగ,
పురకాంత లెల్లను బరికించి ప్రభుని
"ఏయమ్మ కనియెనో కడుపు చల్లఁగను
చలువ వెన్నెలఁ గాయు నీతని మోము;
ఏయమ్మ పడసెనో పతిఁగాఁగ నితని
కరుణను శాంతిని గురిపించుఁ గనులు;
ఎచ్చటి వాఁ డొనో యేమి కులంబో?,
కంతు జయంత వసంతుల నెల్ల,
తన చక్కదనమున గెలువఁ జాలెడివి.
ఈ మహానీయుని బోలెడి వారు
భువిని దివిని లేరు గాలించ నెందు;
ఇతని కీతఁడె సాటియై వెలుగొందు."
అను చనిమేషులై చూచిరి ప్రభుని.

రక్షణ లేనట్టి గొఱ్ఱెలఁ బోలి,
నడికిరేఁ జిమ్మచీకటి యందు దారి
గానక, నిడుమల గుడుచుచుఁ బడుచుం,
గ్రుడ్డిగా నేగెడు జీవు లన్నియును,
కటిక మానిసి చేతి క్రూరపుఁగత్తి

అను, మిత్రి దాపురకు గతిలేక నగలి,
ఈ గొఱ్ఱె గుంపును జాలి చెంతయును.
వీరి బాధను మాన్ప వెఱ వేది యగునో,
అన్న, తలంపులు బెనఁగొన మనము,
మెల్లఁగా నడచుచు నుండెనే కాని,
చుట్టును జేరిన వారిని గాని
కలకల మైనను వినఁడు గన్గొనఁడు.

యజ్ఞ వాటిక యాగ దీక్షలో నున్న,
బింబిసారుని కెఱిఁగించి రీ వార్త;
యాగార్థమై తోలుకొని వచ్చు గొఱ్ఱె
గుంపుతో, వచ్చెడి మహనీయుఁ డాను.
శుద్ధ వస్త్రంబులఁ దాల్చి బ్రాహ్మణులు
ఇర్వంకలను జేరి మంత్రాలు చదువ,
రాజు సుగంధముల్ వెన్నయు నేయి,
స్రుక్స్రువనంబుల వేల్చె నాహితాగ్నులకు;
చిటపట మంటల కస్సు బుస్సనుచు,
సర్వ భక్షకుఁడగు హవ్యవాహనుఁడు
నాలుక ల్చాచెను నాల్గు వంకలకు.
ఒకవంక పఱచిన యిసుకలో నింకి,
బలి పశువుల మేని నెత్తురు టేఱు

పొరలుగ నెత్తురు ప్రవహించుచుండె,
మంటలలో మాడి నల్లఁగా మాఱి.
నేలొఱఁగ వానను గనుపించె; నచట
పక్కని కొమ్ముల చుక్కల మేక
దాచిన మెడ వధ్యశిలపయి నమర
ముంజి దర్భలఁ గట్టిగాఁ గట్టఁబడియెఁ.
బాపఁడు మొనదీరఁ గత్తిని బట్టి,
మంత్రంబు పఠియింప వినఁబడియెన్:
“ఏలు దేవతలార యాగాల కింపుండను,
తఱచారి బలియిడె కైకొండు వీరు;
తాఁకెడు మాంసంబు వాననఁ గ్రాంగి
రుచిగల పలలంబు లందుకొనుండు;
దీని కంఠంబున రాజు పాపాలు
పెట్టి ఖండించెదఁ బరిహరింపుఁడవి;
మారాజు పాపాలు దీనితో గూడ
మంటలో బడి మండి మసియగు గాక”
అని తెగవేయఁగఁ గత్తి నెత్తంగ;

“వలదు, వలదు, రాజ! వధియింప వలదు.”
అని పలుకుచును వచ్చి పడిపడి గాను
మెడముడి మేకకు విడిపించె వేగ

ప్రభుండు సాహసమున, నచ్చటి వారు
అడ్డగింప రోకదు మహిమ యెట్టిదియొ!
రాజాజ్ఞఁ బొంది తా మృదు భాషణముల,
వ్యాఖ్యానుపద్యంబుగా బల్కె నీతులు:
ప్రాణముల్ గూర్చిచి కర్మ గుణించి;
క్షుద్ర జంతువులైన పెద్దవి యైన
దానిఁ బోషింపంగఁ, గాపాడు కొఱకు
ఎన్ని శ్రమలకైన వెనుదీయ రయ్య!
పడరాని పాటుల పడుచుందు రెపుడు;
కాకి పిల్లయు ముద్దుకాదె కాకికిని.
కరుణ నిండారఁగ, వరము జీవనము
బలహీనులకుఁ గృప భద్రకారణము,
బలవంతులకు నది దివ్యభూషణము.
గొఱ్ఱెల గాపాడఁ గృపఁ జాలువాఱ;
వాదించి బోధించె వారలకిటుల:
"నరుఁ డల్ప జీవుల కగు దైవసముఁడు;
దేవునిఁ బ్రార్థించు దయఁ జూపు మనుచు
దయమాలి తాను వానిని ద్రుంపఁ జూచు;
మనకు పాలర్పించి యున్ని నొసంగి,
బిడ్డల పోలిక నమ్మి మెలంగు,
సాధు జీవుల బట్టి జాలిని మాలి,

పలు ప్రాణిసంఘటకునై భక్షింపఁ గాను
పరిమార్పఁ జూచుట పాడియే యయ్యా?
ఎఱుఁగరే శాస్త్రార్థముల నెల్ల విప్రారు!
క్షుద్ర యోనుల బుట్టి పాపులు చచ్చి
పశు పక్షు లగుచును బాధలఁ బొంది
పరిశుద్ధు లగుచును పలుజన్మలందు,
నరులుగా బుట్టుదు రెట్టకేలకును.
హింసతో గూడిన యజ్ఞ యాగములు
పాపపంకిలములు పతన మ్మొనర్చు,
ఊర్ధ్వ గతుల నీయ జాల వొక్కింత;
పరుల రక్తముతోడఁ గడుగఁగా నాత్మ
పరిశుద్ధ మగునెట్లు? యోచింపుఁ డయ్యా!.
దేవత లనువారు సజ్జను లేని
పరితృప్తు లగుదురే పరహింస వలన?
వారు దుర్జనులయి నెగడుదు రేని,
బలుల లంచము లీయ రక్షింతురయ్యా?
మనసుచే వాక్కుచే చేష్టల చేత
ఏమి యొనర్తుమో మంచియో చెడుగో
మంచికి, మంచియుఁ జెడ్డకుఁ జెడ్డ
తులఁ దూచినట్లుగఁ బొరబాటు లేక
అడ్డగింపఁగ రాక తప్పని సరిగ

శక్తితోఁ జెందు తత్ఫలితము మనల,
లవలేశ మేనియుఁ దప్పునో దయ్య
ఎవరు చేసినపని ఫలితము వారె
గాక యన్యు లెందుకై యనుభవించెదరు?
మూగ జీవులఁ జంపు ద్రోహంబు పేర,
మనపాప మేవిధి పరిహారం బగునొ,
త్యాగసత్కృత్యంబులు సలుపుము గాక;
వేఁగాదు మనకర్మ విధానకి మనల
వెంట్రుకొ వాసియు దప్పునో దయ్య!"
ఈరీతి బోధింపఁ బుద్ధప్రభుండు
కరుణ యుట్టిపడఁగ గంభీరముగను,
మనసున నాటంగ మృదుభాషణములు
ధర్మ సూత్రంబుల, తీరు తెన్నులును,
గుడ్డతో బాకులు గప్పిరి వేగ
రక్తసిక్తము లైన తమ హస్తములను.
బద్ధాంజలుండయి బింబిసారుండు
ప్రభు మ్రోల నిలఁబడె భక్తి ప్రపత్తి,
ముగియించె భాషణఁ దుదకిట్లు ప్రభుఁడు:
"వర్జించి హింసను నెయ్యాన మెలఁగి,
బంగారు ధాన్యంబు రంగారు పండ్లు,
తియ్యని దుంపల గడ్డలఁ దినుచు,

స్వేచ్ఛ జలంబులఁ గడుపారఁ ద్రావి,
అన్యోన్య సహకార మొసరి వర్ధిల్లు
పృథివీజీవన మది భద్రంబు కాదె,
శాంతియు సౌఖ్యంబు సమకూరదుఁ గాదె,
పరమ సత్యము లివి పాటింపు రయ్య"
అని చెప్పఁగా విని యచ్చటి వారు
మారి పోయిరి మాట మాహాత్మ్య మేమొ!
క్రౌర్యము జయించెను కారుణ్య గుణము.
మంటలఁ జల్లార్చి పూజారు లంత
పార వైచిరి యజ్ఞ పరికరంబులను.
ఆ నాడు మొదలుగా నారాజ్య మందు
శాసనం బెట్టుల శాసింపఁ బడియె:
"ఏ రూపమున నున్న జీవ మొక్కటియె,
కాపాడఁ బడుదురు కృపఁ గలవారె;
వలదు జీవుల హింస యే రూపమునను.
యజ్ఞ యాగంబుల భక్షణంబులను.
రాజాజ్ఞ సుమ్మిది మీఱంగ రాదు"
ఆ నాటి నుండియు నా రాజ్య మందు
బుద్ధప్రభుని బోధసుధ కారణమున
శాంతి వర్ధిల్లెను సౌజన్య మొసఁగె;
పశువులు పక్షులు ప్రజలెల్లఁ గలసి

సౌహార్ద్రమున మని సుఖపడి రచట.
నవనీత సమమేమొ ప్రభుని మనంబు
తోడి జీవుల దుఃఖమును జూడ లేదు;
వాని బాధలు మాన్ప త్యాగంబు సేయు
దేహాంత మైనను వెనుదీయఁ డహహా!
వేలేండ్ల క్రిందట వెనుక బుట్టువున
బుద్ధుఁడు, బ్రాహ్మణుఁడుగ జన్మ మంది,
'ధలిధ' గ్రామముచెంత ముండ నామమ్ము
గల శిలపై నివసించుచు నుండె,
కాటక మచట రా నొక వత్సరంబు
భూమి బీటలు వాఱె, సూర్యాతపమున
కొలకుల నీరింకె, సడవుల యందు
ఆకు వేయక మున్నె నారెండిపోయె,
దుంపలు గడ్డలు పసఁదప్పి చెడియె;
అహారమునకునై యడవి జంతువులు
దిక్కు కొక్కటి గాఁగఁ జెదరుచుఁ జనియె.
ఆ ప్రాంతభూములఁ దిరుగాడు ప్రభుఁడు
ఆకట నకనక లాడెడు వ్యాఘ్రి
నొక్కదానిని గాంచెఁ బొదమాటునందు;
ముడుతలు వడినట్టి మోమువాకిటను,
అదరెడు దవడల కోపల యొండి

పీకుచు గట్టిగ నొల్కి- యుగ్గులూగాక్క
పచ్చిబాఱిన కంటిచూపులు దెల్పె
ఆపులి లోపలి తీవ్రబాధ గాఢ.
ప్రారిపాకలఁ గప్పు వానకు క్రుస్సి,
దంతుల సందున వంగెడి మాంసీ-,
చారల చర్మము వన్నె మెఱంపు,
అస్థి పంజరమున దిగఁబడి యుండెఁ;
నడుము వాఱిన పేద పొదుగున దూఱి
దావాగ్ని దరిఁగొనఁ బులిపిల్ల జంట
బొట్టు పాలైనను లేని చన్నులను
బట్టి పీకుచునుండెఁ బెనుబాధపుట్ట;
దాని సైరించుచు నాపులి పెంటి
కూనల నాకెను కోమలంబుగను;
తల్లిప్రేమఁ దెలియఁ దరమౌనె మనసు!
ఓర్చుకో జాలక బాధ నాపైన
ముక్కుచు మూల్గుచు మెడ నేలఁబెట్టి,
బాధ పట్టఁగరాక బయటకు పొంగ,
గాండ్రించె నార్తిని దిశ లద్రువంగ,
చూచువారల గుండె ఝల్లుమనంగ,
దాని యవస్థను గనుగొని ప్రభుండు
జాలిజాల్వాఱగ గుండె మున్నీట,

తలపోసె నీరీతి నంతరంగమున;
"దావాగ్ని దహియింప దుస్సహంబగును
ఆకట మలమల మాడెను వీని
దురవస్థఁ గాంచిన చైతన్య మున్న
ఏ హృదయము జాలిఁ జెందక యుండు?
ప్రొద్దు కూకక మున్నె యీపులి తల్లి
అసువుల వీడు నాహారంబు లేక.
వనహంత్రి బ్రతికింప నొక్కటె తెరవు:
నా దేహ మాంసంబు దీని కర్పింతు;
ఖోడి ప్రాణిని బోవఁ బ్రాణార్పణంబు
ప్రేమతో నొనరింపఁ బుణ్యమౌ గాదె;
అనుకంప జనియింప నిటు తలపోసి,
ఆ కృపాజలనిధి నిశ్శబ్దముగను,
వదలి పాదుకలను, విడచి దండంబు,
కట్టుగుడ్డల నూడ్చి తలపాగఁ దీసి,
జందెంబు విడనాడి పాదమూలంబు నీడ్చి,
ఆహార మిదె కొను మోతల్లి! యనుచు,
పులి కెదుటను బడెఁ బ్రభువరుఁడంత;
చావ నుండిన వ్యాఘ్రి చంగున నెగిరి,
పెడ బొబ్బ లిడుచును గడు భయదముగ,
సిద్ధముగా నున్న బ్రాహ్మణుఁ బట్టి,

పడవైచి నేలపై బాకులఁ బోలు,
వంగిన వాడి గోళుల తోడ ఒక్కి,
క్రూర దంష్ట్రల తోడఁ జీల్చి చెండాడి,
పలలంబు భక్షించి రుధిరమ్ముఁ ద్రావి,
విం దారగించెను దృప్తిఁ ద్రేపుచును.

కరుణఁ దెలియఁ బలికి కారుణ్య మూర్తి
యజ్ఞ యాగంబుల హింస మాన్పించె.
ఇంతకుఁ బూర్వమే యాతని ప్రేమ
ఎంత విశాలమో యెన్న శక్యంబె!
రాజ వంశము వాడు ప్రభుఁడని యెఱిఁగి,
స్వామి సన్నిధిఁ జేరి బింబిసారుండు
నయమొప్పగా నిట్లు ప్రార్థించెఁ బ్రభుని;
"పుత్ర హీనుండ నే నో రాజపుత్ర!
నారాజ్య మేలుము నాతోడ నుండి;
ఏలఁగా యోగ్యత కలుగ నీకేల
బిచ్చ మెత్తుకొనఁగ బైరాగి వగుచు;
చక్కని చుక్కను బరిణయ మాడి
నాప్రజఁ గావుము నీబోధ చేత."
అని పరిపరి విధములను బ్రార్థింప
తన నిశ్చయము నిట్లు ప్రభుఁ డెఱిఁగించె:

"ఇవి యన్ని కలుగఁగా వర్జించి వాని,
వెలుఁగును గనుఁగొన వెదకు చున్నాఁడ;
శక్రాధిపత్యంబు గైకొమ్ము టంచు
సురసుందరీ బృంద మర్థించు గాక,
జ్ఞానోదయంబగు నందాక నేను
నా ప్రయత్నంబును విరమింపఁ బోను.
వెదకఁగా వెదకఁగా గనుఁగొనఁ గలను.
గయ చుట్టు పట్లను గూర్చి పోయెదను.
ఎఱుక కల్గు నచట నని మదిఁ దోచు.
నీవు సజ్జనుఁడవు స్నేహ పాత్రుఁడవు.
శాస్త్ర చర్చలతోడ నుపవాసములను
ఇచ్చటి ఋషుల సాంగత్యము వలన
జ్ఞాన సిద్ధిని బొంద సాధ్యంబు గాదు.
బుద్ధుఁడనై నేను వచ్చెద తిరిగి;
చెల్లింతుఁ దప్పక నీ ప్రేమ ఋణము."
అని పల్కు గురువరు నత్యంత భక్తి
ముమ్మారు చుట్టుచు బింబిసారుండు
అటులె కానిమ్మని యంఘ్రుల కెఱఁగె.
ఆఱు వత్సరముల యన్వేషణమున
చాలఁగా జిక్కిన గురువరుఁడంత,
ఉరువిల ప్రాంత భూములఁ గూర్చి చనియె.

పూర్ణ సంతృప్తిని పొందగా లేక.
అచ్చటఁ గొండపై కోవెల నుండు
‘ఉద్ర’ ‘అలా’రాది యతులు త్రైమగురును
నాగి పోనీయక గురువరు నాపి
చెప్పి రాతని కిట్లు శ్రుతి పాదితములు:
“సచ్చిదానందుండు పురుషోత్తముండు,
సర్వకారుఁడు నిత్యుఁ డన్నిటనిండు.
అని బ్రహ్మ బోధించు జ్ఞాన కాండంబు.
ఇంతకు మించిన యోజుకయుఁ గలదె.
రాగంబుఁ గర్మకు నంటుగా నీక
విడివడఁ జేయంగ వెలుగ రెంటి,
నాయను భావంబు నాశంబు నొంద,
ఇంద్రియాదుల మాయ నణగించుచును,
మిథ్యల విడనాడి సత్యము దాక
దైవసన్నిధిఁ జేరి దేవుఁడై చెందు,
నిత్య నిరామయమగా శాంతిపథము.
అని కర్మ కాండంబు బోధించు మనకు
మించి దీనికి నేమి తెలియంగ వలయు”
అని వారు చెప్పఁగా నాలకించియును
పూర్ణ సంతృప్తిని బొందఁడు ప్రభుఁడు.



# షష్ఠాధ్యాయము



తిలకింపఁ గోరుదే యో బాటసారి,
ఎచ్చోటఁ బ్రభువునకు నెట్టకేలకును
జ్ఞానోదయంబయ్యె నా చోటు; సుమువు,
వేయితోఁటలకు వాయువ్య దిక్కునఁ,
ఎచ్చోట నీలజా మోహాన మనెడి,
సెలయేటి జంటతా జననంబు నొందు
ఆ ప్రవాహంబుల నంటి పోఁ బైకి
పెద్దాకు మాహాబున వృక్షంబు మఱియు
సంసార బీర పూఁబొదలను దాటి,
మైదాన మొక్కటి కనుపించు; నచట
సోదరీ యుగ సమావేశంబు తనరు
ఫల్గునీ నదిలోన; నా మీఁదఁ గలవు
బర్బరా పర్వత పంక్తియు, గయయు
ముండ్ల పొదల తోడ 'ఉరువెల' యనఁగ

పాడు బీడొక్కటి కానరాఁ గలదు.
దాని కావల నుండు నొక్క చిట్టడవి
నిడుపైన చెట్టులు నింగిని దాఁక;
లోనఁ బాఱుచు నుండు నొక సెలయేఱు
తెలుపు నలుపుఁ బూల నింపు సొంపార,
చుఱుకైన చేపలఁ దాబేళ్ళఁ గలిగి;
దాని తీరంబునఁ గలదు సేనాని
అనఁబడు పూరి పాకల పల్లెటూరు.
పల్లెటూరి జనులు పనిఁబాట సేయ
అతి శాంతముగ నుండు నాచుట్టుఁ బట్టు.

ఆ తీరముల యందుఁ దప మాచరించె
నిశ్చల ధ్యాన సమాధిలో నుండి
భగవానుఁడు ప్రభుండు బుద్ధ గురుండు;
శాస్త్రముల్ వివరించు సిద్ధాంతములను,
విధి వ్రాత తీరుల మదిఁ దలపోసె,
ఎచ్చోట నుండి తా సకలమ్ము వచ్చు
అద్ది నిశ్శబ్దంబు దానిని గూర్చి,
ఎచ్చోట మఱఁగి తా సకలమ్ము జేరు
అద్ది పెంజీకటి దాని గుఱించి;
ఈ రెంటి నడుమను, నాకాశంబు నందు

మేఘ మాలలఁ గల్పి వంతెన వతెను
హిమ నిర్మితమయి ప్రాకార తెరలు
తొమ్మిది రంగుల తోరణ ముగ్గు
ఇంతలో నగుపడి మురిపించి మాయలు
ఇంతలో మాయమగు వానవింటి వలె
అలరారు చేతనత్వంబును గూర్చి,
ఏకాగ్ర బుద్ధితో ధ్యానంబు సేయు.
దినములు దొరలెను బక్షముల్ నెలలు
యోచనలో మున్గి యెఱుఁగడు వేళ;
ఉదయ మధ్యాహ్నముల్ గడచి పోవంగ
కంన్లు తెఱచి చూడఁ గనఁబడు నెదుట
శూన్య భిక్షాపాత్ర; ఆకలి నుడుప
గోతులు విదలింపఁ జిలుకలు గొఱక
తరువుల పైనుండి రాలిన పండ్ల
బుద్ధప్రభుం డేఱుకొని తినుచుండె.
కావున శుష్కించి వసివాడె మేను,
తెల్లఁబాఱెఁ దనువు కాంతియుఁ దఱిగె;
బుద్ధుని చిహ్నముల్ ముప్పదిరెండు
మాసెను దనువును గనుఁగొన రాక.
రాజపుత్త్రుల కెల్ల మేటియై నట్టి
రూపంబు మాఱంగ పోలిక లేక,

ఋతుశోభ తొలఁగఁగా నెండి శుష్కించి,
పొదలు గాలికి రాలి పాదాలఁ బడిన
పండుటాకును బోలె నాయువరాజు.

మితిమీఱి యొనరింపఁ గలిన తపంబు
స్పృహఁదప్పి పడిపోయె నొకనాఁడు గురుఁడు,
కృశఁ బాలిపోయిన కాయంబు తోడ,
శవము నా జూపట్టెఁ గదలిక లేక,
ఉచ్ఛ్వాస నిశ్వాసములు గానరాక.
గొఱ్ఱెల మేపెడి పిల్లవాఁ డొకఁడు
ఆదారిఁ బోవుచుఁ గాంచెను బ్రభుని;
మూతలు వడినట్టి కనుగవ తోడ
ఎండి పగిలినట్టి పెదవుల తోడ
మండు టెండలోనఁ బడియున్న వాని.
కని ఫలతరువుల కొమ్మలఁ గొన్ని
వడిఁ ద్రుంచి దడిగాఁగ నాటెను చుట్టు,
నీడ గప్పఁగఁ బూజ్యపాదుని మోము;
తాకిన దోసమో యీ మహనీయు
ననియెంచి గొఱ్ఱె తోల్సంచి లోనుండి
వేఁడి పాలను బోసె నోటిలో బడఁగ.
లిఖియింపఁ బడియెఁ బూర్వ గ్రంథములను;

నాటిన కొమ్మలు నిమిషానఁ బెరిగి
ఫల పుష్ప పత్రంబులను విలసిల్లె,
అల్లిబిల్లిగ నల్ల చూడఁ సొంపైన
చలువ పందిరిఁ బోలె జూచుచుండఁగనె;
వేటకై వెడలిన రాజుకై వేయు
వెండి తీగెలతోడఁ బంగారు పంక్తి,
వెలుఁగొందు చక్కని విడిదిని బోలి.
ఆ బాలుఁ డది గని దేవుఁడా నంచు
చేతులఁ జోడించి పూజించె భక్తి.
కొంత వడికి తెల్వి తెలియఁగ రాఁగ
ఊపిరి యాడఁగా దిన్నఁగా లేచి,
పాత్రతో పాల నిమ్మని సైగఁ జేసె
ఆ పిల్లవానికిఁ బ్రభువు బుద్ధుండు.
"శూద్రుఁడ నో ప్రభు! తాకింప నొల్ల
నా దుత్త, తప్పును మన్నింపు" మన్న,
ఆ జగద్వంద్యుఁడు బలికె నీరీతి;
"ఆపద నవసర వేళల యందు
అనుకంప జనియింప నందఱొక్కటియ;
ఉప్పన కన్నీరు నెత్తు రెట్టనయు
ప్రాణు లందరికిని, సందేహమేల?
వర్ణ భేదము లేదు వీని రెండింట;

బొట్టు, జందెపుఁగట్టు, పుట్టఁగా రావు,
మంచి పనులు చేయువాఁడె పో ద్విజుఁడు,
చెడ్డ పనుఁలు చేయు వాఁడె నీచుండు;
కావునఁ దమ్ముఁడా యిమ్ము క్షీరమ్ము
నా పని నెఱవేఱ మేలు నీకగుత."
అను పల్కులకు నుబ్బి సంబర పడుచు
ప్రభుని కిచ్చెను గొల్ల బాలుండు పాలు.

ఆదారి నేగిరి వేఱొక నాడు
తళుకు బెళ్కుల తోడ నాట వెలఁదులు;
-దేవాలయపు దేవ దాసీలు వారు-
మద్దెల పిల్లనగ్రోవి విపంచి,
వాయించు వారలు తమవెంట నడువ,
చిఱుకాళ్ల గజ్జెలు చేతి గాజులును
ఘలుఘల్లు రని మ్రోయ నొయ్యార మొలుక;
సందడిఁ దిరునాళ్లఁ జేరఁగా జనిరి.
తంత్రులు మీటుచు వీణ వాయింప
గొంతు కలిపి పాడె జవ్వని యొకతె,
"పసగుల్కు నాట్యంబు వీణ మ్రోయింప
హెచ్చు తగ్గులు లేక శ్రుతి సవరింప;
మితిమీఱి బిగియింపఁ దెగుగాదె తీగ,

శిశువు చాలక యున్న నగుగాదె మూఁగ,
వీణఁ బల్కింపుఁడు శ్రుతి సరిగాఁగ;"
అని పాడెఁ బ్రక్క వాద్యములతోఁ బడుచు
రంగు పూతల తోడ నాడంబరముగ,
రెపరెప లాడెను బిట్టుల రెవ,
పొదల సందుల దూఱి చనుబాఱఁ జనుమ.
కాని యెఱుంగరు తమపాట దారి,
దాపున ధ్యాన నిమగ్నుఁడై యున్న,
స్వామి చెవుల సోకె మేల్కాల్పె ననుచు.
తలయెత్తి తిలకించి భోగ భామినుల
తలపోసె నిట్టులు తనలోన స్వామి;
"తెలిసిన వారికి దెలియఁ జెప్పెదరు
ఎన్నియెనో మాటలు తెలియని వారు.
త్రోచు సంగీతంబుఁ బలికింప గోరె
ప్రాణాత త్రిసి బిఱ్ఱ బిగియించినాఁడ;
మసకఁ గ్రమ్మెను గండ్లు, నిజము నారయఁగ
నవసర మగు వేళ నుడిగె బలంబు;
ప్రాణులఁ గాపాడు పని సేయుచుండ
ప్రాణము ల్గోలుపో నున్నాఁడ నిపుడు
సాహాయ్య సంరక్షణంబులు లేక."

ఆ నదీ తీరమం దొక్క భూస్వామి

కలఁడు, దొడ్డదొరయు గొప్ప కామందు,
పసుల మందల కెన్నో యధిపతి యగుచు
పేదల పాలిటి పెన్నిధి యట్లు.
సేనాని యను తనయింటి పేరునను
ఆగ్రామ మంతయుఁ బిలువంగఁ బడఁగ;
ఆ చుట్టుఁబట్టుల చక్కని చుక్క-
అని పేరు గాంచిన వనిత సుజాత
అలరింప నుల్లము నర్ధాంగి యగుచు,
సుఖ శాంతులను గల్గి వర్ధిల్లు చుండు.
ఆకాంత పరమ పతివ్రత యగుచు
దయయు దాక్షిణ్యంబు సారళ్య గుణము,
సత్యసూక్తియు నైజ సౌమ్యతఁ గల్గి,
మెల్లని మాటలు చల్లని చూడ్కి-
దరహాస వదనంబు గరువతనంబు
గల వర్తనంబున తరుణుల కెల్ల
తలమానికంబౌచు దనపతి తోడ
వర కాపురము సేయు గృహలక్ష్మి పోలె,
పొరపొచ్చెములు లేక సుఖములు పొదల;
కొడుకులు లేనిదే కొఱత యొక్కటిగ,
పుత్త్రులఁ బడయంగఁ గోరి యా సాధ్వి
కమలమ్మఁ బూజించె హృత్కమలమున;

పుష్పమ రాత్రుల లింగము చుట్టు
పిదప కెన్బది యొక్క-మారులు తిరిగె,
పూలతో నర్చించి యగరు ధూపముల
ఆరాధనము సేసెఁ దక్షిణల నొసఁగె;
ఉపవాసముల జేసె, బ్రార్థనల్సలిపె.
అదిగాక మగబిడ్డ కలిగినఁ దనకు
"వనదేవతకు నిత్తు సమ్మృతోఁ బవమాన
పరమాన్నమును హేమ పాత్రతోఁ దెచ్చి,"
అని మ్రొక్కె నాసాధ్వి; యా ప్రకారంబె,
ముద్దుబిడ్డడు గల్గె ముచ్చట దీఱ.
మూఁడు నెలలు నిండ చిట్టి కానాడు
మ్రొక్కుఁ జెల్లింపంగ ముదముతో నామె
కోక చెఱఁగుఁజుట్టి ముద్దులపట్టి
రొమ్మున కానించు కొని యొక చేత,
ఒకచేత తలపైని పాయస పాత్ర
కదలకుండఁగఁ బట్టి కడు భక్తి తోడ,
మందయానంబున నేగుచునుండ;
చెట్టు చుట్టును జిమ్మి శుభ్రముఁ జేసి
దండలు గట్టగా జనియున్న రాధ,
పరుగున నెదురైన దొరసాని గాంచి,
"ఓయమ్మ నీభాగ్య మేమని చెప్ప

వనదేవతామూర్తి వృక్షము క్రింద
పద్మాసనస్థయై నిష్ఠలో నుండె;
వెలుఁగొందు వర్చస్సు మొగమును జుట్టి,
కరుణామృతముఁ జిందు దివ్యనేత్రములు."
అని చెప్ప దేవతగా నెంచి యామె
భయము తో డగ్గఱి భక్తితో మ్రొక్కి,
ముద్దుమొగము వంచి మెల్లఁగా బలికె:
"ఓ మహనీయ! యో పరమపవిత్ర,!
ఓ వనదేవతా దివ్యస్వరూప!
దాసదాసిని నన్ను దయతోడ గాచి,
చంద్రికా ధవళ పయస్సును దధిని,
గైకొమ్ము ప్రీతితో గరుణాసముద్ర!"
అనుచు బంగరు గిన్నె నిండఁగా బోసె
తియ్యని పెరుఁగుతో జిక్కని పాలఁ
బొంగింపఁ బడియున్న పరమాన్నమంత;
పన్నీటి పరిమళ జలముఁ జిల్కింప,
మాఱు మాటాడక ముదము మీఱంగ
మధురాతి మధురమా పరమాన్న మంత
ఆరగించెను స్వామి; చల్లని తల్లి
కడ నిల్చి కనుఁగొన కడు సంబరమున.
అగునేమొ యమృతమ్ము కాకున్న దాన

నిమిడి యుండె నో యేమొ యింతమహత్తు,
నిండు బలంబును నూత్న తేజంబు
తిరిగి చేరుకొనియె స్వామిదేహంబు,
ఇంద్రజాల మటుల నిముసంబు లోన.
దహియించు దప్పిని దీఱుచు కొనంగ
విసువక యిసుక యెడారుల దాటి
కమ్మని చల్లని కొలకులఁ గాంచి
కడు మోదమున మున్గి ధూళిని దులుపు
ఖగముల కైవడి ప్రభు భావ పక్షి
నూత నోత్సాహంబు బొందెఁ బూర్ణముగ.
వికసించు వదనారవిందము గాంచి
స్వామి సేవించి సుజాత మఱిమఱి,
తిన్నని యెలుఁగునఁ దెలియ నిట్లడిగె:
"కావె దేవుండ వేనిడిన యీ కాన్క-
చేకూర్చెనే తృప్తి దేవర" కన్న,
"ఏమి యన్నము దల్లి చేసితి వెట్లు
చెప్పుము నా" కని ప్రభుఁడడుగంగ,
స్వామి కిట్లు సుజాత తెలియంగఁ జెప్పె:
"మా మొదవుల నుండి యేరుకొన్నట్టి
క్రొత్తగా నీనిన గోశతంబులను
పిండి, యా పాలతో మేపి, యేఁబదిని,

వాని పాలను బోసి యిరువదియైదు
గోవులం బోషించి, వాని క్షీరముల
పండ్రెండు గోవులం గుడిపించి, వాని
పాలను దాగించి యాఱావులకును,
శ్రేష్ఠతమంబులౌ వాని క్షీరముల
రజత పాత్రంబులం బట్టించి కాచి;
మంచి విత్తులు జల్లి క్రొత్త పొలాన
పండించి పోసిన ధాన్యమునుండి,
ముత్యాల వలె నున్న గింజల నేరి
మంచి వాసన లీను ద్రవ్యము జ్జేర్చి
ఉడుకఁబెట్టితిఁ బాల నిష్ఠతో స్వామి.
నిండు మనంబుతో జేసితి నిట్టుల
మగబిడ్డ గల్గినఁ జెల్లింతు నన్న
మ్రొక్కుఁ జెల్లించితి, నోములపంట
నా ముద్దుబిడ్డడుఁ వీఁడె కన్గొనుము,
ఆనంద సుఖముల నలరు జీవితము;
మెల్లఁగఁ దొలగించి కావి కుబుసము
బుడుతని తల నిడి కరకమలంబు,
"సుఖపడు మో కుఱ్ఱ! కలకాలమ"ంచు,
"తేలిక యగుఁగాత బ్రతుకు బర్వం"చు,
దీవించి బాలుని, "నో చెల్లి వినుము;

రక్షించితివి నన్ను దేవుఁడ గాను,
రాజపుత్రుఁడ నేను దీనికి మునుపు,
సన్న్యాసినై యిప్డు వెదకు చున్నాఁడ
జీవుల చీకఁటిఁ బాపెడు వెలుఁగు.
జన్మజన్మల కర్మ ననుభవింపంగ
పరిశుద్ధమై జీవి, పై కేఁగు రీతి,
గోవుల పాలతో బ్రతికితి నేను,
నీవు వండిన యట్టి నిర్మలాన్నమున,
పోయిన ప్రాణము బలము చేకూరె,
తప్పకఁ గనుఁగొందు నేను వెలుంగు;
ఐన నే నడిగెద సోదరీ చెప్పు!
బ్రదుకొక హాయియై పొదలునే నీకు,
ప్రేమయు ప్రాణంబు నిచ్చునే తృప్తి?"
స్వామి కిట్లు త్తరమిచ్చె సుజాత;
"చిన్ని చెంబును బోలు నాదు మనంబు,
కొంచపు నీటిచే నిండిపోఁ గలదు.
పెద్ద పొలాలను దడుపఁగా లేని,
చిటపట చినుకులు తడుపు నామడిని;
మా పాప నగవులో మగని నీటునను
బ్రతుకు వెలుఁగు దోప మా యింటిలోన
అనురాగ మేపార పలరుదుఁ దేవ.

పొందలకడ లేచి కొలిచి దేవతల
తులసి కోటను గడ్డి బిచ్చము వైచి
పనివారలకుఁ బను లప్పగించెదను;
నాథుఁ డింటికి రాగ మధ్యాహ్న మందు
బడలిక తీరంగఁ దలఁ దొడపైన
నిడుకొని చల్లఁగా వీచుచు, వీణ
మెల్లఁగా మీటుచు నిదురఁ జేకూర్తు;
ప్రక్కన నిలఁబడి ప్రాణనాథునకు
నిశ్శబ్ద రమణీయ రాత్రుల యందు
కడుపార విందార గింపగా జేతు;
నింగిని వెలుఁగఁగా వెండి దీపములు
గుడికేగి చెలియలఁ గూడి సూట్లాడి,
నిద్దుర పోవుదు; నీవిధంబుగను
ఇంటి పనులలోన మునిగి రేఁబవలు
హాయిగా ప్రొద్దును బుచ్చెద నేను;
నాపాప ముద్దు ముచ్చటలను దీర్ప
మగని మెప్పుఁ బడయ మెలఁగెదు నాకు
ఇంత గలుగ సౌఖ్య మబ్బెదె చెపుమ!
శాస్త్రము ల్జెప్పును నిట్లని విందు.
బాటల నాటంగ, నీడ చెట్టులను
బావులఁ ద్రవ్వింపఁ బరహితముగను

కొడుకుల గన్నట్టి వారలకెల్ల
మరణాంతమున మేలు చేకూరు నంచు;
మంత్ర తంత్రంబుల మహిమను గ్గి
నిజము నెఱిఁగిన పెద్దలు సెప్ప
ధర్మ మార్గంబుల శాంతి సిద్ధతుల
ఎదురుఁ జెప్పక నేను నమ్మెదు నెప్పుడు;
మంచిచే మంచియుఁ జెడుగున జెడుగు
ఎల్ల కాలంబుల నెల్ల చోటులను,
ఎల్ల వారికి నగుఁ దటితోడ సంప్రము;
మంచి తరువు లిచ్చు తియ్యని పండ్లు,
విష వృక్షములు బిచ్చి కాయలఁ గాయు;
ఈసు నసూయయుఁ బగలను బెంచు,
దంపు తెచ్చి పెట్టును చెలుల చుట్టముల,
శాంతము లేకున్న సౌఖ్యము సున్న,
ఇవ్వియే ప్రతిది నానుభవమ్ము లగును.
బ్రతుకిటు చెల్లఁగఁ జచ్చిన పిదప
వేరు విధంబుగ వర్తిల్లు నెట్లు?
ఏక సూత్రమె చెల్లు నెల్ల లోకముల,
కాకున్న ఫలితంబు లధికంబు లౌను;
ఆకురాల నవిగో శూన్య భూజములు
వేళరాఁ బూయవె వేల పుష్పముల,

క్రమజాతి ధర్మంబు తప్పిపోకుండ.
ఓరుపు నెడలించి కాఱియ బెట్టు
దుర్భర దుఃఖముల్ రావచ్చు స్వామి.
అసువుల బాసిన నాపాప ముందు
నాగుండె బ్రద్దలై పగులంగ వచ్చు,
కష్టాన గుమిలి నే కృశియింప వచ్చు;
ఏగతి పట్టిన నీడను బోలి
నాపతి యండనే యుండుదు గాని,
ఏకాకిగా వీడి యుండఁగా జాల.
నాకంటె ముందుగా నాదు సేనాని
కాలధర్మము నొంద విడువక నేను
చితినెక్కి నిత్యమా చిఱునగ వెలయ,
నాతోడ పెనిమిటికేని తలగడగ
సహగమనము సేతు సతిధర్మ మలర.
ప్రేమతో నిట్టులఁ బతితోడఁ బోవ,
తలవెంట్రుక లవెన్నో యన్నికోట్లేండ్లు
తనపతి స్వర్గ ధామంబును జేరి,
నాక సౌఖ్యము లొందు నని పల్కు విందు.
ధర్మానువర్తినై వెఱపును గనను,
కష్ట జీవులఁ గాంచి జాలిఁ జెందెదను,
దయతోడఁ జూతును దీనజనాళి,

పాపులఁ బ్రోవగాఁ బ్రార్థింతు ప్రభుని.
అందరు సుఖపడఁ గోరుదు మదిని,
మనసు సూటిగఁ బోదు నామటు కేను,
శక్తి కొలఁది మంచి చెడు గమనించి,
ధర్మమే శరణుగా ధైర్యంబు తోడ,
రానున్న వానిని రానిమ్మ టంచు,
వచ్చెడు నన్నియు మన మంచి కొఱకె
అనియెంచి సంతోషమున సంచరింతు.”
ఆమాటలను విని యనియెను ప్రభుఁడు:
“పెద్దవారికి బుద్ధి గఱప జాలెదవు;
నీ నేర్చినది మిన్న జ్ఞానమ్ము కన్న;
తెలిసె ధర్మము నీకు మంచియుఁ జెడుగు,
తె[illegible] నేఁడు యితర సంగతులు.
నీవారి[illegible] గూడి నెయ్యము మీఱి
పువ్వు పోలిక కమ్మ తావు లీనుచును
శాంతి ఛాయను జల్లగా మను తల్లి!
చిగురుటాకులు నీవియోర్వఁగ లేవు
క్రమముగా వర్ధిల్లి ముదురు నందాక
మధ్యాహ్న మార్తాండ చండ తీక్ష్ణతను.
గూటిని జేరెడు గువ్వ పోలికను
ఈలెల్లో నీకబ్బె నతి సహజముగ;

కడుమంచి డెందంబుఁ గల్గిన చెల్లి!
పూజించితివి నన్ను బూజింతు నిన్ను.
నిన్ను జూచిన దాది యాస కల్గెడిని
బ్రతుకు త్రిప్పులఁ దప్పుకొనఁ గలమంచు
మానవునికి ముక్తి పొందనౌ నంచు;
శాంతి సౌఖ్యము నీకు సమకూరు గాత,
ఎవ్వని దేవునిగా నెంచి తీవు
ఆతఁడు నీవలె సాధించు గాత!
కార్యసిద్ధి గలుగ దీవింపు మమ్మ!"
"జయము నీకగు గాత!" యనిపల్కె యామె
-బుడుతఁడెఱఁగె నేమొ బుద్ధుఁడౌ నంచు-
తనలేత చిఱుచేతులను జాపు కొంచు
ప్రభునిఁ జేరెన పాపఁ బట్టఁగా; స్వామి
లేచి బలము జేరి యున్నందు వలన
ఆదాపు గనుపించు నొక గొప్పచెట్టు
చేరఁగా మెల్లఁగా నడువఁగా సాగె;
ఎన్నేండ్లు గడచిన నే తరురాజు
మానవాళి కెపుడు మఱపుకు రాదొ
ఏప్రొద్దు భక్తితో దేని రక్షించి
పోషించి కాపాడి మ్రొక్కుచు నుంద్రో,
ఏచెట్టు చల్లని నీడలో స్వామి

వెలుఁగును గనునట్లు నిర్గ్రాత గలదో,
ప్రభున కంతయు ముందె తెలిసెఁ గాఁబోలు.
ఆ బోధి వృక్షంబుఁ జేరగా స్వామి
కొలచిన యమనుగుల గడుబదిలముగ
గజ యానమున నేగె, జగములో హర్షా!
జేజేలు వల్కుఁడు నిండు హర్షమున.

ఊడలు దిగఁజుట్టు స్థూపము ల్పగిది
నిగనిగ లాడెడు పచ్చని కప్పు
పై నలరార నాలయమును బోలు,
విజ్ఞాన వృక్షపు నీడనుడాయు
గురువరు నెఱిఁగి భూవరాత్మ, యాస్దపై
పుట్టిన పూవుల తలిరు జొంపముల,
రా రమ్మటంచును నూగుచుఁ బిలుచు
పచ్చిక పోచలఁ బూజలు సలిపె;
బాటఁ పొదలు వంగి నీడలు నిలిపె,
జల దేవతలు వంపు పద్మగంధముల
గొనుచు నదులనుండి గంధవాహుండు
చల్లఁగా వీచె; జింక యెలుఁగు బులియు
మొదలుగా గలయట్టి యడవి జంతువులు
తమ వైరములు మాని యా సంజవేళ

గుహల లోనుండియు బొదలలో నుండి,
చకిత విశాల నేత్రములతోఁ జూచె
కరుణను గురిపించు గురుని నెమ్మోము.
బిలముల వెలువడి మిలమిల మెఱయు,
క్రూరోరగంబులు పడగలు విప్పి
గౌరవింప గురుని నటనం బొనర్చె;
వింజామరల పూని ప్రభు గౌరవింప,
ముందుగా నడచెడు పరివార మనఁగ,
ఆకుపచ్చయుఁ గెంపు నీలము నలుపు
బంగారు రంగుల రంగారు నట్టి,
వన్నె పులుంగు సీతాకోకచిలుక
లల్లార్చె ఱెక్క- లానందంబు నొంది.
గ్రద్ద పామును వీడి గట్టిగా నఱచె.
కొమ్మ కొమ్మకుఁ బ్రాకె గీతల యుడుత.
ప్రభుని సందర్శింప నుత్సాహి యగుచు
ఊఁగాడు గూటిలో నాసాలిపిట్ట
కిలకిల లాడెను; పరుఁగిడె బల్లి,
కోయి లాలాపించెఁ గమ్మని గీతి.
గుంపులై గువ్వలు చేరెను చుట్టు
ప్రాత ప్రాణు లెఱిఁగి సంతోష మందె.
గాలియు నేలయు గొంతుక ల్గలిపి

వినువారి చెవులకు విందగు నట్లు
కలసి పాడిరి పాట కమ్మగా నిట్లు:
"ఓసఖ! ఓప్రభు! దీనదయాళు!
క్రోధ కామంబుల, గోపము నుబ్బు
మద మత్సరంబుల, మోహ లోభముల,
భయము, సందేహంబు, నన్నిటి వీడి
పరుల పీడల బాప నీవు సర్వంబు
అర్పణఁ జేసిన యో త్యాగశీలి!
పొగలు పుడమి తన్ను గాపాడు మంచు
బుద్ధుని నిన్ను చేయెత్తి దీవించు
ఓ దీనరక్షక! ఓ జగద్వంద్య!
తుదిసారి మాకయి సాధింపుమయ్య!
జయము నీకగు గాత దీన బాంధవుఁడ!
ఓరాజ! జగజెట్టి! విక్రమశాలి!
సత్య స్వరూపంబు జూపాడు మయ్య.
ఏనిశి కొఱకునై యుగ యుగములుగ
ఎదురు చూచుచునుండె నెల్ల లోకములు
దరిసె నా సమయంబు, వచ్చె నా వేళ
తరురాజు ఛాయకు దయచేయుమయ్య."

ఆచెట్టు నీడలో గూర్చుండ గురుఁడు

రాతిరి రా, నంత మారుఁడు లేచి
బుద్ధుఁ డీతఁడనుచు బుద్ధి నెఱింగి
వెలుఁగును గనుఁగొని జగతిఁ గాపాడ
సమయము దాపయ్యె నని మదిఁ దెలిసి
తన దుష్ట శక్తుల నెల్ల రావించె;
తెల్వి వెల్గుల తోడఁ బోరాడు వారు
చీకటి వెఱపుల సంతతి వారు
పాతాళ గుహాలలో వసియించు వారు
ముక్కడి రక్కసి మూకలు వచ్చె;
అరతి తృష్ణ, రాగములను వారు
అజ్ఞాన మను దమ సేనతో దఱిలి;
నేల గ్రక్కదలగ వణకంగఁ గడలు.
ద్వేషించి బుద్ధుని యాతని మనము
ఊపఁగా సమకట్టి యా నిశి యంత
వెలుఁగును జేరనీ కాపఁగా దలఁచి,
వారొనర్చిన క్రూర కృత్య కాండంబు
తీవ్ర పోరాటము సమర సంకులము
జ్ఞాన వంతులయిన నెఱుఁగ రొక్కరును.
దుమ్ము దుమారాలఁ బెను గాలి రేపి
వికటాట్టహాసాలఁ బెడబొబ్బ లిడుచు
నింగి చిల్లులు వోవ నుఱుముల తోడ

పిడుగులు వడిఁబడఁ బెళపెళా ర్భటుల
మిఱుమిట్లు గొలిపెడి మెఱపుల తోడ
వెఱపుఁ గొలుపఁ జూతు రొక్కొక్క వేళ;
నవ వసంతంబుల నపుడె కల్పించి
మలయ మారుతములు మెలఁగఁగా జేసి
నవ మోహనాంగ సుందరులను బంచి
వలపుఁ బల్కుల వాడి చూపులతోడ
ఆడించి పాడించి ప్రేమ పాటలను
చెఱుపఁ జూతురు గురు మన మొకవేళ;
ఒకసారి రాజాధి కారంబు లాది
చూపించి యాశను గొల్పఁ జూచెదరు;
నిజమును వెదకుట నిష్ఫలమనుచు
లేనిపోని విశుష్క సందేహములను
కల్పింపఁ జూతు, రీరీతిని వారు
వేధించి నారలో వెలుపల మూగి,
లేకున్న లోనున్న దుష్ట శక్తులను
ఎదిరించెనో స్వామి యెఱుఁగుడు మీర;
ప్రాచీన గ్రంథస్థలములఁ జెప్పుచుంటి:

మారుని సేనలో ముఖ్యు మైనట్టి
పాపపు దయ్యము ల్పది వచ్చె; మొదట

అట్ట వాదంబను దురభిమానంబు;
జగతి యంతయుఁ దనరూపుతో నిండి
ఎల్లెడఁ గన్పింప 'నా' 'నేను' 'నాది',
'నా' యనునది నిల్వ నిలగలవెల్ల
నాశనంబైనను నాకేమి యనుచు
అఱచుచు వడివచ్చి గురువరుఁ గాంచి;
"బుద్ధుఁడవే నీవు చెప్పెద వినుము:
అచ్చపు జీకటి సల్లాడ నూరులు
నీకేల నిదియెల్ల; మాఱుపు లేక
నీవు నీవై యున్నఁ జాలదె నీకు;
తఱుఁగని గోరని, మాఱుపు లేని
సుఖముల నేపొద్దు కుడుచుచు నుండు
సురల సౌఖ్యములొంద లేలెమ్ము రమ్ము."
అనిపల్కు దాని కిట్లనియె బుద్ధుండు:
"నీచాతి నీచము నీచెప్పు సుఖము,
శాప సమానము నీ పాపిరూపు,
అభిమానులను నొంప నవలకుఁ బొమ్ము."
అంతటఁ జచ్చు సందేహము వచ్చె,
ఉన్నది లేదంచు నుడికించు శక్తి
చెవిలోనఁ జెప్పెను స్వామి కిట్లనుచు:
"వట్టి బూటకములు దృశ్యములన్ని

వాని వృత్తు లెఱుంగ నేమి ఫలంబు?
మననీడ వెంటాడఁ గోరుటఁ బోలు,
విధివ్రాతఁ దప్పింప నలవి గాదయ్యొ
రానున్న దానిని రానిమ్ము టంచు
ధీరతతో నెదుర్కొనుటయ తక్క
శరణ మన్యములేదు, దానికిమించి
మంచి మార్గము లేదు మనుజులకెందు,
కావున లే పొమ్ము వచ్చిన దారి”
అనుదాని కీరితి, జెప్పెను స్వామి;
“పరమ శత్రువ వీవు నరజాతి కెల్ల
ఆస్తి నాస్తి యనెడు వికిచిత్స వీవు
దరియఁ జాలవు నన్ను బొమ్ము దూరముగ,
సంశయ గ్రస్థుల నేపఁగా బొమ్ము.”
వివిధ దేశంబుల వివిధ రూపముల
మూఢ మతములను రూపము దాల్చి
మంత్ర తంత్రంబులఁ గర్మ క్రతువుల
ఆత్మ నల్లాడించు నొకమంత్రశక్తి,
నరక కవాటము ల్గట్టిగా మూసి
స్వర్గ కవాటముల్ దెరువగా జాలు
సిలబ్బుతు పరమాస యను బెనుశక్తి
వచ్చి, పల్కెనిటుల ప్రభువరుగాంచి:

"మా రాజ్యముల కెల్ల నాధారమగుచు
పౌరోహితాళినిఁ బోషించు నట్టి
ధర్మము నరికట్టి తొలఁగఁగా గొట్టి
దేవాలయంబుల దేవతాదులను
పావన గ్రంథరాజంబుల ద్రోసి
పాడొనర్ప నిటుల సాహసించితివె!"
అన బుద్ధుఁడనె నిటు రూపంబు లెల్ల
రూపఱి పోవును మాఱ కెప్పుడును
సత్య మొక్కటియ శాశ్వతఱిముగ నుండు
చిమ్మ చీకటిలోనఁ బొరలఁగా బొమ్మ
మూఢ మానసులకు నేర్పఁగా బొమ్మ."
తరువాత బిరబిరఁ జేరగా వచ్చె
మోసగింపఁగ మొనగాఁడు కాముండు,
రాగములకు, రాజు వలపుల ఱేఁడు,
సురలనే ఆడింప జాలెడి వాఁడు,
ప్రేమ సామ్రాజ్యంబు పాలించు వాఁడు;
విషలిప్త మైనట్టి తూపుల మించి
మనమును వేధింప జాలిన యట్టి,
చిఱుమంట లెగయఁగా మొనల నైదింట,
కామ బాణంబును గుఱి నెక్కువెట్టి,
పూలతో నలరారు తీవింటి యందు,

దరహాస వదనంబుతో నరుదెంచె.
అతి సుందరాంగు లాతని చుట్టుఁజేరి
ఒయ్యార మొలుకఁగా వచ్చిరచ్చటకు;
చిలుకల కొలుకుల జిలిబిలి చూపు
మై జిగిబిగియునుజవాతెఱ రుచియు
ముసిముసి నగవుల ముద్దు మొగములు
వర్ణనాతీతమై దివ్యమై తోఁచె;
కసరాక వినవచ్చు కమ్మని శ్రుతుల
కలకంఠములఁ గల్పి ప్రేమ గీతముల
పాడిరి శృంగార చేష్టల తోడ
మన మోహనంబుగ మాధుర్య మొలుక;
వారి విలాసము వీక్షింప నెంచి
రాతిరి, జాబిల్లి తారకాగణము
నిలచె నిశ్చలముగ నంబరవీధి;
వీనుల విందుగా వినిపించెఁ బాట:
"వయసు గతించిన వలపులు సున్న,
చెలువల మనసుల నలరింపఁ జేయ
గబ్బి గుబ్బల నుబ్బు బిబ్బోకవతుల
ఘనజఘనల పొందు నొందుట కంటె
ముల్లోకముల లేదు మించిన సుఖము;
సార హీనంబైన సంసారమందు

సారము ల్గ్రోలరె సారంగలోచనలు
వారి విలాసము వగలు జిలుగులు
మెల్లని వంపుల సొంపుల యింపు
నిలువు చెల్వు సొబగు నేమని చెప్ప;
వారి స్పర్శ సుఖమ్ము మించెడి హాయి
ఈఱేడు లోకాల నెందు లేదోయి;
పొంగు రక్తము దానిఁ బొంద నుప్పొంగు;
మంచి యనుచుఁ గోరు మఱిమఱి మనము
ఏ క్రీడ డెందము నెందును బోక
ఆనందమున కందళించు నిశ్చలత
ఆ యింపుఁ బోలిన తేనియ తీపి
ప్రేమామృతము దుర్లభము దేవతలకు;
మురిపెముతో నిచ్చు ముద్దులగుమ్మ
ముద్దుకు సాటియే మూడులోకములు;
వేయి కష్టము లొక పాటియే చెపుమ!
కాంతల కౌగిళ్ళ మనవలె గాని;
వనితల బాహువల్లరులలో జేరి
వలపు టుయ్యాలలో జంపాల లూగి,
కాలము గడుపఁగా హాయి మైమఱచి
నాక సుఖంబుల నాసింపనేల"
వలపు పిలుపు దోప వాల్గన్ను లందు

సమ్మోహా కరమగు చిఱునగ వెలయ
కర పద విన్యాసముల విలాసముగ
ఉల్లాసముగ వారు వంగి లేచుచును
గిరగిరఁ దిరుగుచు బహు భంగిమముల
సొంపులు దళ్కొత్త లాస్యంబు లాడ,
అరవిచ్చు పూమొగ్గ యందచందములు
కనఁబడి కనఁబడ కలరించు కరణి,
అంగకంబుల పొంక మగుపడఁ గొంత
నటబృంద మట్టుల నర్ధ రాత్రమున
వటవిటపిని జేరి "గౌతమ! రమ్మ!
అధరామృతమ్మును గ్రోలఁగా రమ్మ!
తియ్యని వలపులఁ దేలఁగా రమ్మ!
అనుభవింపఁగ రమ్మ మా యౌవనమ్ము!"
అని పిల్వ కదలక మెదలక యున్న
ప్రభుఁ గాంచి కాముండు విదలింప విల్లు;
అతిలోక సౌందర్యవతి యగు కాంత
అప్పటముగ యశోధర రూపు దాల్చి,
కన్నీరు క్రమ్మఁగఁ గలువ కన్దోయి,
జాలి చూపులు దెల్ప దన దీన గతిని,
చాచిన చేతు లాతురతను జాట,
సొంపైన యా రూపు పేరును జెప్పి,

కమ్మని యెలుఁగున తిన్నగా ననియె:
"నీవు లేని కతనఁ జావఁగా నున్న
నన్ను జేరఁగ రమ్ము రాజ! లేలెమ్ము!
భోగ మందిరమున రోహిణీ తటిని,
...ఎచ్చోట నిందాక నీకయి నేను
పొగలుచు నేకాకినై పడియుంటి...
హాయిగా గడపిన జంట జీవితము,
మధుర తమంబైన ప్రేమ పూజనము
మఱచితివో స్వామి మఱల రారమ్ము!
మధురాధరము గ్రోల మగుడ రారమ్ము!
వెడద యురమ్మును నను జేర నిమ్ము!
పడిన యిడుమలెల్ల మఱచిపో నిమ్ము!
నన్ను నీప్రేయసి నిటు కనుగొమ్ము"
అనుదానిఁ గనుగొని గురువరుఁ డనియె:
"నాసఖి వేసము దాల్చిన కతన
సొగసరి కపటపు ఛాయ శపింప;
నీ పాచికలు పాఱ విచట నో నీడ!
జగతి పోకడలు నీ నిలువును బోలు;
నాటక మిక మాని వెడలి పొమ్మ"న్న;
కేక యొకటి నిండె నా వనమంత
రెపరెప కొట్టుక యాఱెడి దీప

కళికల పోలిక నా చెలిపింఛు
వెలవెలఁ బాఱెను గనుబడ కుండ,
పొగతోఁక యొక్కటి కనుపించె నచట.

నింగిని గ్రమ్మఁగా గాఱు చీకటులు
రేగు తుఫాను శబ్దంబులు ప్రజల,
చరమ పాపంబు లైదును వచ్చె మొదట.
‘పతిఘ’ నామకమైన ద్వేషము దోఁచె;
మొలఁజుట్టి యున్నట్టి నాగులు గ్రోల
విసపుఁ బాలను జాఱు చన్నులఁ బట్టి,
దాని తిట్లు కలియ రుసరుస బుసల.
ఏమి చేయఁగఁ జాల దాయె నాశక్తి;
చల్లని చూపులఁ జూడఁగా స్వామి
దాని పెదవులు మూతలు వడె, మఱియు
పాములు కోరలు డాచుకో సాగె.
దాని వెంటను వచ్చెఁ దగుదు నే నంచు
‘రూపరాగ’ మనెడు ఘన జీవితేచ్ఛ;
బ్రతుకు టాస విషయ పంకిల మగుచు
మనుగడ మంచిని మఱచిన దగుచు.
దాని ననుసరించెఁ గీర్తిపైఁ గాంక్ష
‘అనుపరాగ’ మనెడి యతిశయ శక్తి.

గొప్పవారి నయిన గుప్పెటఁ గొనెడి
శౌర్యంబు, ధైర్యంబు, కడు సాహసంబు
మొదలుగా గలవాని కెల్లను దల్లి.
దాని వెనుక వచ్చె 'ఉద్దాచ్ఛ' మనెడి
ఒడుదుడుకులు లేని శక్తిసోత్కర్ష.
అన్నిటికి వెనుక వచ్చె నవిద్య,
కడు వికృతంబుగ రోత గొలుపుచు.
రూపమే లేనట్టి యతి నీచమైన
తాబేలు గబ్బిలంబుల బోలు ప్రువ్వు
లెగఁబ్రాక నొడలిపై నొఱయు చొండింటి,
తన యడుగులు గూర్ప నలుపుఁ జీకటికి,
అల్లాడ నచలము ల్గొల్లన గాలి,
నక్షత్రములు డుల్ల గగనంబు నుండి,
పగిలి నీలాభ్రముల్ గుహలలో నుండి
ఉఱుముల మెఱపుల వాన గుర్పింప,
చెదరి జాఱిన కట్ట్రి జడలలో నుండి
పాపి రూపులు తొంగి సందులఁ జూడ;
అఱపులు కేకలు కడలెల్ల నిండ
పాతాళ పతులు పల్తావుల నుండి
నడుపింప నిడుపైన తమసేన లెల్ల
కడు భయంకరముగ వచ్చిరి వారు

దిక్కులు వడకగ నేల గ్రక్కదల
ప్రభువును భయపెట్ట; కాని బుద్ధుండు
కదలక మెదలక కన్నెత్తి కనక
తనమంచి యను కంచుకోటలో నుండె
కడు శాంతముగ; నతి పావనమైన
ఆ వటవృక్షమే కలఁగ దొక్కంత;
అచ్చయి జావడి తనచుట్టు రేఁగి
ఆకులు కదలక తళతళ మెఱసె
ఆ రాత్రి యంతయు; బున్నమ రేయి
గాలికి చెదరక మిలమిల మెఱయు
హిమ బిందువుల వలె, యీ గోల యంత
తన యూడల కవలఁ గావింపఁ బడియె.
నిండి పుడమి యంత నెమ్మది మీఱ
రే రాజు క్రుంకఁగ వేకువ గాలి
అల్ల నల్లన వీవ హాయి గొల్పుచును
భూతముల్ ప్రేతముల్ పరుఁగిడి చనఁగ
ఆ రాత్రి మూడవ యామము నందు
సమ్మసంబుద్ధత నొందెను ప్రభుఁడు.

మన చక్షువుల తోడఁ జూడఁగా రాని
వెలుఁగునఁ గనుఁగొనె నాతఁడు తనదు,

అన్ని లోకంబుల జన్మ లన్నిటిని
ఒకటి వెనక్క నొకటి యేబది మఱియు
ఐదు వందలు గల జన్మల బారు.
పర్వతాగ్రము నెక్కి పదిలంబు గాను
తన బాటఁ బరికించుఁ దెరువరి రీతి
శృంగంబులను బెద్ద బండలఁ జుట్టి
మచ్చులై కనుపించు పొదలను దాటి
పాచి పట్టిన రొంపి నేలల దూరి
భయము పుట్టించెడి లోయలఁ గడచి
అడుగులు తడఁబడు నంచుల మీఱి
చెట్టు చేమలు మహా జలపాతములను
గుహాలను కొలకుల నధిగమించుచును
దూరాన గనుపించు నేలను జేరు
వంకర టింకర వచ్చిన దారి
తీరు తెన్నులఁ దిలకించెను ప్రభుఁడు.
నాతి శుభ్రంబైన దిగువ నేలలను
దాటి పైఁబోవంగఁ గాచుక యుండి
ఊత యాత్రికునకుఁ దగ నొసంగుచును
పైకిఁ గొంపోయెడి పది ధర్మములను
ఆ జ్యోతిలో గాంచె బుద్ధప్రభుఁడు.
పూర్వ జన్మల కర్మ ఫలముల నెట్లు

ఆ పైనిఁ గలిగెడు జన్మల జీవి,
-ముగియఁగా నొక్కటి మొదలిడ నొకటి-
లాభముం గుడుచుచుఁ బూడ్చి నష్టమును
తప్పక తానెటు లనుభవించెడినో;
మంచికి మంచియుఁ జెడ్డకుఁ జెడ్డ
ప్రతి జన్మ మందును కర్మకుఁ జెంద
మరణాంతమున వీని లెక్కలఁ దేల్చి
మరు జన్మలందెట్లు కానంగ నగునో
ఆయ వ్యయమ్ముల తీరు తెన్నులను;
గడచిన జన్మల వింత పోకడలు
తలఁపులు, బుద్ధులు, జయములు, స్మృతులు
వెనుక జన్మలలోన రూపొందు నెటులో
వాని పర్యవసానముల నెల్లఁ గనియె.
కడలేక లోతింత యనరాక యెప్డు
తగ్గక, నిలకడ యించుక లేక
చెలరేఁగు నలలతోఁ గల్లోల మగుచు
మారుపనెడి యాటు పోటుల తోడ
నలరారు నీలపు మున్నీటి లోన,
వెండి దీవులను బోలుచును ధారుణికి
బహు దూరమునఁ గ్రాలి లెక్కకు మీఱి
భిన్నత్వమున నుండి వేఱువేఱుగను,

ఏకత్వమును బొంది యొండొంటి తోడ,
అద్భుతంబుగఁ గతి దప్పక నడచు
లోకాల సూర్యుల రాసుల నెన్నొ
లో చూపులోఁ గాంచె బుద్ధప్రభుఁడు;
కనరాని కట్లతోఁ దమ లోకములను
కట్టడి జేసెడి కాంతిదేవతల,
గురుతర శోభతోఁ గడుఁ గొప్పవైన
వారల ననుసరించు ఊర్ధ్వ లోకముల,
ఒకదాని కొక్కటి తాకెడి రీతి
చైతన్య వంతమౌ కాంతి పుంజముల
విరజిమ్ము నక్షత్ర రాసుల మఱియు,
వలయాకృతులు గల్గి లెక్కకు మీఱు
తేజంబులను దిలకించెను గురుఁడు;
పుట్టుక మొదలుగాఁ గడలినిఁ గలియు
వఱకును గంగలోఁ గలయట్టి యిసుక
రేణువుల్ లెక్కింపఁ జాలెడు వాని
ఊహ కందని కాల పరిణామములను
కల్పంబులను మహాకల్ప గాథలను
సర్వంబు గనియెను వెల్గులో గురుఁడు;
ఇవియెల్ల దేనిచే వృద్ధిఁ జెందెడినొ
దేనిచే నివియెల్ల క్షీణించి చనునొ,

ఎద్దానిచే నివి తమ ధర్మములను
నెరవేర్చి క్రమముగా నాశనమగునో,
వాక్కున కందని వీని మర్మములు
ఆ యనంతంబగు నీలిమఁ గాంచె;
వాని వృత్తులకును లోకంబులకును
వాని తేజోమయ శక్తుల కవల
కనుపించకయ తన పని నెఱవేర్చు
అచలమగు నొక మహావిధిఁ గమనించె;
ఏశక్తి మహిమఁ దమస్సులో నుండి
జ్యోతి బయలుదేరు, జడతలో నుండి
చైతన్యము గలుగు, రూపమే లేని
దాని నుండి వెడలు రూపము మంచి
నుండి యుత్తమమును, దానిలో నుండి
అతి యుత్తమంబును, మాటలు లేని,
దేని శాసనమున నభివృద్ధి జెందు;
వలదు కానిమ్మని శాసింపఁ జాల
రెవ్వ రెద్దానిని. దేవతలెల్ల
కొలుతురు దేనిని, యలవిగా దెద్ది
యిట్టి దిట్టి దనుచు వర్ణింపఁ గాను,
అద్వితీయ, మచలమై యొప్పునెద్ది,
ఏశక్తి నిర్మించి నశియింప జేయు,

మఱల నిర్మించు నిత్యక్రీడ గాఁగ,
ప్రకృతి జగత్తును ననవరతంబు,
ఎయ్యది శాసించు నిల సమస్తమ్ము
తన ధర్మ చక్రానఁ దలఁగి పోకుండ
సచ్చిదానందంబు, గమనించె దాని.

శరణమా నేశక్తి యెల్ల ప్రాణులకు,
అనుసరింపఁగ దేనిఁ గలుగును మేలు
అడ్డగింపఁగ గల్గుఁ దప్పక కీడు,
చిన్నవి పెద్దవి యన్నియుఁ గూడ
పాటింపఁగా నగు జాతిధర్మముల;
డేగ తన్నుక పోయి కోడిపిల్లలను
గూటి పిల్లల కిడు నాహారముగను,
చీమలు పాములు దమపనిఁ జేయు.
మంచుబొట్టు వలెను మింటిపైఁ జుక్క
నిగనిగ మెఱయును సౌహార్దముననను
తమ నైజధర్మము దప్పిపోకుండ;
గిట్టఁగా బుట్టెడు ప్రతి మానవుఁడును
తనతోడి ప్రాణికి చిన్న పెద్దనక
తగినంత సేవను జేయఁగా వలయు,
అపకారమను మాట మఱపుకు రాగ

ఉపకార మెల్లప్పు డొనరింప వలయు,
నిర్దోషముగఁ దన జీవిక నడపి
మంచిగా మరణంబు నొందంగ వలయు.
వీని నెఱిఁగె స్వామి మధ్య యామమున,
వివిధ వర్గంబుల నైజ ధర్మముల
ప్రకృతి సిద్ధంబుల పరమావధులను.

నాలవ యామంబు దరియఁగాఁ దెలిసె
గురున కామూలము దుఃఖ మర్మంబు.
కంసాలి కుంపటి మంట నాపుచును
కలుష పదార్థంబు కాలెడి రీతి
పాపము కలుషిత పరచు ధర్మమును.
దుఃఖ కారణముల దెలియఁగా జేయు
వర సత్యములు స్వామి కగుపించె మొదట:
ఎచ్చట కేగిన నచట కేగుచును
జీవిని వెంటాడు వీడక పట్టు
నీడయుం బోలెను దుఃఖము కడకు;
పుట్టుట పెఱుగుట, నశియించి చనుట,
ఈసు నసూయయు సుఖము దుఃఖంబు
కలుగుట, చేయుట మొదలుగా నున్న
మార్పు లన్నిటి వీడి మడియు నందాక,

ఇవి మాయ యని యాత్మ నెఱుఁగు నందాక
ఈ కష్ట సుఖములు బాధయు వెఱపు,
మనలఁ దోలంగవు; మాయ, యవిద్య
యనువాని నెఱుకచేఁ దఱుము నందాక,
ఈ కట్టు లన్నియు విడివడి చనవు;
జ్ఞానోదయంబైన, సత్యంబుఁ గన్న,
అంతట నశియించు బ్రతుకుపై నాస
ముక్తి మార్గమున విముక్తిని బొందు.
అతి జాఁగరూకుఁడౌ యాతఁ డెఱుంగు
మాయ పుట్టించును 'శంఖార' మనెడి
సంకల్ప శక్తిని, అంత 'విన్నాణ'
మను శక్తి సృజియించు నామ రూపముల;
స్థానిక మైనట్టి యూరు పేరులను
ఒసఁగి వస్తువుల కింద్రియ బద్ధుఁడైన
నరు నొసరించును విషయ లంపటుగ;
హృదయ దర్పణమున విషయ జాలములు
పరుగులు వాఱంగ నసహాయుఁ డగుచు
సుఖమిది యని నమ్మి భ్రమపడి వాఁడు
కడు నిష్ఠురములైన కష్టాలఁ గుడుచు;
వేదన వర్ధిల్ల ఖేద మోదముల
దానఁ బుట్టును దృష్ణ, దగఁ దీర్పనెంచి

ఉబ్బును, గర్వంబు, కీర్తి ప్రాగ డ్త్ర,
విజయ మైశ్వర్యంబు, జాతిగర్వంబు,
ప్రేమయు, సౌఖ్యంబు, నాధిపత్యంబు,
ఇష్ట మృష్టాన్నముల్, వెలలేని నగలు,
సౌధ రాజంబులు, మొదలైన వాని
పొందంగ శ్రమపడి పాపము ల్జేసి,
వాని వలన గల్గు వేదన లనెడి
సంసార సాగర వీచికలఁ బడి
బ్రతుకు దప్పిని దీర్ప లోనయి భ్రమకు
ఉప్పు నీటిని ద్రాగ మఱిమఱిఁ గోరు;
దగ తీరునే యుప్పు నీటినిఁ ద్రాగ
రెండింత లగుఁగాక; జ్ఞానవంతుండు
భ్రమలతో బెంచక నింద్రియాదులను
శమ దమ మను గత్తితోఁ దెగఁగోసి
తృష్ణను ద్యజియించి వేదన నుడిపి
దృఢ చిత్తమున నుండి చేయక తప్పు-
కామింప కొక్కటి కోరక యొకటి
వెనుకఁ గావించిన పాప ఫలముల
అనుభవింపంగ దా నోపిక తోడ
శుష్కించి యవి యెల్ల సమసి పోవంగ
వీత రాగుండును నిష్కాముఁడగును.

జన్మ జన్మాలలో జేసిన 'కర్మ'
కాలము పేకగా కర్మ పడుగుగ
నేసి నిర్మించిన 'నేస'ను జీవి,
-బ్రహ్మాండమునఁ దన యునికి సారమ్ము-
పూతమై పరమ పవిత్రమై యలర,
బ్రతుకు భారము తగ్గి యంత కంతకును
తగు వర్తనము చేత సమసి పోవంగ,
దేహ గేహము తోడ గ్రామము తోడ
అవసరమే లేక వర్తిల్లు వాఁడు
ఈ విధంబున యాత్రఁ బూర్తి గావించి,
విషయ వాంఛనెల్లఁ బూర్తిగా వదలి,
శారీరకంబైన స్కంధము వీడి,
త్రెంచి బంధంబు, లుపాదులఁ ద్రుంచి,
భ్రమియించుఁ జక్రంపుఁ ద్రిప్పుల నాపి,
వదలి పోవఁగఁ జెడ్డ కల మేలు కాంచి
తెలివిని బొందెడు ధీరుని రీతి-
ఈ రోత బ్రతుకుపై నశియింప నాశ
త్యజియింప దేహము చైతన్య మంత
మెల్లఁగా బ్రవహించి చల్లఁగాఁ జేరు
-రాజాధిరాజులు దేవతాదులును
అందఁగా బొందఁగా జాలని మేటి-

ఇట్టిట్టి దని యెన్నఁగా రాని యట్టి
శాంతి సౌధంబు నానంద మందిరము,
అకలుష మకలంక మైన విశ్రాంతి,
మారుపు లేనట్టి గడసారి మార్పు,
శుభ దాయకం బైన నిర్వాణ పథము,
సచ్చితానంద సంధాయకం బైన
నిర్మలమా శాంతి నిత్య సంతృప్తి.

విజయంబు చేకూరఁ బుద్ధ ప్రభునికి
జ్ఞానోదయంబు గాఁ దెలిసి కాఁబోలు
తెలతెల వాఱెను తూరుపు దెసయు;
అరుదెంచె నద్భుతంబై యుష శ్శోభ;
ఆ శుభ దివసపుఁ దొలిసంజ తోప
రాతిరి కాంతతోఁ దాల్చిన నలుపు
ముసుఁగు ముత్తలు విడివడిఁ జాఱి పోయె.
వెలవెలఁ బాఱెను వేగుఁ జుక్కయును.
అరుణ కాంతులు కాంతి వంతములగుచు,
పైపయిం బర్వగా వెదజల్లి నట్లు
తన యరుణ ద్యుతుల్ పుడమిని దాకి
జగతిని తట్టి మేల్కొలుపక మున్నె
నీడ కొండల కతి దూరాన నుండి.

దినమణి గమనించె దచ్ఛుభ వేళ;
వేకువ తెమ్మెర వెచ్చగాఁ దగుల
లేత మూతల విచ్చెఁ బూవు లన్నియును,
సొగసరి వెలుతురు వడిఁ బరుగిడుచు
రాతిరి కన్నీటి బొట్టు లన్నిటిని
నవ్వ రత్నము లట్లు రాజిల్లఁ జేసె.
పచ్చని పచ్చిక నేలలఁ బర్వి
పుడమిఁ బొదలఁ జేసె ప్రజ్వలంబుగను.
నింగి యంచుల నుండు నంబుదాంచలము
బంగరు పూతతో రంగారఁ జేసె
తాటిచెట్ల తలల తళతళ నింపె.
పొనల జొంపంబుల వెలుగులు నింపి
పసిడి రుచుల తోడ మెఱపింపఁ జేసె,
మంత్ర దండంబునఁ దాకిన యట్లు
కెంపు టలల్వోలె రాణింపఁ జేసె
సెలయేటి తరగల; దారిలో గాంచి
మోహన లోచన సారంగములను
ఎండ వచ్చెను మేలుకొండని లేపె,
తమ గూండ్లలో ఱెక్కసందున మెడను
నిడుకొని నిదురించుఁ బులుఁగులఁ దాకి
ప్రొద్దు పొడిచెఁ బాడ లెండని తట్టె.

కిలకిలారవము లంతటఁ జెలరేగె.
కోయి లాలాపించెఁ గమ్మని గీతి.
బుల్బులి పాడెను 'మామా' యటంచు
మేలుకొలుపు పాడె రంగుల పక్షి
ఱెక్కల విదలించి వెలుఁగుల పులుఁగు
తుమ్మెద పువ్వులఁ బాయక మున్నె
తేనెఁ ద్రాగఁగ నేగె నుత్సాహి యగుచు,
కాకులు కూసెను, జిలుకలు వలికె.
గోర్వంక గలగల, కమ్మరి పక్షి
'టకటక' కడలేక కమ్మఁగా సాగె,
గువ్వల గుసగుస యట వినఁబడియె.
విజయంబు తోడుత విచ్చేసి నట్టి
ఉదయపు మాహాత్మ్య మెట్టిదో కాని
దగ్గఱ దూరాన నున్న గేహముల
నూతనమౌ శాంతి నిండి వ్యాపించె.
కత్తిని డాచెను కఱకు కసాయి,
తిరిగి యుంచెను దొంగ తీసినదాని,
తూకముఁ గోమటి తూచెఁ జక్కఁగను.
ఆనాటి ప్రాభాత దివ్యౌషధమున
దుష్టుల మనములు శిష్టత నొందె,
శిష్టుల మనములు శ్రేష్ఠతఁ గాంచె,

రాజులు ఘోర భండనముల నాపి
సంధిఁ జేసికొనిరి సౌహార్దమునను.
నవ్వుచు రోగులు నిలచిరి లేచి,
బహు దూరముననున్న దివ్యమహా నిధుల
లోనుండి వచ్చె నుషశ్శ్రీ యటంచు
బుద్ధి నెఱింగిన వారలు వోలె
చానున్న వారలు సంతోషపడిరి.
సిద్ధార్థు నెడఁబాసి విరహాగ్ని వేగి
పెనుచింతఁ బొగలు యశోధర కపుడు
వింత సంతోషంబు మది నాక్రమించె;
సత్ప్రేమ వృథయౌనె ఫలమింత లేక
ఘనచింత కడకైన నొందదే ముదము!
ఎటులేల కలిగెనో కనకున్న నేమి
అతి సమ్మదంబున జగతి యుప్పొంగె.
జనశూన్యమౌ పాడు బీడుల యందు
భూతముల్ ప్రేతముల్ మోదంబు తోడ
చెవులు చిల్లులుపోవఁ బాడిరి పాట;
బుద్ధత్వమును బొందె సిద్ధార్థుఁ డంచు
ముగిసెఁ దపంబని మురిసిరి సురలు,
అద్భుతం బొక్కఁడు కలిగె నేడంచు
నింగి నేలను బర్వ బంగారు రుచుల

కాంతుల వింతతో గాంచిరి ప్రజలు.
రాణాల నడవుల జీవు లన్నియును
నైజ వైరము మాని మైత్రితో మెలఁగె!
సింగంపు శ్రమ దీర్ప నేనుగు గున్న
చేట చెవుల వీచెఁ జల్లని గాలి,
పులి పాల నెచ్చోటఁ బిల్లల కొసఁగె
లేత పచ్చిక మేసె లేడి యచ్చోట,
బక జపములు నిజ జపములు గాఁగ
చెలరేగి చేపలు చెరలాట లాడె,
ఒకసారి యొకగుంటలో దిగి దప్పిఁ
దీరుచుకొనె మేక, చిఱుతయు, దుప్పి,
ఈకల గీరొకనె ముక్కుతో గాని
కన్నెత్తి కానదు డేగ యావేళ
నేలను నడయాడు చెవులపిల్లులను
పుల్లుపిల్లలఁ గప్పఁ గాలిమేపరుల,
పడగఁ బూర్తిగ విప్పి మెఱయఁగా మణులు
బుస లెగయఁగ ఫణి తాండవ మాడె
క్రూర దంష్ట్రల బైటి కగపడ నీక,
అందఱి కొఱకునై సాధించి నట్టి
ఘన విజయము తోడ నా తరుచ్ఛాయ
ఒక దివ్య తేజస్సు తన చుట్టు వెలుఁగ

పద్మాసనస్థుఁడై యుండఁగా బ్రభుఁడు
ఎంత యనంతమో యాతని కరుణ
పొంగి, పొరలి, వెల్లివిరిసి, నల్గడకు
పాఱి, ప్రాణుల నెల్ల వడి నావరించె
ఖగ మృగ పన్నగ నరుల వానరుల.
బలము సంతోషంబు తేజంబు దనర
లేచి నిలంబడి యా తరుచ్ఛాయ
సకల కాలంబులు సకల లోకములు
వినఁ దన గొంతెత్తి పలికె బుద్ధుండు: 1070

"అనేకజాతి సంగ్‌సారంగ్,
సంధావిస్సంగ్ అనిభిసంగ్,
గహకారకంగవెసంతో,
దుక్ఖాజాతి పునప్పునంగ్
సఖాతెఫాసుక్ఖా, ఖాభగ్గా,
గహకూటాగ్విసంగ్ఖటంగ్
విసంఖారగతంగ్ చిత్తంగ్
జఞాహోహనంఖాయమఝుగా."

"బహు దేహ గేహాల నివసించి యుంటి,
దుఃఖ మయేంద్రియ కారలో నుంటి;
వీనిఁ గావించిన నిను గనుఁగొనఁగ,
ఎడలేని పోరాటమును సలుపంగ,
కడకు నిర్మాతను నిను గనుగొంటి
ఈ బాధ కుడ్యాల నిఁక లేపలేవు,
క్రొత్త దంతుల నింక పఱచఁగా లేవు;
మోసపుఁ గప్పుల నిఁకఁ గప్పలేవు;
భ్రమ నిర్మితంబైన చట్రాయి పగిలె,
కర్మ నిర్మితమైన గేహంబు కూలె;
బయట పడితి నేను భద్రంబు గంటి,
ముక్తి మార్గంబును గడకు కన్గొంటి;



# సప్తమాధ్యాయము



చింతతోఁ గుందెను శుద్ధోధనుండు
ఇన్నాళ్లు పుత్త్రుండు గానంగరామి,
కను విను భాగ్యంబు కఱవౌట వలన;
సాధ్వి యశోధర చింతతోఁ బొగిలె
ఇన్నాళ్లు పెనిమిటి కానంగరామి,
విరహాగ్నిఁ గ్రాగెను విరహిణిఁ బోలె
తనస్వామి తనభర్త తనయొద్ద లేమి.

బేరసారములకై దూరదేశముల
కేగు వర్తకుల వార్తలు విని రాజు
దూతల బంపంగఁ బుత్త్రుని వెదక,
ఇల్లు వాకిలి వీడి సన్న్యాసి యైన
ఆయోగి యీయోగి వర్తమానముల
గొనివచ్చి వినిపింతు రేగాని వారు
రాజమూర్ధన్యుండు శాక్యవంశమణి,

కపిలవస్తు నగర కులదీపకుండు,
సాధ్వి యశోధర నోముల పంట
ఐన రాజకుమారుఁ డున్నాఁడో లేఁడో
ఎచ్చట నున్నాఁడో ఎటుల నున్నాఁడో
ఒక్క వార్తనైన వినిపింప రైరి.

ఆమని యరుదేరఁగా నొక్కనాడు
చిగురుటాకుల తోడ మామిళ్లు మెఱయ
జగతి యెల్ల వసంత శోభతో నవ్వ
నెలఁదోటఁలోఁ బాఱు సెలయేటి దరిని,
-పద్మపాత్రల నొప్పునే యేటి దరులు
ఏయేటి సంచల జ్జల దర్పణమున
కదిసిన పెదవులు, గీలించి నట్టి
కర కమలంబులు బింబించి చూపె
తమ ప్రేమమయ సుఖ జీవన చ్ఛాయ--
తోఁచక కూర్చుండె రాజకుమారి.
చిదిమిన పాల్గారు చెక్కుటద్దములు
మలినములై చిక్కె కన్నీటి కరల,
వెలవెలఁ బాఱెను గనురెప్ప లరయ,
మధు రాధరంబుల వంపుల సొంపు
వసివాడి వేధించు విరహాగ్నిఁ దెలిపె,

నెఱికురుల్ నిగనిగ కడు మాసి పోయె,
పెను దుఃఖమును హిమ పతనము వలన
ఆకులు రాల, శోభలు మాసి పోవ,
శూన్యమై కన్పట్టు పూఁదీవ వోలె
భూషణ హీనయై విధవ మాదిరిగ
శుద్ధ వస్త్రముఁ గప్పి చూడఁగా నొప్పె,
కమలిన కమలిని కరణి రాపుత్రి,
ప్రియుఁడు బిల్వగఁ మున్ను బరుఁగిడె నెవతె
పద్మ పాదంబుల వడి లేడి వలెను
నడువజాలక యీడ్చుకొని చిరుగాళ్ల
కదలలేక యిపుడు కదలుచునుండె.
వలపు బిలుపు లొల్కు వెలుఁగులో నాగ
రేఁజీఁకటులఁ ద్రోలు పగటి వెల్తురన
రుచుల నీను కనులు కాంతిని దొరఁగ,
పట్టు కన్రెప్పలు కన్నుల గ్రమ్మ,
క్రమ్మ వసంత శోభలఁ గనలేక
చూపులు గనిపించె శూన్యములగుచు.
ఏరాత్రి యాత్మఁడు తను వీడి చనియె
-కాళరాతిరి కష్టదినముల తల్లి,
ప్రాణాధికంబయి పరిఢవిల్లుటకు
దాక్షిణ్యమే లేక దయమాలె ప్రేమ-

ఆనాటి నుండియుఁ బ్రాణాధికముగ
దాచుకొన్నట్టి ముత్యాల మొల్త్రాడు
ఒకచేత ధరియించి, రెండవ కేల
దివ్య సుందరుడైన ముద్దుల బాలు
సిద్ధార్థ ప్రతిరూపు, సప్త వర్షముల
ప్రాయపు రాహులు నడిపించు చుండె.
వికసించుఁ బూవుల వింతైన రుచుల
ఋతుశోభ యొప్పఁగా డెందంబు బొంగ
ముదముతో బాలుండు గంతులు వైచె.
తామర కొలను దాపునఁ దల్లి బిడ్డ
తిరుగాడఁగా నిట్లు, చిఱుత రాహులుఁడు
శృంగార మైనట్టి రంగు చేపలను
తీయని యన్నపు మెతుకుల మేపె.
గబగబ యెగిరెడు కొంగలఁ గాంచి
ఆయమ్మ శోకానఁ దలపోసె నిట్లు:
"గగన యానము సేయు ఖచరంబులార!
కనరాని నాస్వామిఁ గనుగొన్న మీరు
నీచూపు, నీతాకు, నీపిల్పు, కొఱకు
కాచి, యెదురుజూచి, శుష్కించి, చిక్కి,
చెప్పరే నీదేవి చానున్న దనుచు"
అన్నట్లు వేడి నిట్టూర్పుల విడిచె.

తల్లి చింతిల్లుచు దనయుఁ డాడుచును
పొద్దిట్లు పుచ్చఁగా వడివడి వచ్చి
పరిచారికలు పల్కి రిటు దేవి తోడ:
"హస్తినాపురి నుండి గొప్ప వర్తకులు
పట్టణ దక్షిణ ద్వారంబు దాటి
లోనికి వచ్చిరి, త్రిపుష భల్లూక
నాములు, యోగ్యులు; దుర్లభమైన
అద్భుత వస్తువు ల్గొని తెచ్చినారు
దూర దేశంబుల దొరకు సరకుల,
బంగారు బొమ్మల రంగారుపట్టి
మేలైన వలువల, దంతపుఁ బనులు
పనితన మగుపడు కంచు గిన్నెలను;
అద్భుతంబుల కెల్ల నద్భుతం బగుచు
వీని నన్నిటినిఁ దన్ను నొక మంచి వార్త
గొని తెచ్చినారలు వినుము మాయమ్మ!
నీదొర మాఱేఁడు నేలకు నాస,
కనఁబడి నాడమ్మ! కనఁబడి నాఁడు!
ఎదు రెదురై మాటలాడి నారమ్మ!
కాళులఁ బడి మ్రొక్కి పూజించి రమ్మ!
మారినాఁడో యమ్మ మారినా డంట,
నీ ప్రాణనాథుండు మాకు ప్రభుండు

బుద్ధుఁడై పరమ పవిత్రుఁడై తాను
అనుకొన్న యట్లుగా గురుఁడాయెనంట,
మృదు మధురంబైన తన వాక్కు-చేత
నింగి నేలను నిండు దన కృప చేత
ప్రాణులఁ గాపాడి బుడమిఁ బ్రోచుచును
వచ్చునంట యిటకు వినవమ్మ తల్లి!"
అంత గంతులిడగ రుధిరంబు పొంగి,
మొదల మంచు కరుగ కొండల యందు
పొంగుచుఁ బాఱెడు గంగ పోలికను,
చప్పట్లు చఱచుచుఁ జంగున లేచి
నవ్వుచు నానందమున నశ్రులురల
పరవశయయి యశోధర పల్కె, "లెండు,
పొండు, వేగమ కొనిరండు, వారలను
నా యంతిపురి కీప్డై, యావార్త యనెడు
శీతల జలముల నాచెవి దప్పిఁ
దగ దీర్చుకొందును, కొనిరండు వేగ,
ఈ వార్త నిజమైన వారి సంచులను
ధనరాశిచే నింపి పంపుదు ననుఁడు,
మఱతునే మీమేలు నో చెలులార!
మంచి వార్తను వినుపించిన మీకు
తప్పక యిచ్చెద మేటి కానుకల."

పరిచారికలు జూడఁ బ్రక్క నిలఁబడి
బంగారు బాటల నడచి వర్తకులు
ఆస్థాన శోభల కచ్చెరువంది
చేరిరి లోనున్న భోగ మందిరము.
ఆసక్తితో గొంతు గాద్గద్య మొంద
తెఱ వెన్కగా నిల్చి యా రాజపుత్రి
మెత్తని కమ్మని యెలుఁగున నడిగె:
"దేశ దేశంబులఁ దిరిగి వచ్చితిరి
సజ్జన శ్రేష్ఠులు దెలుపుడు నాకు
కనుగొంటిరే మీరు నా ప్రాణనాథు,
బుద్ధత్వమును బొంది పుడమిఁ బ్రోవంగ
ఆ జగద్వంద్యుఁడు పరమ పూజ్యుండు
ప్రజలఁ గాపాడుచుఁ దన బోధచేత
ఇటకు రానున్నాఁడె, యిది నిజమైన
మా గృహ మిత్రులు ముఖ్యులు మీరు,
మీకు స్వాగతమయ్య వినుపింపు"డన్న,
వారిలో త్రిపుషుఁడు బదులిట్లు పలికె:
"కాంచితి మో రాజపుత్రి నీ పతిని,
కని, పాదములఁ బడి మ్రొక్కినామమ్మ.
యువరాజు కాదిప్డు రాజాధిరాజు
ఫల్గు తీరంబున నారావిక్రింద

విశ్వంబు నుద్ధరింపఁగఁ జాలు శక్తి
సాధించి బుద్ధుఁడై ప్రాణులన్నిటికి
సుఖమును శాంతియుఁ జేకూర్పఁ గాను
అమృత వాక్కుల ధర్మ మెఱిఁగించుఁ దల్లి!
దుఃఖజాలముల కతీతుఁడై నాఁడు
దేవతలకుఁ గూడ దుర్లభమైన
పదవిని సాధించి, దేదీప్య మైన
దివ్య కాంతులు బర్వఁ దనుచుట్టు నెపుడు
భద్రమ్ము నన విరాజిల్లు నీభర్త.
ఆ ధర్మబోధను గ్రోలెడి ప్రజలు
రాలి గాలికిఁ దోడ గొట్టుక వచ్చు
పండుటాకుల రీతి, పచ్చిక బీళ్ళ
నెఱిఁగిన మేపరితో వెంబడించు
గొఱ్ఱె మందల రీతి, తండోపతండ
ములుగాఁగ మూఁగుచు జేరుచున్నారు.
గయ దాపు నందలి చీర్ణికా వనము
లో ప్రభు ధర్మ బోధనము విన్నాము.
తొలకరి వానలు గురియక మున్నె
రానున్న వాఁడిటు" లన, విని దేవి
ఉబ్బి తబ్బిబ్బయి ఊపిరిరాక
కొంతవడికిఁ దేరి వారిని జూచి

"సకల కాలంబుల సౌఖ్యము మీకు
సమకూరుఁ గావుత స్నేహితులార!
కడు మంచి మాటలు వినిపించి నారు.
ఏగతి బుద్ధత్వ మందెనో ప్రభుఁడు
తెలిసినఁ దెలుపరే, వినఁ గుతూహలము
జనియించె నామది" ననఁగ, భల్లూకుఁ
డనువాఁడు తా విన్న గాథ నంతయును
వాక్రుచ్చె చవులూర వినువారలకును.
ఆరాత్రి జరిగిన భయదమౌ పోరు
మారుని రాకయు, వాని కోపాగ్ని
కాగఁజాలక జలము పొంగుటయును,
ధరణి కంపించుట మొదలైన వాని.
ఆ మరుసటి యుదయపు శోభ మీఱి
ఏరీతి జగతిని సంతోష పఱచె,
ఏరీతి బోధి వృక్షచ్ఛాయ ప్రభుఁడు
సచ్చిదానంద స్వరూపుఁడై నెగడె.
తర్వాత భల్లూకుఁ డిటు చెప్పసాగె:
"సందేహ సాగరముల నెల్ల నీది
పెనుగాలి కల్లోలముల నెల్లఁ గడచి
సత్య తీరంబును జేరిన ప్రభుని
మనమును ఘనమగు సందేహ మొకటి

బాధింప సాగెను, భ్రమపంజరమున
జిక్కి మానవ పక్షి చాలకాలంబు
అలవాటు పడి బైటఁ బడఁగోరదార!
తలుపు దెఱచియున్న లోనుండఁ గోరు,
కాయ కర్మంబుల బద్ధుఁడై జీవి
ఇంద్రియ చోరులు దను మోసగింప
విష విషయంబులన్ వలలలో జిక్కి
తప్పుకొనఁగఁ దగు బలమును దెలివి
లేమిచే దన్నుక కొట్టుక లాడు.
అట్టివాఁ డెట్టులు బదియును రెండు
పరమ నిధానాలఁ బాటింప గలఁడు,
కర్తవ్య మేమని తలఁచి బుద్ధుండు
మానియుండిన తన ధర్మబోధనము,
నిష్ఫలమై చన ఘన విజయంబు
దుఃఖ భారము మాన్ప దిక్కైన లేక
ధరణి శరణు లేక దారియు లేక
వగలఁ బొక్కు వలసియుండును గాదె!
ఈగతిఁ దలపోయ నా దయాశాలి,
పుడమి ప్రసవబాధ మూర్ఛనో నాగ
ఆర్తనాద మొకటి పర్వె నంతటను:
“నశ్యామ్యహం, భూ, నశ్యతిలోకః”

'నేను లోకంబులు నశియింప గలము.'
అంతటఁ గొంతసే పాగిన పిదప
గాలితోఁ దోఁచెంచె జాలి ప్రార్థనము:
'భగవంతుఁడా! వినిపింపు ధర్మంబు.'

అరుణ కిరణములఁ జొప్పింపఁ జేసి
సరసి జలంబుల విచ్చు పద్మముల,
పెరుగక లోనున్న మొగ్గలఁ గాంచు
లోకబాంధవు రీతి లోకబాంధవుఁడు
జాలిచూపుల నిలఁ జల్లగా జూచి
దివ్యమౌ దరహాసములు జిల్కఁ బలికె:
"బోధఁ గావించెద యోగ్యతఁ గల్గు
వారలు విని ధర్మ మాచరింపంగ."
వైశాఖ శుద్ధ పూర్ణిమ నిది జరిగె.
తరువాత నో దేవి! బుద్ధప్రభుండు
కొండ గుట్టల దాటి, వారణావతము
చేరి, శిష్యులఁ గాంచి, వా రైదుగురికి
తెలిపె ధర్మంబును దానిక్రమంబు:
వెనుకఁ జేసిన కర్మ ఫలితము ల్దక్క
వేఱుగ దుర్విధి యేవిధి లేదో,
నరక నాకము లెట్లు మన కల్పితములో,

అంతరింపఁగ నెట్లు రాగ కామములు
చావుఁ బుట్టుక లెట్లు సమసి పోఁగలవో;
పదియు నైదవ నాడు వైశాఖ మందు
మిట్ట మధ్యాహ్నన నిది సంభవించె.
రాకుమారి! మొదట కౌండిన్యకుండు,
బసవ మహానామ భద్ర కాశ్వజితు
లనువారు పిమ్మట, దీక్ష గైకొనిరి
సారనాథంబున మృగ వనమందు.
యశదుఁ డనెడు రాజు విని ధర్మబోధ
ఏబది నలుగురు రాజబంధువులు,
తాను బుద్ధప్రభునిఁ బూజనల్పి,
ఆ దేవు నడుగు జాడలఁ బట్టిచనిరి.
ఇసుక పఱ్ఱల యందు నెగయంగ గంగ
లేత పచ్చిక పట్టె లతలు పుష్పములు
వికసించు చాద్పున, వాక్సుధా రసము
వినువారి మనములఁ బడి పాఱినంత
వింత వసంతము శోభిల్లుఁ దల్లి!
శమ దమంబులు గల్గి సంయము లైన
అఱువదిమంది శిష్యుల, ధర్మబోధఁ
గావింపఁ బుత్తెంచి బుద్ధప్రభుండు,
మృగవనమును వీడి, విను రాజపుత్రి!

ఇసిపతనంబును 'యష్టి'ని దాటి
బింబిసారుని రాజ్యమును బ్రవేశించి
ధర్మబోధన సేయఁ బలు తావులందు,
బింబిసారుఁడు విని వాని బోధనము
తానును దనప్రజ బుద్ధుని శరణు
జొచ్చిరి; భక్తితో నిచ్చెను రాజు
గురువరునకు "వేలు"వనమును పేప
తోఁటను; సెలయేళ్లు గుహలును మఱియు
సొంపైన బయళులు సొంపారు చోట
స్తూపము నిర్మించి చెక్కించె నిటుల:
"పెంచి పోషించును బ్రాణము నెద్ది
దాని నెఱుక పఱచెఁ దథాగతుండు.
దుఃఖము లోప్రకార్చి కాపాడు నెద్ది
తెలియఁ బలికెఁ దాని బుద్ధప్రభుండు."
ఒక్క మహాసభ జరిగె నచ్చోట
గురువరు వాగమృతంబును గ్రోల
డెంద మానందము తోడ నుప్పొంగ
తొమ్మిది వందల మంది సంఘంబు
శరణని చేరిరి భిక్షువు ల్గాగ,
ధర్మ ప్రచారంబుఁ గావింపఁ గాను.
గురుడిటు ముగియించె నా ప్రబోధంబు.

"కీడు కొండంతగా బెంచును ఋణము
వెడలించి విడిపించు మన మంచితనము
చిత్తవృత్తి నిలుపఁ దెలియుఁ దత్త్వమ్ము
తనకుఁ దా దొరయాట బుద్ధుశాసనము"

తననాథుఁ గీర్తింప వర్తకు లిట్లు
ఆ మాటల కలరి యా రాజపుత్రి
వెలలేని కానుక లిచ్చి వారలకు,
ఏదారి నేతెంచు నా ప్రాణనాథుఁ
డెఱిగింపుఁ డని యడ్గ వార లిట్లనిరి:
"అరువది యోజనములు దూర మిటకు
రాజగృహము; మేము దగ్గర దారి
నొకదిన మెనిమిది క్రోసులనడచి,
'శోణా'నదిని దాటి, కొండలఁ గడచి
పదునైదు దినముల కిటకుఁ జేరితిమి."
ఈ వార్తలను విని శుద్ధోధనుండు
ఆస్థాన పెద్దల కడు సమర్థులను
వేయు వేయుగఁ బంపెఁ దొమ్మండుగురను
తన మాట లిటు చెప్పి కొనిరాఁగఁ బట్టి.
"ఏడేండ్లుగా నిన్ను వెఁకియు తుదకు
కనలేక వేసారి ముదుసలి తండ్రి

మరణశయ్యను జిక్కి శల్యమై యుండె,
చావక మున్నె నీ మోము జూడంగ
నీదైన రాజ్యంబుఁ బ్రజల నేలగను
జాగుసేయక నిన్ను రమ్మని కోరు"
సాధ్వి యశోధర తొమ్మండుగురను
గుఱ్ఱపు రౌతుల వడిఁవడిఁ బంపె
తన భర్తతో నిట్లు తన మాటఁ దెల్ప:
"నీ రాణి, యిల్లాలు, రాహులుతల్లి
కలువ కన్నియయు, జీవంజీవ మెట్లు
జాబిల్లి రాకను దా మదిఁ గోరు,
పాలినట్టి యశోక వృక్షము పూయ
పైదలి పద తాడనము లెట్లు గోరు,
అటుల సందర్శింప నిను సతి గోరు,
పోయిన దానికి మిన్నయే యైన
పొందినయది, దానఁ బాలుఁ గొనంగ
ప్రేయసి పుత్త్రుండు మఱిమఱి గోరు.
ముఖ్యము నీరాక ముందు గోరుదురు."
సందేశమును గొని శాక్యనాయకులు
వడివడి నరుగఁగ గుఱ్ఱాల నెక్కి,
వేప తోఁటను జేర నా సమయమున
ధర్మబోధనఁ జేయుచుండె బుద్ధుండు.

తేనె యున్కి దెలుపు మందమారుతము
కమ్మని వాసనల్ విరజిమ్మ గాను,
ఝుమ్మని బఱతెంచి గండు తుమ్మెదలు
ఎండవాన యనక రాతిరి నాక
పూవులపై వ్రాలి కమ్మ దేనియల
కుత్తుక బంటిగాఁ దెగత్రాగ గోరు
నేగాని యన్యంబు నెఱుఁగని రీతి,
అచ్చటి వారలు వచ్చిన వారు
వచ్చిన పనిమాని, సతి గతినైన
చెప్పఁగా మరచియుఁ, జెవులఁ గన్నులను
చిత్తము సర్వము నెదుటఁ గన్పించు
ప్రభున కర్పించియుఁ జేష్టలు దక్కి,
అధర బింబము నుండి వెలువడు నట్టి
మధురామృతము కడుపారంగ గ్రోలి,
త్రావి యొకరివెన్క నొక్కరు గాగ
అందఱు జేరిరి సంఘమ్ము నందు.
వారి రాకకు వేచి వేచియు రాజు
ఆస్థానమున గల వారి కందరికి
మేటి, విశ్వాసియు, చిఱుత ప్రాయమున
సిద్ధార్థునకు సహపాఠి, మిత్రుండు
"ఉదయి" పేరిటి వాని నట బంపె, నంత

వనముఁ జేరఁగఁ బోయి మెలకువ వాఁడు
అచటి ప్రమాదంబు దప్పుకో నెంచి
పత్తిదూదిని జొన్పి చెవుల బిలముల
వినఁబడ నట్లుగా గట్టిగా మూసి
స్వామి సన్నిధిఁ జేరి సాష్టాంగమైన
దండప్రణామంబుఁ దగ నాచరించి,
తనసతి దనతండ్రి సందేశములను
గురువరునకు నెఱిగింప, నాతండు
విని వినయము తోడఁ దన తలవంచి
అచటి వారలు విన నిటుబల్కె ప్రభుఁడు:
"యెవ్వార లిచ్చిరి తను జీవములను
నిర్వాణమును బొందఁ దగు సాధనముల
వారల నందఱు దప్ప కెప్పుడును
అడకువఁ బూజలఁ గడు భక్తిఁజేసి
గౌరవింప వలయుఁ గాపాడ వలయు.
ఇదియ నా ధర్మము నా కోర్కె యిదియ;
కావున బోయెద వడి వారిఁజేర.
చెలికాడ! వెసఁబొమ్ము తండ్రికిఁ జెలికి
సంకల్పమును దెల్పు సత్వరంబుగను."

కపిలవస్తు నగరవాసు లీవార్త

విని యిచ్చి, పోయిన ధనరాశిఁ గన్న
పేద చందంబునఁ, గడు ముదమంది
పూజనీయుని కెడ సుస్వాగతంబు
సన్నాహములు సేయ సమకట్టి రపుడు;
దక్షిణ ద్వారానఁ బెద్దపందిరిని
గట్టి గుంజల కెల్ల బువ్వాలు జుట్టి
పట్టుగోడకుఁ బెట్టి రంగు పట్టెలను
బంగారు తళుకుల జలతారు తోడ
సొగసులఁ సొబగులఁ గూర్చి రందముగ.
వాసన లీనెడు వేప రెమ్మలను
మెఱసెడి మామిడి మండల తోడ
పచ్చతోరణముల, చిన్న పందిళ్ళ,
వీధుల నచ్చ టచ్చటను నిర్మించి,
నిలపిరి జెండాల వృక్షాగ్రములను.
అగరు గంధంబు లత్తరులను గల్పి
పన్నీరుఁ జిల్కరి బాటలయందు,
ప్రభుఁడు పురప్రవేశము సేయు వేళ
బంగారు తోడాల నొప్పు దంతముల
వెండి హౌదాల్గల భద్రగజములు
ఎచ్చు టెచ్చట నెన్ని యుండఁగా వలెనో,
ఫకడ్ గుమిక్కూడి యాటవెలఁదులు

పూలఁ జల్లవలెనో పాడియాడుచును
భేరి శబ్దం బెప్డు వినిపింప వలెనో,
జరుగ వలసినట్టి వివరాల నన్ని
ముందు జాగ్రత్తతో సరిఁజూచు కొనిరి.
ఆనందమున నిటు లాపుర ప్రజలు
ఎపుడు విన్పించునో ఢంకాల మ్రోఁత
ఎపుడు కన్పించునో మన భావినేత
అని కడు కౌతూహలము తోడ నుండ.

సాధ్వి యశోధర యందఱి కంటె
ముందుగా బోఁగోరి పల్లకి నెక్కి
దక్షిణమున నున్న స్వాగతశాల
జేరగాఁ జనె, దారి కొకవంకఁ గలదు
న్యగ్రోధ నామక సుందర వనము;
కఱలలో సాలుగ గొబ్బురి తాటి
మారేడు మొదలైన ప్రూనులు తనర,
వంపు సొంపుల త్రోవ కిరుగడ లందు
ఫలపుష్ప తరువులు విలసిల్లు చుండు.
ఆబాట కొకప్రక్క గుడిసెల తోడ
ఊరి బయట నుండు నొక మాలవాడ-
అంటరాని జనము నివసించువాడ.

పనిపాట జేసేడు పేదయు బిక్క-
వినిరి బుద్ధుని రాక కడు సంబరమున.
సున్నపు తేటతోఁ బూతను బూసి
ఎఱ్ఱమన్నను గల్పి పట్టెలు బెట్టి
సున్నగా నలికియు, మ్రుగ్గులు వెట్టి
తోరణంబులు గట్టి దండలు గూర్చి
రంగుల జెండాల జెట్లపై నిలిపి
వారి వాకిళ్లను వాడ నంతయును
చేసిరి సింగారమును శుభ్రపఱచి.
బడిగంట, గుడిగంట, మెడలలో గంట
వినఁబడ భ్రమపడి వచ్చెఁ గురుఁడని
ఇళ్లెక్కి, చెట్లెక్కి నిక్కి చూచెదరు
ఆవంక; కలరూపు కనుగొని యంత
పాటలు బాడుచు గురుని గీర్తించి
తమపను లన్నిటిఁ జక్కఁ బెట్టుచును
ఆదారి నేగెడు బాటసారులను
గురుని జాడను దెల్ప నడుగుచునుండ;
తూలి పాలిన సోగ కన్నుల తోడ
నివియెల్లఁ జూచుచు నా రాజపుత్రి
వారి వలెను తాను దారిఁ గాచుచును
వచ్చి పోయెడి వారి నడుగుచు నుండి,

తనపతిజాడను, తిరిగి చూడంగ
కనఁబడె నెదురుగా నాతి దూరమున
మెల్లఁగా వచ్చెడు నొక్క సన్న్యాసి.
నిగనిగ మెఱయఁగఁ దన బోడిగుండు
వంగపండును బోలు వలువలఁ దాల్చి
పెద్ద నిమ్మను బోలు తనచేత నున్న
బిచ్చపు టటికను మచ్చికఁ జాచి
గడప గడప యందు బిచ్చముఁ గొంచు
ధన్యవాదము దెల్పి యిచ్చు వారలకు
తనుబోలు వార లిద్దఱు వెంట నడువ
డగ్గఱు చుండెను సాధు పుంగవుండు.
ఆ మూర్తి సౌందర్య మెట్టిదో కాని
ఆ నేత్రముల లోని మాహాత్మ్య మేమొ
గంభీర గమన సౌందర్య మెట్టిదియొ
బిచ్చము వేయఁగ వచ్చిన వారు
నివ్వెఱఁ బోయిరి వదనము గాంచి,
పాదాల పైఁబడి చేసిరి పూజ,
చేతుల నేమియు లేనట్టి వారు
ఏదేని దెచ్చుటకై వేగఁ జనిరి,
పిన్నలు పెద్దలు పురుషులు స్త్రీలు
గుంపులుగా జేరి వెంట నేగుచును

ఎవ్వరో యీతఁడు మన మెన్నడైన
కంటిమే యిటువంటి సాధు సజ్జనుని
అని, పెదవుల కడ్డముగఁ బెట్టి వ్రేళ్ళు
తిన్నఁగా గుసగుస లాడుచు జనిరి.
అడుగు దీసి యడుగు మెల్లఁగా నిడుచు
తొణకక కరిరాజు కరణిని ప్రభుఁడు
పల్లకీఁ జేరఁగా, దెఱఁ దొలగించి
తొంగి చూడఁగ లోని రాజకుమారి
ఏమని చెప్పుదు నాశ్చర్య మహహా,!
పత్యక్షముగఁ దన ప్రాణ నాథుండు
కనుపింప నెదురుగా కెవ్వున నఱచి
చూపులోపింపఁగా గ్రమ్ము కన్నీట
దడియాఱ గొంతుక యెలుఁగు రాపడఁగ
హాప్రియ! సిద్ధార్థ! యంచు వాపోయి
ఉబుకు భావంబును నదిమి పట్టగనో
కరతలంబులఁ జేర్చి గట్టిగా బట్టి
పాదాల పైఁబడి కదలక యుండె.

తనసతి సంఘంబుఁ జేరిన పిదప
తన్ను బ్రశ్నించిరి శిష్యు లీరీతి-
"సర్వ రాగంబుల సమయించి నట్టి
నీవేల కోమలి కోమ లాంగముల

తాక నిచ్చి" తనఁ, బ్రభుఁడిట్లు పలికెః
"తిన్నఁగా బైపైకిఁ గొనిపోవ నూత
స్వల్పమౌ ప్రేమ కగ్గలపుఁ బ్రేమంబు,
ముక్తి నొందిన వాఁడు మొనగాఁడ నంచు
మురియఁగా రాదయ్య, బద్ధులౌ వారి
పరిహాస మొనరించి పలుక రాదయ్య,
పరుల కోపిక తోడ బోధింప వలయు
నేరుపుతో నెఱిఁగింపఁగా వలయు
అప్పుడే ధన్యత నొందుఁ జ్ఞానమ్ము.
ముందు యుగంబులఁ గృషిఁజేసి చేసి
జగతిఁ గాపాడంగ, జూపంగ దారి
బోధిసత్త్వులు పృథ్విఁ జేరవచ్చెదరు
"కృతనిశ్చయత" వానిలో ప్రథమంబు;
రెండవ యది 'కృషి,' మూఁడు 'వరణంబు.'
'కృతనిశ్చయత' యను యుగమున నేను
మంచిని గోరుచు జ్ఞానము వడయ
సాధన సలుప వెల్గుపడ దయ్యె.
ఆ చెట్టు నందాపు లెన్ని యన్నేండ్ల
క్రిందట నే రాముఁడను పేరమంటి
ఉదధి తీరంబున నొక పల్లెయందు;
లక్ష్మి యనఁ లలితాంగి పేరునఁ బరఁగి

ఈ యశోధర చేసె నాకుఁ గాపురము.
మా పేదతనమును బాపఁగా నెంచి
ధనము సంపాదింప నేఁ బోవనున్న
యిప్పటి వలె సతి యేడ్చుచు వచ్చి
"యిలు వీడ వలవదు వలదు, సాహసము
ప్రేయసి నెడబాసి ప్రియుఁడు పోఁగలఁడె"
అను జాలి మాటలఁ బెడచెవిఁ బెట్టి
చని, సాహసంబున లంక తీరమున
ఒక యగాధపుఁ జోట దూకి ధైర్యమున
నడికి రే యైనను మధ్యాహ్న మైన
విసువక, వీడక పట్టిన పట్టు
జల జంతువుల తోడఁ బోరి ఘోరముగ
కడుఁ గష్టపడి పట్టుకొంటిని కడకు
జాజ్వల్యమానమై చందురుఁ బోలు
వెలలేని దొరకని యాణి ముత్తెమును.
మొలఁబెట్టి దానిని కడు సంతసమున
దేశముఁ జేరఁగాఁ జన, నకటకట!
కాటక మచ్చట వ్యాపించి యుండె,
"అన్నమో రామచంద్రా!" యంచుఁ బ్రజలు
అల్లాడు చుండిరి, యలసియు సొలసి
చావుతప్పి కనులు లొట్ట పోవంగ

ఎట్టులో జేరంగ నింటికి నేను
ఏమని చెప్పుదు? దేనికై నేను
ఎవ్వతె సంతోష పఱుపఁగాఁ గోరి
ఇంత కష్టపడితి, నట్టి నా లక్ష్మి
కొన యూపి రల్లాడఁ జావ సిద్ధముగ
వాకిటఁ బడియుండెఁ దిన తిండి లేక.
దాని యవస్థను గని యాఁగలేక
'బదులిచ్చి రాజ్యము గ్గొనఁజాలు నట్టి
సాటియే లేనట్టి మేటి ముత్తెమును
గొని యివ్వరే కొన్ని గింజల నాకు
బ్రతుకు నిలుప' నంచు నఱవ బిగ్గఱగ
కడకు మిగిలినట్టి జొన్న గింజలను
మూఁడు సేర్ల నొకఁడు గొనివచ్చి యిచ్చి
ముద్దుల ముత్తెము వడిఁ గొనిపోయె.
అంతట లక్ష్మికి యాహార మిడఁగ
పోయిన ప్రాణము వచ్చిన పగిది
కొంత కుదుటఁబడి మెల్లఁగ లక్ష్మి
"నాయందు నీప్రేమ నిశ్చల మనియె."
ఆ జీవితంబున నితర సౌఖ్యముల
పొందక పోయిన ముద్దు ముత్తెమును
ఒక జీవి నలరింప నిలుపఁ బ్రాణముల

వాడితి బాగుగ ఫలవంతముగను.

ఇంకను లోతైన లోతుల నుండి
కడసారి తెచ్చితి నిర్మల మణుల
పరమ ధర్మంబును బన్నెండు నిధుల.
వన్నె దఱుంగవు, తఱుఁగ వెన్నటికి,
ఈయంగ నీయంగ మెఱుగులు దీఱు,
పంచంగఁ బంచంగఁ బెంపును జెందు.
వాని చక్కదనము వాని వెలుంగు
చరమావధిని జెందు సఫలతఁ గాంచు
విశ్వంబు వ్యాపించి విస్తరిల్లంగ.
చీమ పుట్టకు మేరు పర్వతంబునకు
మంచు బొట్టునకును సాగరంబునకు
కలదెంత యంతరం బంత బేధంబు
ఈ మణి గణమున కా ముత్తెమునకు.
భవ బంధముల ఢుల్చి విడివడి నట్టి
విపులమౌ ప్రేమకు నెంతయు నొప్పు
పెఱ జీవులకు దగుఁ జేయూత నొసఁగ.
తరుణి యశోధర తగు నూత నొంది
మెట్టొక్క టొక్కటి మెల్లఁగా నెక్కి
కాంచెను ముక్తిని పొందెను శాంతి.

బైరాగి వలెఁ దలఁ బోడిగా గొఱిగి
ముష్టింపచుని రీతి ముడిగుడ్డఁ గట్టి
బొచ్చెను జేఁబూని హీనజాతులను
బిచ్చ మడిగి కొంచు మిగులు మెతుకుల,
వచ్చెఁ దనయుఁ డని విని వృద్ధరాజు
శోకంబు కోపంబు పెనఁగొన మదిని
పుత్త్రి మోహంబును, వెడలంగఁ ద్రోచి
కేకరించి యుమిచి ఔడును గఱచి
కడు మండిపడి పండ్లు పటపట గొఱికి,
వణకుచు నాస్థాన నాయకు లెల్ల
వెనువెంట నరుదేరఁ, జంగున నెగిరి,
అశ్వంబుపై నెక్కి యదలింప నదియు
కుప్పించి యెగయుచు వాయు వేగమున
—విభ్రమతో జను ల్వెచ్చె రాజంచు
వడి వంగి తప్పించుకొని దారి నొసఁగ—
క్షణములో దక్షిణ ద్వారంబుఁ జేర;
ఎదురుగా వీధులు సందులు నిండి
ఇసుక రాలని యట్లు మూక క్రిక్కిరిసి
తనుజుట్టి కొలువఁగా గురు వరుదేర
వృద్ధరాజుని రూక్ష వీక్షణంబులను
తనయుని చల్లని చూపులు కలసె.

మెల్లఁగ మొగమెత్తి చల్లని కనుల
పరికింపఁ బుత్త్రుండు పూజ్య భావమున
కొండంత కోపంబు జూచుచుండఁగనె
మంచు గడ్డయుఁ బోలె మటుమాయ మాయె.
దిగజాఱి డెందంబు క్రిందికి జాఱి
రాజఋషి మెఱయ భువి మోకరిల్లి,
రాచ కళను మించు దివ్య తేజస్సు
మోముఁజుట్టి వెలుఁగ దేదీప్యముగను
భక్తితో నడుగులఁ బడఁజూచు వాని
దివ్య మంగళ విగ్రహుండైన వాని
మోహన మూర్తిని గని మోహమునను,
ఐన, కానిమ్మని యిట్టులఁ బలికె:
"కడకిటు లైతివే నాకన్న తండ్రి!
కనుసన్న మెలఁగఁగా రాజులు ప్రజలు
కానుక లర్పింప వెలలేని వెన్నొ
వారసుండ వగుచు నీ సువిశాల
సామ్రాజ్యమున కెల్ల సపరివారముగ
చతురంగ బలములు తోడ నేతేర
నిండు వైభవమున రాకుండ నిట్లు
బయిసి మాలిన యట్టి బైరాగి వగుచు
కావి కుబుస మూని తలఁ బోడి చేసి

బిచ్చ మెత్తుకొనుచు బ్రతుకు గడపుచు
తుదకిట్లు వత్తువే యో శాక్యసింహా!
ఇటుఁజూడు మిదె నాదు సర్వ సైన్యములు,
అటుజూడు మదె పురిలోగల జనులు
స్వాగతంబు వచింప నాహ్వాన మిడఁగ
కాచి యున్నారిదె కడు సంతసమున.
యెచ్చోట నున్నాఁడ వేండ్లను బూండ్లు,
పాపిష్టి కాలంబుఁ గడపితి వెళ్లు,
శోకాగ్ని ననుద్రోసి యేకాకిఁ జేసి,
విరహాగ్నిఁ బడద్రోసి సతి నెడబాసి.
అటు దిలకింపుమా! యా సన్నుతాంగి
నా కూర్మి కోడలు పతిఁ జూచు వేడ్క
నిలువెల్ల కైసేసి నినుజూడ రాఁగ
యీ రూప మేమయ్యా, యీ గుడ్డ లేమి?”
“మాజాతి చిహ్నముల్ ననుఁగన్న తండ్రి.”
“మనజాతి యుడుపులా! తరతరములుగ
ఈపనిఁ జేయరు మనపూర్వు లొకరు.”
“మనజాతి వార్గారు, మానవు ల్గారు
యుగ యుగంబులఁ బృథ్విఁ బ్రోవఁగా వచ్చు
బోధిసత్వుల జాతి సంతతి వాఁడ,
వారు చేయు పనులఁ జేయంగలాఁడ.

గడచిన యుగమున నిచ్చటఁ జరిగె
ఈ ద్వారమందున వైచిత్ర్య మిట్లె,
రాజాధి రాజైన తనుఁగన్న తండ్రిఁ,
_నవనిలో నధికారముల నెల్లమించు
ప్రేమ సంయమములఁ బూర్తిగా బొంది_
పుత్త్రుఁడు బుద్ధుఁడై ప్రణమిల్లెఁ గలసి;
ఆరీతిఁ జేసెద నభివాదనమ్ము,
చెల్లింపఁ దెచ్చితి నీదుఋణమ్ము,
వెలలేని మణులను వేగ గైకొమ్ము!"
"ధనరాశి యదియేమి తనయుఁడ" యంచు
విస్మితుఁడై పల్కు తనతండ్రి కరము
తిన్నఁగా నిడుకొని నిజ కరంబునను
చకితులై జనులెల్లఁ దన్నుఁ బూజింప,
మెల్లగా నడచుచు వీధి నెంబడిని
తెలిపె ధర్మంబును దండ్రి కీరీతి:
స్వచ్ఛమౌ శాంతిని సముపార్చఁ జాలి
కడలేని విజ్ఞాన మను కడలికిని
చెలియలి కట్టలై చెన్నారు నట్టి
వర చతుష్కంబులఁ బరమ సత్యముల;
పిన్నలు పెద్దలు పురుషులు స్త్రీలు
పండిత పామరుల్ ప్రభులు సేవకులు

పాటింపఁగా వేచి నియమము తోడ
అందఱు తప్పక ముందు వెనుకగ
నిర్వాణ పథమును నొందంగఁ గలరో,
నీతు లెన్మిదియును నాలుగు దశలు
గలిగిన ధర్మ మార్గముల నెన్మిదిటిఁ
దెలుపఁగాఁ దివ్యాని మాటల గురువు
వాక్సుధారసమును మనమారఁ గ్రోలి
తనయు భిక్షాపాత్రఁ దన కేలఁ గొంచు
ముదమునఁ దోడ శుద్ధోదనుఁ డరిగె.
కందోయి దీపింప నొక క్రొత్త వెలుఁగు,
కన్నీటి నింకింప నొక వింత కాంతి,
ఆనంద భరిత యశోదర యేఁగె.
అట్లు వారలు జేరి రాజ ద్వారంబు
ఆరేయిఁ జొచ్చిరి శాంతి పథమ్ము.

తాను బుద్ధత్వంబు నొందిన పిదప
నిముసంబు నేనియు జాగు సేయకనె
తల్లిని స్మరియించి తక్షణ మందె
నాకంబునకు నేగి యమ్మకు మ్రొక్కి,
తాఁ గనుఁగొన్నట్టి ధర్మ మార్గమును
సత్య స్వరూపంబుఁ దెలియఁగాఁ జూపి

తల్లి ఋణముఁ దీర్చుకొనియె బుద్ధుండు.
ఆదర్శ మూర్తుల వర్తన లిట్లు
ప్రాచీన చరితంబులం గానవచ్చు.



# అష్టాధ్యాయము



గలగల ప్రవహించు "శోహాన" తటిని
నగరంబు దాపున మైదాన మొండు
కడు విశాలంబయి కనఁబడుచుండు.
కాశికా పురికి వాయవ్య దిక్కునను
బండిలో బో నైదు నాళులు పట్టు.
హిమవంతు శృంగంబు లెదుటఁ గన్పట్టు
నిగనిగ మెఱసెడి సెలయేటి నీట,
పచ్చనితోఁటల బుష్ప గుచ్ఛముల,
కమ్మని చల్లని నీడల నీను
నిశ్శబ్ద రమణీయ మృదుల సానువుల
పరివృతంబయి ముచ్చటను గొల్పుచుండు.
అప్పటి నుండియు నీనాటి వఱకు
పరమ పవిత్రము పూత మాచోటు.
అల్లిబిల్లిగ నల్లుకొన్నట్టి పొదల,

అట్టిట్టు తూగు నాకలముల మాటు
వ్రేళులు వాఱంగ బీటలు వాఱి,
గోచరింపఁగ లేద పుర శిథిలములు
మాసిన ఫలకముల్ మలచిన ఱాళ్ళు;
మాపులు మూఁగపోయిన రీతిఁ దోచు.
గంధపు దూలాల శిథిలంబు లైన
తీర్చిన శిల్పంబు లవె కనుఁ గొనుము.
నిగనిగ లాడెడి కదలని పాము
లోతైన మలుపులఁ జుట్టను బెట్టె,
రాజులు నడచిన చలువఱా నేల
పఱుఁగిడు నల్లదె నటునిటు బల్లి,
పగిలిన రాజపీఠంబుల నడుమ
నడయాడు నిర్లక్ష్యముగ నదె నక్క,
రక్తసిక్తము లైన యడుగు లగుపడ
మెలఁగెడు నదె చూడు పులియు సింగంబు,
జలకేళి జలజాక్షు లాడిన నీట
కొలకులఁ గనుమదె పచ్చని పాచి;
ఆ పర్వతాగ్రంబు లా సెలయేళ్ళు,
ఆ పచ్చ లోయ లా మలయానిలంబు
అయ్యవియే మాఱి కచ్చట నిలచె,
జీవితాడంబర వేషాల వలెను.

ఇతరము లన్నియు సంత రింపంగ;
ఇచ్చోట వెలసె మున్ సిద్ధార్థ నగరు
ఈ గుట్టపై సంజ కెంజాయ వేళ
బుద్ధుండు గూర్చుండె బోధింపఁ గాను
తనవారి కెల్లను ధర్మ మార్గమును-

ప్రాచీన గ్రంథాల నిటు వ్రాయఁ బడియె:—
ఏచోట వెలసె మున్ రాజ సౌధములు,
రంగారు మేడలు పచ్చికబీళ్లు
పూఁదీవ లల్లిన మండపంబులును
పూవుల బాటలు చలువ పందిళ్ళు,
చక్కని సరసులు సెలయేళ్ళు గిరులు,
ఆ విహారపు దోఁట నానాఁడు ప్రభుఁడు
అందఱికిని మిన్న యారాధ్య గురుఁడు
పద్మాసనస్థుఁడై పలుకఁగాఁ దొడఁగె.
కౌతూహలంబున మూఁగిన జనులు
ఏమి వచ్చునో నోట వినవలె ననుచు
ఉవ్విళు లూరుచు నుండి రుత్కంఠ;
ఆ బోధ సుధ కాదె జ్యోతియై ప్రబలి
ఆసియా ఖండంబు నంత దీపించె;
నాల్గు వందల కోట్లు భక్త జనంబు

శరణని చొచ్చిరి బుద్ధ మతంబు.
రాజుకు వలపలఁ గూర్చుండె గురుఁడు
అటు నిటు చుట్టును దేవదత్తుఁడును
ఆనందుఁ డాదిగా నాస్థాన జనులు,
భిక్షుకులకు నెల్లఁ బెద్దలై నట్టి
సిరియుత మొగ్గలుల్ నిలచిరి వెనుక;
ముద్దుల మోముతో మోకాళ్ళ ముందు
గంభీర వదనునిఁ దనతండ్రిఁ జూచె
ఆశ్చర్య నయనాల కొడుకు రాహులుఁడు;
పాద పద్మంబుల పజ్జను జేరి
పుణ్యంపు రాశి యశోధరా దేవి
—ముందుగా దనకంత తెలిసెఁ గాఁబోలు
క్షణికమౌ శారీరిక ప్రేమ దాఁటి,
నిశ్చలంబగుఁ ప్రేమ వారాశిఁ గనుచు,
చావును గెలిచెడి తుదిచావుఁ జూచి,
నాథుని కరకమ లాంబుజంబందు
నిజ మృదు కరపల్లవంబును బెట్టి,
ఆతని కాషాయ వస నాంచలముల
తన వెండి పైటకొంగునఁ జుట్టఁ బెట్టె,
విజయ మిదియ నాకు నాథున కనుచు;
ఎవ్వాని బోధికై యెదురుగా జూచె

ముడిచిన కేళుల ముజ్జగంబులును
ఆతని కత్యంతమును గూర్చి నట్టి
ఆ మహాసాధ్వి తాఁ బతి మది నిలిపి.

ఆ మహాత్ముని ముఖ పద్మంబు నుండి
ఆనాడు వెలువడ్డ బోధామృతంబు
నేమని వాకొందు నెటుల వర్ణింతు?
చెప్పఁజాలను కొద్ది గొప్పలో నైన,
తఱువాత వచ్చిన వాఁడను నేను.
బుద్ధ విజ్ఞాన మహాజ్యోతిఁ గాంచి
ముగ్ధుఁడనై నేను జెప్పఁ బూనితిని,
కన్నంత విన్నంత తెలిసిన యంత
వివరింతు, నాపైని శక్యమే తెలుప.
ఆది సందేశంబు కొంతైనఁ దఱిగె
గ్రంథస్థ మొనరుప కాలక్రమమున;
అందఱి నొప్పించె నాదిలో నద్ది
శక్తి వంతంబయి శరణు నొసంగి.
గ్రంథస్థ మగుదాని గొంతకుఁ గొంత
వివరింపఁ బూనెద వివరంబు గాను:
వినుటకుఁ గూడిన వారికి మించి
లక్షలు కోట్లగపడనట్టి వారు,

స్వర్గము నరకము నిర్జనంబుగను
ఏడు స్వర్గాలలో నున్నట్టి వారు
నరక కూపములందు నలిగెడి వారు
ప్రేతాలు భూతాలు దేవతాదులును
వినయంబు తోడుత వచ్చిరి వినఁగ,
భక్తియు శ్రద్ధయు బెనఁగొన మదిని.

శ్రద్ధతోఁ దిలకించు శిఖరాల మీఁద
ప్రొద్దైన నెఱుఁగక పగలు తా నిలచె,
అరుణ కాంతులు దిశ లల్లుకొనంగ.
లోయల రాతిరి, కొండలఁ బగలు
కదల కేకాగ్రత వినునట్లు తోఁచె;
ఈ రెంటికి నడుమ కెంజాయ సంజ
చూడఁ జూడఁగ జక్కఁదనమున నొప్పె,
ప్రేమంపు వివశతఁ జొక్కి చెన్నారు
నాకలోకము లోని కన్నె మాదిరిగ,
క్రమ్ము చీకఁటి చీరగా నలరార,
తేరిన మబ్బులు నెఱి కురుల్గాగ,
జాబిల్లి పాపట బొట్టునా మెఱయ,
చుక్కలు మెడలోని రత్నహారముగ,
ఆ కొమ్మ కమ్మని సిట్టూర్పు లనఁగ,

మెల్లఁగా జల్లని తెమ్మెర ల్వీచె,
బుద్ధుండు బోధించు శుభ సమయమున,
ఆర్యు లనార్యులు, నగర వాసులును
కోయలు మూఢులు పండితు లనక
వర్ణు లవర్ణులఁ భేదంబు లేక
బుద్ధుని బోధన వార్వారి బాస
విన్నట్టుగా వారు తెలియంగ గనిరి.

అంతియ కాదయా, యా ప్రాంతభూమి
వసియించు వృక్షముల్ పక్షులు పొదలు
తాళులు అప్పలు పచ్చిక పూలు
నేల నీటను నింగి నుండెడు ప్రాణి
నేల నీటను నింగి నిండిన గురుని
ప్రేమామృతంబును గ్రోలంగఁ గూడె.
జింకయు ముంగిస నక్క తోడేలు
బెబ్బులి నెమలియు దాబేలు పాము
చేపలు చీమలు గ్రద్దయు కాకి
అన్నియుఁ దమకన్న క్రూరుఁడౌ నరుని
అన్నదమ్ముల వలెఁ గూడి మెలంగె
చేతనా చేతన జగతి యంతయును
తమ యదృష్టంబును మది మెచ్చుకొంచు

తప్పక జన్మదుఃఖము తీఱు నంచు
బుద్ధుఁడు బోధఁ గావింపఁగా వినఁగ.

ఓంకార మమితము నగుదాని కేను
అంజలి ఘటియింతు నాత్మలో నెంచి.
కొలతకు మీఱిన దాని నే కరణి
పదజాలములతోడఁ గొలువఁగా నగును?
లోతింత యని చెప్పఁగా రాని దాని
మనమను ద్రాటిచే తరమౌనె చేర?
అది యెట్టిదని యడ్గ పెద్ద తప్పౌను,
అది యిట్టిదని చెప్ప గొప్ప తప్పౌను,
కావున నుచితమౌ నచట మౌనంబు.
ఆదియందు వెలసె నంధకారంబు
ధ్యాన నిమగ్నుఁడై యుండె బ్రహ్మంబు.
ఆదియు బ్రహ్మము మన కగుపడునె?
ఈ కండ్లతో జూడఁ గానంగ రాదు
ఈ బుద్ధి నెఱుఁగంగ సాధ్యంబు కాదు.
ఒక తెఱ వెనుకగా నొక తెఱ తొలఁగ
తెఱలు దొంతరలుగా లేవె యావెన్క.
చుక్కలు చెన్నారఁ బ్రశ్నింప నేల?
చావును బుట్టక సుఖము దుఃఖంబు

పనియును ఫలితము కాలక్రమంబు
పురుషుని ప్రక్రియ తెంపెడ లేక
సాగుచున్నది కాదె యది కడలేక,
యేటి నీటి వలెను వడిగఁ దిన్నగను
అదెయయ్యు నదికాక యెప్పుడు మాఱుచును.
ఎండవేడిమికి నావిరిగాఁగ మాఱి
మబ్బు రూపముఁ దాల్చి మలలపై నిలచి
చినుకులుగా జాఱి పాఱుఁగా మఱల
పుట్టిన చోటును గలియగాఁ గడలి,
నిలుపును నిలకడ లేకెల్ల యపుడు.
సంక్షోభ సంఘర్షణంబులఁ గూడి
భూ నభోంతరముల లోకాల నెల్ల
గిరగిరఁ ద్రిప్పునుఁ గాల చక్రమ్ము
ఆపంగ రాకయు నడ్డగా రాక,
ప్రకృతి సిద్ధములైన యీ మాఱుపులను
శ్రద్ధతో గమనింపఁ జాలదా మనకు?
చీఁకటిం బ్రార్థింపఁ గలుగునా వెలుఁగు
నిశ్శబ్దము నడుగ వెడలునా పలుకు;
వ్రతముల దను మనముల క్షోభ పఱుప
ఫలమేమి సోదరీ సోదరులార!
గుడులలో దేవుల బలులతో గొలువ

ఫలపుష్పముల బాల లంచాల నొసఁగ
ఎన్నటి కైనను గలుగునె ముక్తి?
మనమె నిర్మించిన మన చెఱసాల
మన ప్రయత్నాననే కూలంగ వలయు,
ఎల్లరు పరమహా పదమొందగలరు.
మీఁద క్రిందను చుట్టు గలవారి కెల్ల
కాయంబుగల ప్రాణికోటుల కెల్ల
'చేత'యే కావించు సుఖము దుఃఖమును.
భూతమె భావిగా పరిణామ మొందు
మంచికి మంచియుఁ జెడ్డకుఁ జెడ్డ
వరుసగఁ దప్పక కలుగుచు నుండు.
పూర్వ పుణ్యార్జిత శుభ ఫలితముల
సురలు నాకంబున ననుభవించెదరు
పూర్వ పాపార్జిత దుష్ఫలితముల
పాపులు నరకాన ననుభవించెదరు.
కుడువగా నవి యివి కలిగి నశించు
సౌఖ్యంబు దుఃఖంబుఁ దఱితో నొసంగి
శాశ్వత లేదయ్యె దేనికిం గాని.
మంచి పనులు జేయ బీఁద రాజౌను
చెడ్డ పనులు జేయ రాజు బీఁదౌను
చేసిన చేష్టల ఫలితము లివ్వి.

ఇంద్రాధిపత్యంబు నివియ తా మిచ్చు
క్రిమి కీటకాదులుగా జేయు నివియ.
కానరానట్టి యీ కాలచక్రమ్ము
తిరుగుచునే యుండుఁ దీరిక లేక
నిలుపును నిలకడ, కడయైన లేక
మీఁదికి గ్రిందికిఁ జుట్టుచు నుండు.
ఈ పరిభ్రమణంబు నిత్యంబె యైన
తప్పించుకొనుటకు దారి లేకున్న
పరమేష్ఠి హృదయము పాషాణ సమము,
నిష్ఠుర కష్ట మాత్మ స్వరూపంబు.
ముక్తికి మార్గము వెదుకఁగాఁ గలదు.
తియ్యని యమృతంబె యాత్మ సారంబు
సర్వేశు డెందంబు నిర్వాణ సమము.
అంత కంతకు మించి పైకి పోవచ్చు
సాధనచే స్వేచ్ఛ సాధింప వచ్చు
కష్టింప ఫలితము తప్పక దక్కు.
జగతిని గనుపించు దుఃఖంబు గాంచి
సోదర మానవు ల్పడు పాట్లు చూచి
పగులఁగ గుండియ బహు బాధ పడితి
శ్రమపడి సాధించి కంటిని ముక్తి.
స్వేచ్ఛను బొందితి బుద్ధుండ నైతి.

బాధతో మూల్గెడు సోదరులార
ఒరుఁడు శాసింపఁగ లేని లేఁడయ్య
మీరలే మూలము మీ బంధములకు
చావు బుట్టుకలకు సుఖ దుఃఖములకు
నిలకడ లేనట్టి యీ యవస్థలకు
సత్య స్వరూపంబు సోదరులార!
వివరింతు శ్రద్ధతో వినుఁడీక మీరు:
ఊర్ధ్వ లోకములకు నింకను పైన
పాతాళ లోకములకు నింక క్రింద
దూరాన వెలిఁగెడి చుక్కల కవల
చీకటి కావల బ్రహ్మాంబు కవల
శాశ్వతమౌ శక్తి శుభదాయి యగుచు
ఆద్యంతములు లేక యాకసము వలె
అలరారు తథ్యము దివ్య మచలము.
ధరలోన నద్దాని ధర్మమె చెల్లు
పన్నీటి పూలోని పరిమళంబులును
కమల పత్రములోని కళయును నదియ,
కేకి ఫించపు మణు ల్వన్నెయు నదియ,
భూగర్భ మందున విత్తులఁ గూడి
ఆమని వసనంబు నల్లును నదియ,
ఆకాశ మందున నలరారు చంద్రు

మెఱపు వానయు గాలి దాని బానిసలు.
అంధకారము నుండి మనుజు మనంబు
మలచె, గుల్లలనుండి హంస కంఠంబు
మానక కృషిసల్పి మసలక యద్ది
పాడ్వడ్డ నేలల పాత మేడలను
పసగుల్కఁగాఁ జేయుఁ బచ్చగా నలర;
పక్షుల గూళ్లలో గ్రుడ్లు సంపదగ
తేనెటీగల గూళ్లు తేనె కుండలుగ
కలవు దానికి; దాని రీతులు గతియు
గువ్వకుం జీమకు బాగుగా దెలియు.
డేగ యాహారంబు గూటికిఁ దేగ
ఱెక్కల నది చాచు ఱివ్వున నెగుర,
పిల్లకుఁ బాలీయఁ దల్లిఁ దాఁ బంపు,
అతి హీనమైనట్టి యల్పుల కైన
బువ్వను జేకూర్చు కూర్చును జెలుల,
అందఱికిం గూర్చు నూత యన్నిటికి;
పాలిండ్లలో గూర్చు బాపకుఁ బాలు
విసముఁ గూర్చును నోట నదియ పామునకు.
ఆకాశ మందున నడుగు దప్పకను
బ్రహ్మాండముల నెల్ల నాట్య మాడించు,
భూ గర్భమందున బంగారు నెండి,

రత్నాల రవ్వల రాసుల నింపు,
వనముల ఛాయల వసియించి తాను
వింతైన తీగల పూల పత్రముల
క్రొత్తల నేప్రొద్దు కొనివచ్చు చుండు.
సంహరించును దానె సృష్టించు దానె
విధివ్రాత చెల్లించు పీడక క్రమము,
చావును బీడయు బ్రతుకును దయయు
పడుగు పేకలు గాగ నామగ్గ మాడు.
చెఱచియు నిర్మించి సవరించి యన్ని
ఉన్నదానిని నున్నతంబుగాఁ జేయు,
తెఱవెన్క కృషిసల్పి తీర్చి దిద్దుచును
తిన్నగా సాగించుఁ దన దివ్యపథము

కనుపించు నివియెల్ల గనులకు మనకు
కలవెన్నొ కనులకుఁ గానంగ రాక
మనుజుల మనముల చిత్తవైఖరుల
జనులలో భావాల బుద్ధుల తీరు
ఈ బృహద్ధర్మమె పాలించు చుండు;
కనరాక చేయూత నిడు నమ్మకమున
వినరాక గర్జలతో మేలు కొల్పు,
ఎంతయో శ్రమపడి ఎట్టకేలకును

మంటి ముద్దను దీర్చె మనుజ రూపముగ,
కనుకనె కలిగెను గరుణయు దయయు;
వాఁడు వీఁడను భేద భావము లేదు
అనుసరింపఁగ దానిఁ గలుగును మేలు
అడ్డగింపఁగఁ గల్గుఁ దప్పక కీడు.
మఱగిన మంచికి శాంతియు సుఖము
దాఁగిన చెడ్డకు బాధఁ బొందించు;
జూచు నన్నింటిని సర్వము నెఱుఁగు
మంచికి మంచియుఁ జెడ్డకుఁ జెడ్డ
తఱితోడ నొసగును గుఱి దప్పకుండ;
కాఠిన్య మెఱుగదు వైరంబు లేదు
ఎవ రెంత జేసిన వారికి నంతె
తూచిన యట్టులఁ దగులంగ జేయు
నిప్పు డప్పు డనక యదను నెఱింగి.
దీని నెఱింగిన తెలియంగ రాదె
పరుఁజంపఁ దన్నుఁదాఁ జంపు కొన్నట్లై
అన్యాయమును జేయు న్యాయాధి పతియు
గతిలేక శిక్షఁ దాఁ గుడువంగ వలయు,
అనృత మాడిన నది శాపమై తగులు
దొంగమై దోచిన చెల్లించు బదులు;
అట్టిది ధర్మంబు సన్మార్గ వర్తి

తొలఁగదు నిలువదు నిర్నిరోధంబు,
దాని డెందము నిండు దయతోడ నుండు
దానికిఁ దుదయగుఁ బరమ ప్రశాంతి.
పాటింపరే! దానిఁ బూనిక తోడ.
శాస్త్రము జెప్పెడుఁ జక్కఁగా నిటుల:
ఈ జన్మయగుఁ బూర్వ జన్మల ఫలము
పూర్వ పుణ్యంబులు సుఖముల నొసఁగు
బాధ, దుఃఖంబులఁ బూర్వ పాపములు,
ఏది విత్తిన దాని పంటఁ బొందుదుము.
చూడుమా! పొలములఁ బచ్చని పైరు
గోధుమ, జొన్నలు, రాగియు వరియు
ఎట్టిది విత్తిన నట్టిదే పండు;
అట్టిదే మనుజుని తలవ్రాత కూడ
సత్కృషి సలుపంగ సద్బుద్ధి మెలఁగ,
పన్నీటి యంటుల ఫల వృక్షములను
మంచి చోటను బెట్టి బాగుగాఁ బెంచ,
తావుల బూవుల తియ్యని పండ్ల
కమ్మని పంటల గోయఁగా వచ్చు;
ముళ్లకంపల విష వృక్షాలఁ బెంచ
అవి దుష్ఫలిత మిచ్చు దుఃఖము బాధ.
ఇంతయు బుద్ధి నెఱింగిన వాఁడు

మున్ను జేసిన పాతకంబులఁ బాయ
ఓర్మితో సహియించు నెద్దాని నైన.
సత్యంబు దయయును సహచరు ల్గాగ
కొఱవ యెవ్వరికిని గలుగఁ జేయకను
కల్లయౌ నాత్మాభిమానంబు నెల్ల
కూకటి వ్రేళ్ళతోఁ బెకలించి వైచి
పాపంబుఁ బరిహార మొందించుచుండు;
ఓపి యడంకువ నోర్చి యన్నిటిని
తన్ను దిట్టిన వాని దయతోడఁ జూచి
మంచినే వానికి మగుడఁ జేయుచును,
సత్యంబు దయయును లోనుగా దలఁచి
సకల భూతంబుల క్షేమ మెంచుచును
నిత్య పవిత్రుండు నిర్మలుఁ డగుచు
కోరికలెల్ల సమూలముఁ బెరికి
జీవితాశయు మాని జీవించు వాఁడు;
కల్మషంబుల నెల్ల కడఁగి పోఁద్రోలి
మృతుఁడయి బ్రతుకు బూటకము చాలించు.
చేసిన సత్కృతుల్ బలసి తన్గాలువ,
సత్ఫలితంబులు సంపన్నుఁ జేయ
జీవితావసరమే లే దికాతనికి;
అంతంబుఁగాఁ ద్రోడ వచ్చిన దెల్ల

నరుఁడుగాఁ బుట్టిన పనిని సర్వమును
సాధించె నాతఁడు నిశ్శేషముగను;
కోరిక లాతని గదలింప లేవు,
దోషంబు లాతని దగ్గఱ రావు
భౌతికంబగు దుఃఖ సుఖముల బాధ,
శాశ్వత శాంతిని చెనకఁగా లేవు,
చావును బుట్టువు లేవి కాతనికి,
నిర్వాణ పదవిని బొందు నాతండు,
జీవికఁ జాలించి బ్రహ్మైక్య మొందు
తనువును జాలించి సుఖపడు నతఁడు.
ఓం మణిపద్మే హుం. మంచు బొట్టిదిగో
తళతళ కడలిలోఁ బడెఁ జాఱి, చూడు.

ఇది కర్మసూత్రంబు వినరె సోదరులు!
పాప పంకం బంత యంతరింపంగ
నూనె యున్నవఱకు వెలి గాఱి పోవు
దీపంబు పోలిక జీవిక చావ,
చావును దానితో సహగమన మగు.
'నేనుంటి' 'నున్నాను' 'నేనుందు' ననకు;
ఒకసత్రమున నుండి వేఱొండు జేర
బాటసారివి కావు సాగుచుఁ బోవ.

విస్మరించుచు కాయకష్ట సుఖముల.
జన్మాలలోఁ గడసారి జన్మంపు
ఫలితంబు పైఁబడు విశ్వంబు నందు
పట్టు ప్రువ్వును బోలెఁ బట్టును గట్టి
దానిలో వసియించు జీవియై యద్ది,
దూది పింజలతోడి జిల్లేడు గింజ
గాలికి గుట్టల మిట్టలఁ గడచి
తేమలోఁ బడి బుట్టి పెరిగెడి రీతి,
గ్రుడ్డులో వృద్ధియై పిగులక మున్నె
తగు రూపమును బిల్ల పొందెడి మాడ్కి,
వచ్చి, మంచిని జేయుఁ జెడ్డను గూడ.
హంతయా మనుజుండు పంచత్వ మొంద
కలుష యుక్తంబగు తజ్జీవి మిగుల
బాధతో నల్లాడి పొరలుచు నుండు
తహతహ నొందుచు నిలకడ లేక;
కాలధర్మము నొంద సాధు సజ్జనుడు
తీయని తెమ్మర మెల్లఁగా వీఁచు,
జగతి ధన్యంబని తన్ను భావించు,
ప్రభవించుఁ దగుచోట నుత్తమంబుగను
ఇంకి, యెడారిలో నిర్మల మగుచు
పునరుద్భవించెడి సెలయేటి వలెను;

సత్సంచితంబు లౌ సౌఖ్యంబు నిచ్చు,
దుష్కర్మ భారమై పోనీదు పైకి.
ఏది యొకైన కల్పాంతము వఱకు
ప్రేమ సామ్రాజ్యంబె పరగంగా వలయు—
మోసగించు మనల నేది? కన్గొనుఁడు.
అంధకారము నుండి పుట్టె నవిద్య
విషయ వాంఛల తోడ నది మోసగించు.
భ్రమపడి నిత్యము లవి యని నమ్మి,
వానిఁ పొందగఁ గోరి తహతహ పడుచు
పొంది విడువలేక బాధ నొందెదము.
ధర్మానువర్తులై శాంతత మీఱి
మధ్య మార్గముఁ గోరునట్టి వారికిని
నిర్వాణ పథమున నేగు వారికిని
వినిపింతు గొప్పవౌ నాల్గు సత్యముల.

మొదటిది దుఃఖము, మోసపోవద్దు
మన కెంతో మోజగు మనుగడ యంత
కడదాక యాతన, కడగండ్లె మిగులు,
క్షణిక సుఖము లవి పక్షులఁ బోలి
వచ్చియు నిలువక వెంటనే పోవు;
పుట్టుక కటకట, తడఁబడు బాధ,

తృప్తిని గనలేని రగులు యౌవనము,
నిలకడ లేనట్టి నడిమి వయస్సు,
మూఁడు కాళులతోఁడి ముదుసలి తనము,
ఊపిరి యాడని మరణ యాతనము,
వీనితో నిండెను మన కాలమంత;
ప్రేయసి ప్రియురాలె ప్రాణము ల్లోవ
అన్నువ చన్నులు ముద్దుల మోము
కాటిబిచ్చునఁ బడి కాలి పోవలదె.
శౌర్యంబు శ్లాఘ్యమే, వీరుఁడు నీల్గ
కాకులు గ్రద్దలు చేయు ముక్కలుగ,
సొంపగు నీ నేల సొగసుల మిగిలి
కాఱడవుల లోన మృగము లన్నియును
జీవించు కాంక్షతో వానిలో నవియె
ఒకదాని మడియించి వేఱొండు తినదె,
నింగి సొంపారును నీలపు రుచుల
కాటకము ల్రాఁగ నిడదు వర్షంబు,
ఏ సౌఖ్యములు లేక యెప్పుడు మూల్గు
ముదుసలి నడుగుము మధురమో బ్రతుకు,
రుజలంట రోదించు బడుగుల నడుగు
బ్రతుకెంత తీపియో బదులు సెప్పెదరు,
బిడ్డఁడు ధీశాలి బయట పడఁగనె

రోదించు నాకేల బ్రతుకిది యంచు,
దుఃఖ మూలంబు ద్వితీయ సత్యంబు:
కోరికయే దుఃఖమునకు మూలంబు.
ఇంద్రియంబులు సుఖాసక్తంబులగుడు
రాగంబు పుట్టును జ్వాల పోలికను,
తృష్ణాగ్ని జ్వలియించు విషయ లోలతను,
నీడల గలలను నిజముగా నెంచి
వెంటాడు భ్రమతోడ విడువక వాని,
"నేన"ను మిథ్యను నెలకొల్పి నడుమ,
మిథ్యాప్రపంచంబు గల్పించి చుట్టు,
నిజమగు రూపంబు గానంగ లేక
పరతత్త్వమును దాను బరికించ లేక
ఆత్మ ప్రబోధంబు నాలకింపకను,
గ్రుడ్డియై, చెవిటియై, చెనటియై యిట్లు,
పై చూపు నరికట్టి పెడదారి బట్టు,
తగవులు చెలరేగుఁ దహతహ పొడము,
కయ్యాలు జగడాలు విరివిగా బెరుగు
కష్టము ల్గలుగగఁ గన్నీరు గార్చి
విలపింత్రు జనములు వాని బాధలకు.
రాగంబు గోపంబు నీసు నసూయ
పెరుఁగఁగఁ బాపపంకిలములో నడల

దొరలింత్రు దినములు దుర్బుద్ధిఁ జిక్కి.
పుట్టియుఁ బెరిగియుఁ బండ్లను బంట
పూవుల నంగించు భూజము ల్బదులు
విషవృక్షములు బుట్టి వ్రేళ్ళూను నచట.
మంచి విత్తులు మొల్చి మొలకొంద గలవె?
రాగ పానంబున మత్తెక్కి యాత్మ
మఱుగునఁ బడిపోవు, తృష్ణ తీక్ష్ణముగ
కర్మలఁ బ్రేరేచు, దాహ తాపమున
మసివడ్డ మందాత్మ మగుడ నేతెంచి
భ్రమ జాలములఁ జిక్కి బద్ధుఁడై యుండి
పాప పంకంబులఁ బొరలాడు చుండు.
మూడవ సత్యంబు దుఃఖ విరమణ,
అంతరింపఁగ నహంభావము తనకు,
మనుగడపై నాస మరణ మొందంగ,
మదిలోన కుదురున్న రాగాల నెల్ల
కూకటి వ్రేళ్ళతో గుదిలించి వైచి,
అంతరంగము లోని నలజడి మాన్ప
పరమమౌ శాంతము ప్రభవమ్ము నొందు.
సచ్చిదానందమౌ మూర్తిని సతము
ఆరాధనము సేత సత్ప్రేమ కాగ,
తనకుఁ దా దొరయాట సత్కీర్తి కాగ,

దేవతలను మించు దివ్యజీవనము
తనకొక భూషణమై యలరార,
నిష్కామ కర్మము నకలంక సేవ,
తియ్యని పలుకులు కమ్మని నడత,
తఱుఁగని వెలలేని సంపద ల్గాఁగ,
శాంతి సామ్రాజ్యంబు శోభతో వెలుగు,
బ్రతుకులో నియ్యవి తఱుఁగ వొక్కింత
చావుతో నియ్యవి సడల వొక్కింత.
చావును బుట్టుక సమసి పోవంగ
దుఃఖము తనకుఁ దాఁ దుదముట్టు నిజము.
దీపంబు వెలుగునే తైలంబు లేక?
ప్రాతదౌ ప్రారబ్ధ మంతయు గడువ
నూత్న జీవన మది నిర్మల మగుచు
నరున కొసంగును నిండు సంతృప్తి.
నాల్గవ సత్యము ముక్తి మార్గంబు:
సుగమము, సులభము నాతి దూరంబు,
ఎల్ల వారికిఁ బోవ ననువైన త్రోవ,
శాంతి భద్రతలను సమకూర్చు బాట
అష్టాత్మకంబగు రాజ మార్గంబు
చెప్పెద వినరయ్య చెవియొగ్గి మీరు.
జిగి మబ్బు లలముఁగ పొగమంచు కప్ప

పర్వతాగ్రము లవ్వొ రమ్యమై తోచు.
చేరఁగా నచటికిఁ ద్రోవలు మెండు,
చుట్టుబాటలు సూటిగా బోవు నవియు;
నిష్ఠురంబు మిగుల కష్టసాధ్యంబు
చీల్చుక పైఁబోవు సూటియా దారి,
గాలి వానలతోడఁ గడు భయదంబు,
కొండల నడుమగాఁ గొనసాగి పోవు.
గట్టి వారికిఁ గాని పోఁ గష్ట మౌను.
దుర్బలుల్ చుట్టుచు విశ్రమించును.
నెమ్మది మెట్లెక్కి పై కేఁగవలయు.
ఇట్టి చుట్టగు బాటఁ జూపెద నేను.
కొందఱు చరచర నడచి పోయెదరు
సూటి బాటను బట్టి; చుట్టు దారులను
కొందఱు నెమ్మది నెక్కి పోయెదరు
అందఱు కడకెట్లో యచటఁ జేరుదురు.

మొదటి మెట్టగును సత్సిద్ధాన్త మనఁగ.
ధర్మంబె శరణుగా హింస వర్జించి,
కీడును మేల్జేయు కర్మల నెఱిఁగి,
ఇంద్రియాదుల కెల్ల నేలిక యగుట.
రెండవ మెట్టు సత్సంకల్ప మగును;

సర్వ భూతము లందు సదయత మెలఁగి,
కోపము నాశయు క్రౌర్యంబుఁ జంపి,
చల్లని కమ్మని తెమ్మెర ల్వోలె
మృదుమధురంబుగ బ్రతుకు గడపుట.
మూఁడు సత్సంభాషణం బనుమెట్టు;
పెదవులు రాజ సౌధంపు ద్వారములు,
అదుపులో నుంచుక యందచందముగ
నెమ్మది నాడెంబు నింపుఁ దళ్కొత్త
లోని యేలిక మెప్పుఁ గొను పల్కు లగును.
నాలుగు సత్ప్రవర్తన మను మెట్టు:
తప్పును దుడుచుచు నొప్పును బెంచు
పనుల నెల్లప్పుడు పొనరింప వలయు,
పూసల నడుమను మనకుఁ గన్పించు
వెండి పోగును బోలి దండియా ప్రేమఁ
బ్రకటింప మన మొనరించెడి పనులు.

ఊర్ధ్వ గతులు నాల్గు గల్గు నాపైన,
ఇహ విషయంబుల విడచిన యట్టి
గట్టి కాళ్ళచ్చుట, గదలఁగఁ గలవు,
'స్వచ్ఛత' యన, 'సదాలోచన' యనఁగ,
'ఏకాంత' మన 'సదానందం' బనంగ,

వచ్చియు రానట్టి రెక్కల తోడ
ఎగురంగ బోకుమా భానుని కడకు
మాడిపోదువో యేమొ యెండ వేడిమికి,
ధృఢతరంబగు నట్టివారి కా నడలు
మనకగుఁ దెలిసిన యట్టి మార్గాలు,
క్షేమము సుగమము నగునట్టి గతులు.
పెండ్లము బిడ్డలపై నున్న ప్రీతి
ఆటపాటల రక్తి చెలులపై తీపి
పూర్వ పుణ్య ఫలములై పొంది మనల,
ప్రతిబంధకములగు భ్రమియింపఁ జేసి;
జన్మ రాహిత్యంబు నొందని మనకు
ఇంపగు సొంపగు నిట్టి పోకడలు.
కాని, లోపాల సోపానము లేజసి,
భ్రమలను విడనాడి బంధము ద్రెంపి,
పరమ సత్యము వైపు పోవలెఁ బైకి
అనువగు మార్గాల ననుసరించుచును,
పాపభారము తగ్గ బైపైకిఁ జనఁగ
ప్రథమ ఘట్టంబును జేరు నాతండు.
నాలుగు నిజముల నెనిమిది గతుల
ఆత దెఱుంగును, క్రమముగా బిదప
నిర్వాణ సౌఖ్యము నొందు నాతండు.

రెండవ ఘట్టంబుఁ జేరు వానికిని
భ్రమము సందేహంబు లోని యలజడి
లేవు, కోరిక లెల్ల లేకుండఁ బోవు,
పుస్తకా ల్గురువులతోఁ బనిలేదు.
కలదొక్క జన్మమే కడసారి మిగిలి,
దీనికి పైన తృతీయ ఘట్టంబు,
మాలిన్య మది పోవ ప్రవిమలంబగుచు
ఆత్మ తా భాసించు; భూత జాలముల
ప్రేమతోఁ జూచుచుఁ, బరమ ప్రశాంతి
బ్రతుకు బంధమునుండి బయటకు వచ్చి,
జన్మ రాహిత్యంబు నొందు నాతండు,
అతి నిర్మలాత్ములై కట్ట కడపట
నాల్గవ ఘట్టాన నలరారు చంద్రు,
బుద్ధులు పరమ పవిత్రులు వారు.

ఈ ఘట్టముల నెల్ల నధిగమింపంగ,
ఘోర యుద్ధము లోన వీరుల చేత
మడియింపఁ బడినట్టి శాత్రవ దశక
మగపడు, నవియె యీ దశ దురితములు:
ఆత్మాభిమానంబు, కల్లనమ్మికయు,
వాంఛ, సందేహంబు, ద్వేష మనంగ,

మూడు ఘట్టంబుల దాటిపో వీని,
ఆపైని, శేషించు నిల జీవితాశ,
నాకంబుపై నాశ మఱియు స్వోత్కర్ష,
తప్పులుసేయుట, గర్వించుటయును.
సమయింప వీనిని శిఖరాగ్ర మెక్కి,
అంతు పొంతులు లేని యాకాశ మట్లు
నిర్వాణమును జేరు నిశ్చయంబుగను.
దేవత లాతని యున్నతిఁ గాంచి
కలుగునా మనకని కలవరించెదరు,
ముల్లోకములు వానిఁ గదలుప లేవు,
ఆతని కిఁక లేవు చావు బుట్టుకలు,
కర్మసూత్రం బింక పని చేయలేదు.
నశియింపగా నాశ, సర్వంబు నొందు,
బహ్మాండమగుఁ దాని "నేను" పోవంగ,
లేమియే నిర్వాణ మని చెప్పువారు
కల్ల బల్కెదరని కానంగ వలయు,
బ్రతుకుట నిర్వాణమని చెప్పువారు
పొరబాటు తమదని యెఱుఁగంగ వలయు,
తమ తెల్వి తక్కువచే గానలేరు
అట్టిట్టిదని చెప్పఁ నలవి కానట్టి
ఆనందధామమహా నా పరంజ్యోతి,

కావున ధర్మాను వర్తులుగందు,
ద్వేషంబు కంటెను దుఃఖము లేదు,
రాగాదులకు మించు బాధలు లేవు,
ఇంద్రియంబుల మించు మోసము లేదు.
గాఢ దోషంబొందు పోకార్పఁ గాను
ఎంతయో ముందుకు సాగినట్లగును,
కావున ధర్మానువర్తులు కందు,
దప్పిని దీర్చెడు తియ్యని నీరు
వాడని పూవులు, మధుర ఫలములు,
కలవు కొల్లలుగాఁగఁ గొఱవలే కచట
హాయిగా కాలము కనరాక కదలు.
రత్న రాసుల మించు ధర్మ భాగ్యమ్ము,
తియ్యందనంబునఁ దేనెను మించు,
అసమాన మతిశయ మానంద మచట.
దాని స్వరూపంబులై తనరారు
పంచ శీలంబులఁ బాటింపరయ్య!
కటికతనము మాను కనికర మూను,
ప్రాణికోటి పయిన మాపఁగ వలదు,
క్షుద్ర జంతువు నైన చంపఁగా వలదు.
ఈవచ్చుఁ బ్రీతితోఁ దీసికో వచ్చు,
పేరాస, మోసాన, బలిమిని గాదు,

తనది కాకుండినఁ దాకఁగ రాదు.
పరనింద, రూపించి పలికి బొంకుటయు,
దబ్బర లాడుట తగ దెన్నటికిని,
నిర్మలాత్మ పలుకు నిజ మెన్నటికిని.
మైకంబు పుట్టించు మందు మాకులను,
వర్జింప వలయును గల్లు సారాల;
మనసు నిర్మలమైన గంజాయియేల?
వ్యభిచరింపకు వావి వరుసలు మాని
పరకాంతఁ గోరకుఁ కలలోన నేని.

బుధులును గురువులు బంధులు సఖులు
పిన్నలు పెద్దలు పసివారి యందు
తల్లిదండ్రుల యెడఁ దగు వర్తనంబు
గూఱిచి బోధించె బోధిసత్వుండు,
ఇంద్రియ బంధాల నెడలింప లేక
ఉన్నత పథముల నడువఁగ లేక
ఉన్నట్టి వారలు కృషిసల్పి తాము,
షౌరషాచ్ఛెములు లేక పథము దప్పకను
కొన్ని యడుగులైన కొనసాగ వలయు,
దాన ధర్మము లందు దత్పరులగుచు
తను భావమును బూని యపకారి కైన

ఉపకార మొనరింప నుర్విలోఁ దమకు
ముందు జన్మంబున నున్నత మైన
గతి కల్గునని లోనఁ దలపోసి, మఱియు
తన్నెట్లొ పరునట్లు ప్రేమతోఁ జూచి,
వినయము నోరిమి కనికర మొప్ప
నిర్మలులై ప్రొద్దు పుచ్చంగ వలయు,
అనియు బోధించెను నా దయాశాలి.

అంతకు ముందొకనాడు బుద్ధుండు,
సింగాలుఁడను వాని సుస్నాతుఁ జూచె;
వేకువ జామున బువ్వ ముద్దలను
నాలుగు కడలను గ్రిందను బయిని
బలు లొనరించుచు నున్నట్టి వాని,
"ఏమిట్లు సల్పెదు తెల్పవే" యన్న,
"అన్ని తట్టులనుండి హాని రాకుండ
పెద్దలు సెప్పిన సుద్దిది" యన్న,
నవ్వుచు బుద్ధుండు వానితో ననియె:
"మానుము దీనిని, ప్రీతితో నీవు
కానుకగా నిమ్ము కమ్మని తలఁపు,
నెనరైన పనులను దియ్యని పలుకు,
తలిదండ్రులను బోలు తూరుపు దిశకు

ఎచ్చోటనుండి తా వెడలు వెలుంగు;
గురువులకుంబోలె దక్షిణ దిశకు
ఎచ్చోటనుండి తా సంపదవచ్చు;
పెండ్లము బిడ్డల పోలికం దనరు
పడమటి కడకు నెచ్చోట తాఁ గాంతి
వింత రంగుల దాల్చు దివసాంత మందు;
ప్రేమయు శాంతియు, బెంపెసలార
చుట్టాలఁ జెలులఁ బో లుత్తర దిశకు;
క్రింది లోకము లోని జీవ రాసులకు;
పై నున్న పెద్దలు, బుద్ధులు, సురలు,
మొదలైన వారి కందఱకును భక్తి;
భద్రత చేకూరుఁ బాయును గీడు."

ఇహబంధముల వీడి దృఢతము లగుచు
సూర్యుని కడకేఁగు గ్రద్దల వలెను
పైపైకిఁ బోవు ప్రజ్ఞాన్వితు లైన
తనసంఘ మందలి సన్న్యాసులకును
ఉచితరీతిని దెల్పెఁ దగు ధర్మములను
మనసునకుంగల యాఱవస్థలను,
శక్తి పంచకమును, ద్వారాష్టకంబు,
ఇద్ధి, యుపేక్షయు మొదలుగాఁ గలవి,

భవ్యాత్మలకు సుధ ద్రావించినట్లు,
పంచ భక్ష్యంబులు తినఁబెట్టి నట్లు,
సంఘపు విధుల, భిక్షుకుల వేసముల,
ఆహారనియమ విహార విధులను
విపులముగాఁ దెల్పె విస్పష్టముగను,
సంఘంబు లోకంబు సేవ సేయుటకు
శక్తివంతంబైన సాధన గాఁగ.

ఈరీతి నాఁడేయి బోధిసత్వుండు
ధర్మ బోధన సల్పె; వినువారి కెల్ల
కునుకైన రాలేదు, వినెడి హర్షమున
మునిగి తేలిరి వారు ముదమున నాఁడు
ప్రభుఁడు వెల్వఱచిన వాగమృతమున;
ముగిసిన పిమ్మట ముదుసలి రాజు,
గ్రక్కునఁ దా లేచి పీఠంబు నుండి
తనయుని కడ కేఁగి మూర్కొని శిరము
అవనతుఁడై వంగి "యోపుత్త్ర నన్ను
నీబంటు బంటుగా నేలు" కొమ్మనియె.
ఆనందమున యశోధర యిట్లు పలికె:
"ఓయయ్య నీపట్టి రాహులుఁ గాంచి
ఈవయ్య యెనలేని వారసత్వమును

అసమాన మైనట్టి నీ దివ్యధనము"
ఈవిధంబుగ వారు మువ్వు రా రేయి
సంఘపు శరణంబుఁ జొచ్చిరి వేడ్క.

ఎఱిఁగియో యెఱుఁగకో యొకకొంత నేను
ధర్మము దయయును రూపొంది నట్టి
బోధిసత్త్వుని గూర్చి బోధను గూర్చి
భక్తితోఁ జెప్పితి; నాపని ముగిసె,
ఆమీఁద నలుబది యైదేండ్లు గురుఁడు
ఎన్నిచోట్లకో పోయి యెంద ఱెందఱకో
నాశంబు తెఱుగని నిజములఁ జాటి
నిత్య నూతనములౌ సత్య ధర్మముల
ప్రాగ్జ్యోతి వెలిగించె; నా కాలమందు
రాజులు రాజాధిరాజులు ప్రజలు,
శరణంచు మతమును స్వీకరించియును
కొండల గుహలందు స్తూపాల మీఁద
చెక్కించి బుద్ధుని ధర్మ బోధనము
చాటిరి మార్మ్యాల జనులెల్ల వినఁగ.
అయువు నిండఁగఁ గాలము దీర
వచ్చినపని సర్వమును ముగియంగ
పరమ పదము నొందె దాఁ దథాగతుఁడు,